TPLG101B115

# వేగుచుక్క

[నవల]

మూలం:

టర్గినీవ్

అనువాదం:

శ్రీనివాస చక్రవర్తి

ముఖచిత్రం:

కృష్ణమూర్తి



A

Sahini Publication

# టర్జనీవ్ జీవిత చిత్రణ

ఇవాన్ సర్జియేవిచ్ టర్జనీవ్ మధ్యరష్యాలోని ఓరియోల్ రాష్ట్రంలో స్పాస్కోయె అనేచోట 1818 లో జన్మించాడు. ఇంటి సేవకులనూ, బానిసలనూ కఠినంగా దండించినట్లే తన సంతానాన్ని టర్జనీవ్ తల్లి అతిగా దండించుతుండేది. ఏమాత్రం తప్పుచేసినా కొరడాదెబ్బలు తప్పేవికావు! ఈ క్రూరదండన భరించలేక టర్జనీవ్ ఒకనాటిరాత్రి ఎక్కడికైనా పారిపోదామని యత్నించాడు. కాని మేడమెట్లు దిగివస్తుంటే అతనికి ఇంటిదగ్గిర చదువు చెప్పే పంతులుచూసి బుజ్జగించి ఆ యత్నం మాన్పించాడు.

ఇంటిలో టర్జనీవ్‌కి సుఖమంటూ ఉండేదికాదు. అందుకని ఇంటి చుట్టూ ఉన్న తోటలో ఆడుకొంటూ పరిసర ప్రకృతి దృశ్యాల రమణీయతనుచూసి ఆనందిస్తుండేవాడు. బాల్యంలో ప్రకృతి రమణీయత అతని హృదయంలో హత్తుకొని పోవడంవల్లనే అతని నవలలోని ప్రకృతివర్ణనలు అతి రమ్యంగా ఉంటాయి.

తొమ్మిదోఏట మాస్కోలోని ఒక బోర్డింగుస్కూలులో చదువు ప్రారంభించాడు. ఆరు సంవత్సరాలు అక్కడ చదివినతర్వాత మాస్కో విశ్వవిద్యాలయంలో టర్జనీవ్ చేరాడు. ఒకసంవత్సరం తర్వాత పీటర్స్‌బర్గ్ విశ్వవిద్యాలయంలో భాషాతత్వశాస్త్రాభ్యాసం మొదలుపెట్టాడు. అక్కడ ఉండగా విపరీతంగా చదవడం, పద్యాలు వ్రాయడం ప్రారంభించాడు.

అది పుష్కిన్ మహాకవియుగం. అప్పటికే గొగోల్, లెర్మాన్‌టోవ్‌లు ప్రఖ్యాతిలోకి వచ్చారు. టాల్‌స్టాయి దస్కొవస్కీలు ఇంకా చిన్నపిల్లలు. ఆరోజుల్లోనే టర్జనీవ్‌కి పుష్కిన్ రచనలంటే గొప్ప గౌరవం ఏర్పడి జీవితాంతంవరకు ఆగౌరవం అలానే నిలిచిపోయింది.

పీటర్స్‌బర్గ్ విశ్వవిద్యాలయంలో పట్టభద్రుడై టర్జినీవ్ చదువుకు బెర్లిన్ వెళ్ళి యూరపు అంతా సంచారం చేశాడు. బెర్లిన్‌లో నిశ్చింతగా కాలంగడుపుతూ సంగీతం, లలితకళలు, ప్రేమకలాపం, ప్రకృతి దృశ్యావలోకనలలో ఆశక్తి తీసుకోసాగాడు. టర్జినీవ్‌ని ఎక్కువగా ఆకర్షించింది వేదాంతశాస్త్రం. అయితేనేం రాజకీయాలమీద కూడా దృష్టివుండేది. అప్పుడే ప్రఖ్యాత అరాజకవాది మైకేల్ బకూనిన్‌తో స్నేహమేర్పడింది.

ఈ నవలలోని బెర్సెనీవ్‌లాగానే టర్జినీవ్‌కూడా వేదాంత శాస్త్రాధ్యాపకుడు కావాలని కలలు కంటూండేవాడు. రష్యాకు తిరిగివచ్చి ఈ ఆశయంతోనే అధ్యయనం ప్రారంభించాడు. కాని ఈ ఆశయం సఫలం కాకుండానే ప్రభుత్వ దేశీయశాఖలో ఉద్యోగిగా చేరాడు. కాని ఈ ఉద్యోగం మనస్కరించక రెండుసంవత్సరాల తర్వాత మానుకొన్నాడు. ఆ ఉద్యోగంలో ఉండగానే 1843లో 'పరషా' అనే పద్యకథానిక ప్రచురించాడు. ఆనాడు గొప్ప విమర్శకుడుగా పేర్గాంచిన బెలిన్‌స్కీ ఆకథానికను మెచ్చుకుంటూ ఒకవ్యాసం రాశాడు. ఆవ్యాసం టర్జినీవ్‌కి సంభ్రమాశ్చర్యాలు గలిగించింది.

ఆరోజుల్లో పీటర్స్‌బర్గ్‌లోని ప్రఖ్యాత రచయితలు, కళావేత్తలు, విమర్శకులు ఒక సంఘంగా ఏర్పడి బానిసవిధానానికి వ్యతిరేకంగా ఆందోళన చేయసాగారు. టర్జినీవ్ ఆసంఘంలో చేరి అందరి మన్ననలు అందుకున్నాడు. "అసాధారణ ప్రతిభావంతుడు" "అతిమంచివాడు" అనిపొగిడాడు బెలిన్‌స్కీ. ఇక దస్తవస్కీ అన్నాడు "కవి, ప్రతిభావంతుడు, ఘరానామనిషి, అందమైనవాడు, భాగ్యవంతుడు, తెలివైనవాడు, సంస్కృతీపరుడు. ప్రకృతి ఇతనికి ఏంలోటుచేసిందో నాకు తెలీటంలేదు."

1847లో తొలిసారిగా టర్జినీవ్‌కి సాహితీ రంగంలో గొప్పవిజయం లభించింది. ఇక సాహిత్య రంగం పరిత్యజిద్దామనుకొంటుండగా 'కంటెంపొరరీ' అనే పత్రిక సంపాదకుడు టర్జినీవ్ రచనలు కావాలని కోరాడు. టర్జినీవ్ ఆనాటిరైతుల, గ్రామీణ ప్రజల జీవితా చిత్రిస్తూ 'షూర్ అండ్ కాలినిచ్' అనే పేరుతో వరుసగా చిన్న చిన్న పదచిత్రాలు ప్రకటించాడు. దాంతో టర్జినీవ్‌కి గొప్ప పేరు ప్రతిష్టలు లభించాయి.

ఈ పదచిత్రాల ప్రకటనతో టర్జినీవ్ సాహిత్య జీవితంలో గొప్ప మార్పు వచ్చినట్టే ఇంకో సంఘటన అతని వ్యక్తిగత జీవితంలో గొప్ప మార్పు

తెచ్చింది. అప్పుడు పీటర్స్‌బర్గ్‌లో ఒపెరా (యక్షగానం) ప్రదర్శనాలిస్తున్న పాలినీ వియర్డాట్ అనే అభినేత్రిమీద అతనికి ప్రేమ ఉదయించింది. నాటి నుండీ ఆమెయే అతనికి జీవిత సర్వస్వంగా మారిపోయింది. కాని అతని ప్రేమ శారీరక ప్రేమకాదు. మానసిక ప్రేమ (Platonic Love). అతని ప్రేమకు బదులుగా ఎంతో గౌరవం, చనువు ఆమె అతనికి ప్రసాదించింది. తదాది అతనుకూడ ఆమెకుటుంబంలో ఒకడైపోయాడు. తర్వాత తర్వాత ఆకుటుంబంతోనే అట్టేఉండి ఆమె ఎక్కడికివెడితే అతనూ ఆమెతోపాటు అక్కడికి వెడుతూండేవాడు.

ఈ స్నేహసంబంధం మూలాన 1847 లో అనగా 29వ ఏట టర్జనీవ్ పారిస్‌కువెళ్ళి మూడు సంవత్సరాలపాటు అక్కడ ఉండవలసి వచ్చింది. పారిస్‌లో ఉండగా అతి చురుకుగా రచనలు సాగించాడు. 'వేటగాని పద చిత్రాలు ('షార్ అండ్ కాలినిచ్'కి ఇంకోపేరు) చాలాభాగం ఇక్కడనే రాయడమే కాకుండా, 'ఏమంత్ ఇన్ దీ కంట్రీ' అనే నాటకంకూడా రాశాడు. రష్యన్ నాటకరంగ పునరుజ్జీవనానికి ఈ నాటకం ఎంతగానో తోడ్పడింది.

1850 లో టర్జనీవ్ తిరిగిరష్యావచ్చాడు. తల్లి చనిపోయింది. మంచి ఆస్తిపాస్తులు అతనికి సంక్రమించాయి. అయితేనేం సక్రమంగా డబ్బుఖర్చు చేయడంతెలీక అతను జీవితం అంతా డబ్బుకి ఇరకాటకం పడుతూనే ఉండేవాడు.

ఇంతలో గొగోల్ మహాకవి అస్తమించాడు. అతని మృతి టర్జనీవ్‌ని ఎంతగానో కదిలించివేసింది. వెంటనే గొగోల్ మృతినిగూర్చి వ్యాసం 'పీటర్స్‌బర్గ్ గజెట్టుకు' పంపాడు. ఆకాలంలో వార్తలమీదా వ్యాసాల మీదా ప్రభుత్వ 'సెంసార్' విచక్షణారహితంగా, అతి కఠినంగా ఉండేది. "గొగోల్ చనిపోయాడు. ఈ మాటలకి ఏరష్యన్ హృదయం ఆందోళన పడదు..." ఈ ధరణిలో టర్జనీవ్ వ్యాసం నడిచింది. కాని కొన్ని రాజకీయ కారణాలవల్ల గొగోల్ మృతికి ప్రాధాన్యత రాకుండా చేయతలచిన ప్రభుత్వం టర్జనీవ్ వ్యాసాన్ని తిరస్కరించింది. టర్జనీవ్ ఈవ్యాసాన్నే మాస్కో పత్రికలకి పంపాడు. పీటర్స్‌బర్గ్‌లో తిరస్కరింప బడిందనే సంగతి తెలియక మాస్కో సెన్సారుబోర్డు ఆవ్యాసం ప్రకటింపడానికి అనుమతించింది. దాంతో కొంపలంటుకొని ఇలా పంపినందుకుగాను టర్జనీవ్‌ని నెల

రోజులు కారాగారంలో ఉంచి తర్వాత రెండుసంవత్సరాల వరకు రష్యా నించి ప్రభుత్వం బహిష్కరించింది.

రష్యాలో ఉండగా పెద్దనవలలు రాయలనే ఆశక్తికల్గి 1855 లో 'రూడిన్' అనేనవల రాశాడు. తర్వాత రచించిన "పెద్దమనుష్యుల పిచ్చుక గూళ్ళు" అనేనవల అతనికినాటిరచయితలలో అగ్రస్థానంలభింపజేసింది. ఈనవల కొచ్చినంత కీర్తి మరే నవలకు రాలేదు. టర్జనీవ్ పైప్రశంశా వర్షంకురిసింది. సాహిత్యరంగంలో అతివాదులూ,మితవాదులూ ఈనవలను మెచ్చుకున్నారు. గొప్పవాళ్ళంతా టర్జనీవ్‌తో స్నేహంచేయాలని ఉబలాట పడసాగారు. యువరచయితలు తమతమ రచనలను టర్జనీవ్‌కి వినిపింపసాగారు.

'వేగుచుక్క' కథ 1854-55 లో టర్జనీవ్‌కి తట్టింది. కాని 1859 లో కాని కథాక్రమం ఏర్పరచుకోవటం పడలేదు. తర్వాత ఆరు నెలల్లో నవల తయారియింది.

రష్యన్ హెరాల్డ్ పత్రికలో ఈ నవల వెలువడగానే ప్రజల కెంతో ఆశక్తి రేకెత్తింది. ఇందులోని సాంఘిక, రాజకీయ పరిణామాల ఎడ ప్రజలు శ్రద్ధవహించసాగారు. సంస్కరణలు ముందు ప్రకటితమైన ఈ నవలను వారు తమ 'వేగుచుక్క'గా భావించారు. ఈ నవలలోని నాయికా నాయకులు, తదితర పాత్రలనుగురించి ప్రజలు చర్చించసాగారు. ఈ నవల లోని నాయకుడు ఇన్సరోవ్ ఆశయాలు, మాతృ దేశభక్తి రష్యన్ ప్రజలను ఎంతో ఆకర్షించాయి. రాజకీయ అభిప్రాయాలలో విభేదాలువచ్చి టర్జనీవ్‌కి 'కంటెంపొరరీ' పత్రికతోగల సంబంధాలు విచ్ఛిన్నమయాయి.

1861 లో "తండ్రులూ కొడుకులూ" అనే నవల వెలువడింది. తర్వాత తర్వాత ఈనవల టర్జనీవ్ రచనలన్నింటిలో ఉత్తమమైనదిగా పరిగణింపబడినా మొదట్లో దీన్ని ఎవరూ, ముఖ్యంగా అతివాదులు మెచ్చు కోలేదు. టర్జనీవ్ కీర్తి దీంతో మాయజొచ్చింది. అచ్చుకు ఇవ్వకముందు వ్రాతప్రతిని తగులబెడుదా మనుకున్నాడు. "తండ్రులూ, కొడుకులూ" తెచ్చిపెట్టిన ఆశాభంగంతో టర్జనీవ్ కొంతకాలంపాటు కలం పట్టలేదు.

1862 వరకు టర్జనీవ్ తరుచు విదేశాలకు వెళుతూండేవాడు కాని ఆ సంవత్సరంనించి విదేశాలలోనే శాశ్వతంగా ఉండిపోయాడు. నాటినించి పేరుప్రతిష్టలు పూర్తిగా గణించుకొని పించను పుచ్చుకున్నవానిలా టర్జనీవ్

జీవితం సాగిపోయింది. కాని రష్యానించి శాశ్వతంగా వెడలిపోకముందు రాసిన నవలలంత గొప్పనవలలు తర్వాత అతను రాయలేక పోయాడనే చెప్పాలి.

పాలినావియర్‌డాట్ ఎక్కడకు వెడితే తానూ అక్కడికివెడుతూ ఆమె సహచర్యంలో ఎంతోఆనందం అనుభవిస్తూ టర్గినీవ్ జీవితం గడిపాడు. ముసలివాడనై పోతున్నాననీ రష్యాతో తన సంబంధం విచ్ఛేదమైపోయిందనీ తలుచుకొన్నప్పుడు చాలా బాధపడేవాడు. దీంతో మనోవ్యాధి పట్టింది. బాడన్‌లోఉండగా 'పొగ' అనేనవల ప్రచురించాడు. ఈనవల చదివి బోల్షివిక్కులు, రాడికల్సు, ఒకరేమిటి అన్నివర్గాలవారు టర్గినీవ్‌ని తిట్టి పోశారు. ఈనవలలో అభ్యుదయ నిరోధకులైన ఘరానా మనుష్యుల్ని, రాడికల్స్‌ని వ్యంగ్యంగా నిందించడమే దీనికన్నిటికీ కారణం.

ఫ్రాంకో ప్రష్యన్ యుద్ధంముగిసిన తర్వాత వియర్‌డాట్ కుటుంబం పారిస్‌లో స్థిరపడింది. టర్గినీవ్‌కూడా వారితోనే ఉండిపోయాడు. అక్కడ ఉండగా ఫ్యూబర్ట్, జోలా మొదలైన సుప్రసిద్ధ ఫ్రెంచి రచయితలతో టర్గినీవ్‌కి స్నేహమేర్పడింది.

అతని 58వ ఏట 'బీళ్ళు' అనే సుప్రసిద్ధనవల రచించాడు. ఆఖరి రోజులలో 'వచన గీతికయి' వెలువడ్డాయి.

టర్గినీవ్ చివరిరోజులలో రష్యాలో అతనికి పేరు ప్రతిష్టలు తిరిగి నెలకొన్నాయి. 1879లో రష్యావెళ్ళినపుడు ప్రజలు అతనికి బ్రహ్మాండమైన స్వాగతమిచ్చి ఉత్సవాలు చేసుకొన్నారు.

టర్గినీవ్ ఆఖరి ఘడియవరకు రచనలు సాగిస్తూనే ఉన్నాడు. కొద్ది రోజులకు చనిపోతాడనగా కలం పట్టలేక టర్గినీవ్ చెబుతూంటే పాలీనా వియర్‌డాట్ రాస్తుండేది.

అనేక నవలలు, కథలు, వచన గీతికలు, నాటకాలు రచించి అమర ఖ్యాతినంది టర్గినీవ్ 64వఏట పారిస్‌లో 1883లో చనిపోయాడు.

వేగుచుక్క:

ఇంతకు ముందుచెప్పినట్లు 'వేగుచుక్క' కథాంశం టర్జనీవ్ మనో వీథిలో 1854లోనే విరిసింది. ఎలీనా పాత్ర విస్పష్టరూపంలో పొడగట్టింది. కాని ఈనాయికకు తగిన నాయకుడు అతని ఊహకు అందలా.

ఇంతలో స్పాస్కోయెలో పొరుగున నివసించే వాసిలీకారట్యేవ్ యుద్ధంలో పాల్గొంటానికి వెడుతూ టర్జనీవ్‌ని కలుసుకొని ఒక కాగితాల చుట్ట ఇచ్చి చదివి దానిని ఉపయోగించుకోమని చెప్పి వెళ్ళాడు. ఆకాగితాలను విప్పిచూసేసరికి సరిగ్గా అందులో టర్జనీవ్‌కి వేగుచుక్క రచనకు కావలసిన కథ, నాయకుడు దొరికారు. కాని కారట్యేవ్ రచనలో శిల్పం కొరవడింది. ఆరచనను టర్జనీవ్ శిల్పంలో పొదిగి ప్రపంచ ప్రజల కందిచ్చాడు.

ఆమూలరచన కారట్యేవ్ జీవితగాథ. అందులో ఒక రష్యన్ యువతి కారట్యేవ్‌ని మొదట ప్రేమించి ఉండీ ఉండి ఎలీనాలాగానే ఒక బల్గేరియన్ దేశభక్తుని ప్రేమించి అతన్ని వివాహమాడి అతనితో బల్గేరియా వెళ్ళిపోతుంది.

కారట్యేవ్ రచనను చదువుతూ టర్జనీవ్ "ఇతనూ నాక్కావలసిన నాయకుడు!" అనుకున్నాడట!

ఇక నవల చదవండి!

# నవలా కాల చరిత్ర

ఈ నవలలోని ప్రధాన కథాంశం 1853 వేసవి, 1854 వసంతకాలం మధ్య జరిగింది. క్రిమియాయుద్ధం 1854 మొదట్లో ప్రారంభమైంది. కాని ఆ కిందటి సంవత్సరంలోనే రష్యాకు, టర్కీ, బ్రిటన్, ఫ్రాన్సులకు వైషమ్యాలు పెరగ సాగాయి. నేడు రుమేనియా అని పిలువబడుతున్న మొల్డేవియా, వాలేచియా భూభాగాల ముఖ్య పట్టణాలను రష్యన్ సైన్యాలు ఆక్రమించాయి. 1853 అక్టోబరు మొదట్లో 15 రోజులలో సైన్యాలను ఉపసంహరించమని టర్కీ రష్యాను కోరింది. కాని వెనువెంటనే టర్కీ సైన్యాలు డాన్యూబ్ నదిని దాటి వాలేచియాలో ప్రవేశించాయి. అందుమూలంగా టర్కీ రష్యాలకు యుద్ధం ప్రారంభమైంది. రాజీ ప్రయత్నాలు యింకా జరుగుతూండగానే నవంబరు 30 న రష్యన్ నావికా దళం నల్లసముద్రంలో టర్కీ నావికా సమూహాలపై దాడి చేసి నాశనం చేసింది. "సినోప్ హత్యలు" అని పిలువబడే యీ సంఘటన మూలంగా బ్రిటిష్, ఫ్రెంచి నావికా సైన్యం నల్లసముద్రంలో ప్రవేశించింది. 1854 ఫిబ్రవరిలో రాజీ యత్నాలు విఫలమయాయి. రష్యాను, పశ్చిమ రాజ్యాలను యుద్ధం తప్పనిసరి అయింది.



# పాత్రలు

నికొలాయ్ ఆర్త్రియోమెవిచ్ స్త్రహోవ్ :
(పింఛను పుచ్చుకున్న రక్షణ సేనాని)

అన్నా వాసిలెవ్నా : (అతని భార్య)

ఎలీనా నికొలయోవ్నా :
(అతని కూతురు. ముద్దుపేరు లెనోచ్కా)

యువాన్ ఇవనోవిచ్ స్త్రహోవ్ : (నికొలాయ్‌కి దూరపు దాయాది)

పావెల్ యాకోవ్లెవిచ్ షూబిన్ :
(యువశిల్పి. అన్నా వాసిలెవ్నాకు దూరపు బంధువు)

ఆంద్రీ పెత్రోవిచ్ బెర్సేనీవ్ : (వేదాంతశాస్త్ర విద్యార్థి)

డిమిత్రీ నికనోరోవిచ్ ఇన్సరోవ్ :
(బల్గేరియా దేశస్థుడు, విద్యార్థి)

జోయా నికిటిష్నా మ్యూలర్ : (ఎలీనా చెలికత్తె)

అవగస్తీనా క్రిస్తియనోవ్నా :
(పూర్వ సువాసిని, నికొలాయ్ ప్రియురాలు)

యెగార్ ఆంద్రియెవిచ్ కర్నతొవస్కీ :
(సెనేటు ప్రధాన కార్యదర్శి)

తదితరులు ...




# ౧

అది 1853 మందు వేసంగిదినాలు. ఒకరోజున కుంట్సేవోకు అనతి దూరంలో మాస్కోనదీ తీరాన ఎత్తయిన ఒక నిమ్మచెట్టు నీడను పచ్చిక మీద ఇద్దరుయువకులు పడుకుని ఉన్నారు.

వారిలో ఒకనికి ఇరవైమూడేళ్ళుంటాయి. మంచి పొడగరి. గోధుమ వర్ణం. కొద్దిగా వంపుతిరిగి కొనతేలిన నాసిక. విశాలమైన నుదురు. నిండు పెదవులమీద పరిమితమందహాసం. బూడిదరంగు చిన్నికళ్లు. కళ్ళు కొంచెంగా కుంచిస్తూ ఆలోచనాపూర్వకంగా ఎక్కడో దూరం అవలోకిస్తున్నాడు.

రెండవతనిది చక్కని ఉంగరాలజుట్టు. తలకిరువైపులా చేతులానించి మొదటివానిలాగానే దూరం అవలోకిస్తున్నాడు. ఇతను మొదటివానికంటే మూడేళ్ళు పెద్దయినా చూపులకు చిన్నవానిలా కన్పిస్తాడు. మీసం యింకా రాలేదు, గాని గడ్డం నూనూగుగావుంది. నవనవలాడే అతని గుండ్రని ముఖాకృతిలోనూ, బూడిదరంగు కళ్ళల్లోనూ, తీర్చిదిద్దినట్లుండి ప్రాధాన్యత వహిస్తున్న పెదవుల్లోనూ, తెల్లటి చిన్నిచేతుల్లోనూ ప్రజలను సమ్మోహపచ్చే సౌకుమార్యం, బాలురలోవుండే మిసిమీ గోచరిస్తాయి. సంపూర్ణారోగ్యంవల్ల కలిగే ఆహ్లాదం, నిశ్చింత ఆత్మవిశ్వాసం ఆకర్షణలతో తొణికసలాడే యవ్వనం అతని సర్వాంగాలలో గుబాళిస్తున్నాయి. కళ్ళు గిర్రున తిప్పి చిరునవ్వు నవ్వాడు. తన్ను జూచి జనులానందిస్తున్నారని గ్రహించిన బాలునిలా తలపైకెత్తి చూచాడు. వదులుపాటి తెల్లటిపొట్టికోటు తొడిగి ఊదారంగు మఫ్లరు సన్నని మెడకు చుట్టుకున్నాడు. నలిగిపోయిన హాటు ఒకటి అతనిపక్కన పడివుంది.

ఇతనితో పోలిస్తే ఇతని సహచరుడు ముసలివానిలా కనిపిస్తాడు. అతని కోలముఖంకేసిచూస్తే కులాసాగా సంతోషంగా కాలంగడుపుతున్నాడని ఎవరికీ అనిపించదు. వంకరటింకరగా పడుకున్నాడు. పైన విశాలంగానూ కింద సన్నగానూ ఉన్న అతని పెద్దతల పొడుగాటిమెడమీద వికృతంగావుంది. గేడెకాళ్ళు. తూనీగ వెనకకాళ్ళలాగా ఎంతో ఎత్తునవున్న మోకాళ్ళు. నల్లటి బిగుతుచొక్కా. ఇలా రూపొందిన అతని ఆకారం అసహ్యంగావుంది. ఇన్ని అవలక్షణాలున్నా అతను సంస్కృతీ పరుడని గుర్తించకతప్పదు. అతని వికృతాకారంలో 'మర్యాదలక్షణం' ముద్రితమై ఉంది. సమమట్టంగా వుండి నవ్వుపుట్టించేదైనా అతని ముఖంలో ఆలోచనా నిమగ్నతా, కారుణ్యం ప్రకటితమవుతున్నాయి. అతనిపేరు ఆంద్రీపెత్రోవిచ్ బెర్సెనీవ్. చక్కటి జుట్టుగల అతని సహచరుని పేరు పావెల్ యాక్లోవిచ్ షూబిన్.

"నాలాగా బోర్లకిలా పడుకోవేం?" అంటూ ప్రారంభించాడు షూబిన్. "ముఖ్యంగా యిలా-కాళ్ళుపైకెత్తి మడమలు రెండూ కొట్టుకుంటున్నప్పుడు బలేబాగుంటుంది. కిందపచ్చిక. ప్రకృతి దృశ్యాలు చూసి చూసీ విసిగెత్తినప్పుడు గడ్డిపోచమీద పాకే కుమ్మరపురుగునో అటూఇటూ గడబిడగా తిరిగే చీమనో చూస్తూ పొద్దుపుచ్చచ్చు. అదేనయం! కాని అట్ట ముక్కలతో చేసిన కొండమీద మోచేతి నానించి అభినయించే నర్తకిలా నువ్వు కృత్రిమభంగిమం దాల్చావేం? నువిక హాయిగా విశ్రాంతి తీసుకో వచ్చు. ఆఖరుపరీక్షలో మూడోవాడవుగా నెగ్గడం అల్పంమాటలా! విశ్రాంతి తీసుకోబాబూ, విశ్రాంతితీసుకో! స్వేచ్ఛగా కాళ్లూచేతులూ చాచుకొని పడుకో."

షూబిన్ ఇదంతా ముక్కుతో కొంచెం ఒదకంగా కొంచెం పరిహాస పూర్వకంగా – మిఠాయి తెచ్చిపెట్టే కుటుంబ స్నేహితులతో చెడిపోయిన పిల్లలు మాట్లాడినట్టు మాట్లాడాడు. జవాబుకోసం నిరీక్షించకుండా మళ్ళీ మొదలుపెట్టాడు:

"చీమలు, కుమ్మరపురుగులు మొదలైన కీటకప్రపంచానికి చెందిన 'పెద్దమనుష్యుల్లో' ఆశ్చర్యకరమైన గంభీరత పొడగడుతుంది. తమ జీవితానికి విలువవున్నదట్లు ముఖకవళికతో ముందుకూ వెనక్కూ పరుగెత్తు

తాయి. కాస్త ఆలోచించు. సృష్టికంతటికీ ప్రభువూ, సకలజీవకోటిలో అతి గౌరవనీయుడూ అయిన మానవుడు వాటికేసి చూస్తున్నాడు. అయితేనేం? తిరిగి చూడ్డానికైనా వాటికి తీరికలేదు. ఇంతేగాదు. 'సృష్టికంతటికీ ప్రభువు' వంటివాడిని గాడిదవాలి రోమలు నెత్తుగుపేర్చేస్తాయి. యెంతటి అవమానకర విషయం! కాని యింకో దృక్కోణంలో చూస్తే, వాటి జీవితం కంటే మనదేం గొప్ప! మనం దగ్గావెలిగిస్తే అవిమాత్రం యెందుకు వెలిగించగూడదు? ఓ-ఈ-ఓ వేదాంతిమహాశయా? ఈ సందేహం నివర్తిచెయ్. జవాబు చెప్పవేం?"

"యేమిటీ?" అన్నాడు జెర్నసీవ్ ఉలిక్కిపడి.

"యేమిటా? నీ స్నేహితుడు గంభీరమైన అభిప్రాయాలు ప్రవచిస్తుంటే, నువు వినటంలేదన్నమాట!"

"ఆ దృశ్యం చూసి పరవశుణ్ణయిపోతున్నా. యెండలో ఆ పొలాలు యెంత వెలిగిపోతున్నాయో చూడు!" (జెర్నసీవ్ కొంచెం నత్తితో అన్నాడీమాటలు)

"ఔను. గొప్ప వర్ణసంచయం విరజిమ్ముకుపోయింది. నీ వుద్దేశంలో ప్రకృతి అంటే యిదేనా?"

జెర్నసీవ్ తలూపాడు. 'యిలాంటి దృశ్యాలకు నాకంటే నువ్వే యెక్కువ పరవశుడివి కావలసింది. ఇది నీ వృత్తికి సంబంధించిన విషయం. నువు శిల్పివి."

"కాదయ్యా కాదు. అది నా వృత్తికేం సంబంధించిన విషయం కాదు." అన్నాడు షుల్గిన్ చేతులు తల వెనకాల పెట్టుకుంటూ. "నేను కసాయివాణ్ణి. నా వృత్తి మాంసం — కండలు, బుజాలు, కాళ్లూ రూపొందించడం. ఇక్కడ రూపంలేదు, పరిపూర్ణతాలేదు. వర్ణసంచయం యీ ప్రదేశమంతా వ్యాపించిపోయింది. దాన్ని వొడిసిపట్టుకోవాలని యత్నించి చూడు!"

"అయినప్పటికీ యిక్కడా సౌందర్యముంది తెలుసా? మర్చిపోయా, నువు చేస్తున్న ఆ ప్రతిమ - పరిసాగుతోందా?" అని అడిగాడు జెర్నసీవ్.

"యే ప్రతిమా?"

"కోడె - మేక"

"అదా – దాన్తగలేసిరి. పురాతన మహాశిల్పుల శిల్పాలు చూచాను. అవి చూసినతర్వాత నేతయారుచేసిన చిత్రశిల్పాలన్నీ పగల గొట్టి పారేశాను. ప్రకృతిని చూపించి 'ఇక్కడా సౌందర్యముంది.' అంటున్నావు. ఔను. యిక్కడా సౌందర్యముండొచ్చు. ప్రతివస్తువులోనూ సౌందర్యముంది. నీ ముక్కులోనూ సౌందర్యముంది. కాని వివిధసౌందర్యాలను పట్టలేం. పూర్వ మహాశిల్పులు – వారు సౌందర్యం వెంటపడలా. వారి శిల్పంలోకి సౌందర్యమే వచ్చిపడేది. యెక్కడినించి వచ్చిపడేదో పరమాత్ముడికే యెరుక. బహుశా స్వర్గాన్నుంచి దిగివచ్చిపడేదేమో. ప్రపంచమంతా ఆ మహాశిల్పులదే. కాని మనం వారిలాగా విస్తృతంకాలేం. మనశక్తి అల్పం. ఒకే ఒక విషయంమీద మనం దృష్టి కేంద్రీకరించి పరిశీలిస్తూ నిరీక్షిస్తాం. మనవల్లో సౌందర్యంపడిందా, . మంచిదే. లేకపోతే ..." షూబిన్ నాలికచాచాడు వెక్కిరింతగా.

"ఆగు. ఆగు" అంటూ అడ్డువచ్చి బెర్సెనీవ్ అన్నాడు: "అదో విషమ సమస్య. సౌందర్యానికి నీ హృదయం స్పందించకపోతే, యెక్కడ సంధానమైతే అక్కడ సౌందర్యాన్ని నువు ప్రేమించకపోతే నీ కళలో కూడా సౌందర్యం నిన్ను తప్పించుకుపోతుంది. సుందర దృశ్యానికిగానీ, మనోహర సంగీతానికిగానీ నీ హృదయం స్పందించకపోతే—"

"ఓ స్పందనుడా" అని షూబిన్ తాను ప్రయోగించిన యీ నూత్న పదానికి విరగబడి నవ్వసాగాడు. బెర్సెనీవ్ ఆలోచనా నిమగ్నుడైనాడు.

"కాదు, మిత్రమా, కాదు – నువు తెలివైనవాడివి. వేదాంతివి. మాస్కో విశ్వవిద్యాలయంలో మూడోవాడివిగా నెగ్గినవాడివి. సగసగం చదువుకొన్న నాబోటి విద్యార్థికి నీతో వాదించటమంటే భయమేస్తుంది. కాని ఒక్క విషయంమాత్రం చెబుతా విను. నా కళనే కాకుండా, స్త్రీలల్లో – అందులోనూ నవయవ్వనవతుల్లో వుండే సౌందర్యాన్ని కూడా ప్రేమిస్తా. అదైనా యీ మధ్యనే—"

వెలకిందలుగా పడుకొని చేతులు తలవెనకాల కట్టుకున్నాడు షూబిన్. కొన్ని నిమిషాలపాటు ఎవరూ మాట్లాడలేదు. మధ్యాహ్నకాలపు స్తంభిత నిశ్శబ్దత, ప్రకాశిస్తూ నిద్రిస్తున్న భూమిమీద అధికారంగా వేలాడుతోంది.

“ఓ స్త్రీ పక్షపాతీ! ఆ స్టహోవ్ విషయం, ఎవరన్నా పట్టించుకుంటే బాగుండును. మాస్కోలో కన్పిస్తున్నాడా?”

“లేదు, కన్పించడంలేదు”

“ముసలాడికి బొత్తిగా మతిపోయింది. రాత్రింబగళ్లూ ఆ అవగస్టినా క్రిస్టియానోవ్నా యింట్లోనే పడుంటాడు. ఎంత విసిగెత్తినా అక్కడనించి కదలడు. వాళ్ళిద్దరూ ఒకరికేసిఒకరు పిచ్చిగా చూసుకుంటూ కూర్చుంటారు. డోకేస్తుంది. కాస్త ఆలోచించు – భగవంతుడు స్టహోవ్‌కి యెటువంటి కుటుంబం ప్రసాదించాడు! అయితేనేం ఆ క్రిస్టియానోవ్నా అంటే పడిచస్తాడు. ఆవిడ బాతుముఖంలాంటి భయంకరమైన ముఖం యెన్నడూ నేను చూడలా. ఆమె వ్యంగ్య ప్రతిమ మొన్ననే తయారుచేశా. ఫరవా లేదు. బాగానే వుంది. చూద్దుగానిగా—”

“ఎలీనా నికొలయెవ్నా ప్రతిమ! అదీ తయారీలోనే వుందా?”

“లేదు, మిత్రమా, లేదు. అదేంసాగడంలేదు. ఆవిడముఖంచూస్తే నిరాశ రేకెత్తుతుంది. చూట్టానికి విస్పష్టమైన, సున్నితమైన సరళరేఖలు గోచరిస్తాయి. పోలిక తేవడం యేమంత కష్టమనిపించదు. కాని గారడివాని చేతి బంగారంలాగా చేజారిపోతుంది. నీ మాటలు వినేటప్పుడు ఆమె వైఖరి గమనించావా? ముఖకవళిక యేమాత్రం మారదు. కళ్ళల్లో భావాలు మాత్రం మారుతుంటాయి. దాంతో ముఖమంతా మారిపోతుంది. శిల్పిని – అందులోనూ సామర్థ్యంలేని శిల్పిని–యేం చేయమంటావ్? ఆమె అద్భుతమైన, విచిత్రమైన వ్యక్తి” అన్నాడు షూబిన్ కాసేపు మౌనం వహించి. “అద్భుతమైన వ్యక్తి” అని బెర్సెనీవ్ కూడా అందుకున్నాడు.

“నికొలాయ్ ఆర్టెమోవిచ్ కూతురు! ఇక వంశం, వంగడం గురించి మాటాడేదేముంది? చిత్రమేమంటే ఆమె అచ్చంగా తలిదండ్రు లిద్దరిపోలిక. ఆమెతల్లి అన్నా వాసిలెవ్నాను హృదయపూర్వకంగా గౌరవిస్తా. నిజానికి నాకెంతో మేలుచేసింది, కాని వట్టి గంగిగోవు. అలాంటప్పుడు ఎలీనాకా ఉద్వేగం యెక్కడనించొచ్చింది? ఆ అగ్ని నెవరు రగిల్చారు? ఇది నీకు కొరకరాని సమస్య, వేదాంతి మహాశయా!”

కాని మునుపటిలాగానే వేదాంతి జవాబు చెప్పలేదు. జెస్సీవ్ మితభాషి. ఎప్పుడైనా మాట్లాడితే అకటావికటంగా మధ్యమధ్య ఆగుతూ అనవసరంగా చేతులు తిప్పుతూ తనభావం వెల్లడించేవాడు. ఇప్పుడు ఒక విచిత్రమైన నిస్తబ్ధత – అలసట, విషాదాలతో సమమైన నిస్తబ్ధత అతనిలో ప్రవేశించింది. రోజుకు గంటలకొద్దీ కష్టపడి చదివి ఇటీవలే పట్నంనుంచి కాపరం మార్చాడు. ఇప్పుడు సోమారితనం, మందమారుతంలోని పరిశుభ్రత, లక్ష్యం సాధించాననే చైతన్యం, స్నేహితునితో ఆషామాషీ ముచ్చట్లు, హఠాత్తుగా కళ్లకుకట్టిన సుందరరూపం – వివిధములైనా సామీప్యతగల యీ భావముద్రలు ఒకేఒక భావంగా సమ్మిళితమై అతన్ని శాంత పర్చాయి, ఆందోళన పర్చాయి, బలహీనుణ్ణి చేశాయి. ఎక్కుపెట్టిన బాణం అతని హృదయం!

నిమ్మచెట్టుకింద చల్లగా, ప్రశాంతంగావుంది. నీడ వలయంలోకి ఎగిరి వచ్చిపడినప్పుడు తేనెటీగలు, ఈగలు మృదువుగా ఝుంకారం చేస్తున్నట్లనిపించింది. శుభ్రంగావున్న లేత గడ్డిపోచలు సూర్యకిరణాల బంగారుచాలులో తళుక్కుమనకుండా మరకతవర్ణం వహించి నిశ్చలంగా వున్నాయి. మంత్రబద్ధమైనట్టు కాడలు అల్లల్లాడడంలేదు. పసుపుపచ్చని పూగుత్తులు కిందికొమ్మలనుంచి నిర్జీవంగా వేలాడుతున్నాయి. ప్రతి ఉచ్ఛ్వాసంతోనూ మధురపరిమళం ఊపిరితిత్తులలోకి చొచ్చుకుపోయి వున్నట్టూ, ఆ పరిమళాన్ని ఊపిరితిత్తులు తాగివేస్తున్నట్టూ అనిపించుతోంది. నది అవతల దూరాన దిఙ్మండలం దేదీప్యమానంగా వెలిగిపోతోంది. ఒకొక్కప్పుడు చిరుగాలి కదిలి వీచి ఆ వెలుగును మరింత ప్రకాశవంతం చేస్తోంది. మెరిసే పొగమంచు అంతరాళం ఆక్రమించింది. పక్షుల అలికిడే లేదు. ఎండవేళ అవి సంగీతం విన్పించవు. కాని కీచురాయిలు మాత్రం కిచకిచలాడుతున్నాయి. చల్లటినీడలో కూర్చుని ఆ జీవుల వెచ్చటి కంఠస్వరాలు వినడం ఆహ్లాదకరంగా వుంటుంది. ఆ ఆహ్లాదం మత్తుగొలిపి స్వప్నావస్థకు తీసుకు పోతుంది.

"పరికించావా?" అని హఠాత్తుగా ప్రశ్నించాడు, జెస్సీవ్ తనమాటలకు హస్తవిన్యాసం తోడుచేసుకుంటూ. "ప్రకృతి మనలో విచిత్రమైన భావం రేకెత్తిస్తుంది. ప్రకృతిలో ప్రతిదీ పరిపూర్ణత్వంతో, ఆత్మ

సంతృప్తితో విస్పష్టంగా భాసిల్లుతుంది. ఇదంతా మెచ్చుకుంటాం. కాని ఒకవైపున అలా మెచ్చుకుంటున్నా మనలో, ముఖ్యంగా నాలో, ఆందోళనా, చింతా రేకెత్తుతాయి. దీనికంతటికీ అర్థమేమిటి? ప్రకృతితో ముఖాముఖీ తారసిల్లినప్పుడు మనకు మన అసంపూర్ణతా, మన అస్పష్టతా గోచరించి వుండాలి. లేకపోతే ప్రకృతిని సంతృప్తిపరచే అనుగుణ్యత మనదగ్గర లోపించివుండాలి. మన కవసరమైనదింకేదీ ప్రకృతిలో లభించదు."

'హుఁ' అని షూబిన్ జవాబియ్యసాగాడు. "దీనికంతటికీ కారణం చెబుతా విను. నువు వర్ణించేదంతా యదార్థజీవితం గడపకుండా, గుస్లప్పగించి చూస్తూకూర్చుంటూ భావోద్రేకాలకు లోనయ్యే వొంటరి మానవుని యింద్రియ పరిజ్ఞానం. చూస్తూ కూర్చుంటే ప్రయోజనమేమిటి? మనిషిలా జీవించు. ప్రకృతిద్వారం యెన్నిమారులు తట్టినా నీ కర్థమయ్యేభాషలో అది జవాబియ్యదు. ప్రకృతి మూగది. ఫిడేలు తీగలాగా కంపిస్తుంది, మూలుగుతుంది. కాని గీతం వెల్వరించలేదు. సజీవహృదయం - ముఖ్యంగా స్త్రీ హృదయం నీకు ప్రత్యుత్తరమిస్తుంది. అందుకని ఆత్మసహచారిణి నొకదాన్ని సంపాదించుకుంటే నీ వ్యాకుల భావమంతా మాయమై చక్కాబోతుంది. అదీ మనకి కావలసింది! చూడు, యీ ఆందోళనా, యీ విషాదం - యిదంతా ఆకల్లాంటిది. పొట్టకు సరైనతిండి పడ్డ, అంతా చక్కబడుతుంది. మిత్రమా! భౌతికంగా యీ ప్రపంచంలో నీస్థానమాక్రమించుకో. ఇక యీ ప్రకృతేమిటి? దాని ప్రయోజనమేమిటి విను. ప్రేమ - యెంత వెచ్చని గంభీరమైన పదం! ప్రకృతి! ... యెంత చప్పటి పరుషపదం! అందుచేత (రాగయుక్తంగా) 'మేర్యా పెట్రోవ్నాకు ...కాకపోనూవచ్చు.' మేరియా పెట్రోవ్నాకాదు. పర్వాలేదులే. నా అభిప్రాయం అర్థమైందనుకుంటా."

బెర్సెనీవ్ లేచి కూర్చుని చేతులుముడిచి వాటిమీద గడ్డమానించి "యెందుకా యెత్తిపొడుపు మాటలు?" అన్నాడు స్నేహితునికేసి చూడకుండా - "యెందుకా అవహేళన స్వరం? ఔను. నువు చెప్పిందే సరైంది. ప్రేమ మహత్తరమైన పదం, మహత్తరమైన భావం! ... అయితే నువు యే రకమైన ప్రేమను గురించి మాట్లాడుతున్నా?"

ఖూబిన్ లేచి కూర్చుని "యే రకమైన ప్రేమా? అది ప్రేమ అయినంతవరకు యే రకమైతేనేం? నామట్టుకు నేను ప్రేమలో వివిధ రకాలు లేవనే అంటా. నువ్వు ప్రేమలో పడితే..."

"హృదయపూర్వకంగా" అంటూ అడ్డంవచ్చాడు బెర్సెనీవ్.

"ఔను. ఆ ముక్క వేరే చెప్పడం దేనికి? హృదయపూర్వకంగా ప్రేమిస్తేనే! నీ హృదయమేమీ ఆపిల్ పండుకాదు. దాన్ని ముక్కలు ముక్కలుగా కోయనూలేవు. నువ్వు నిజంగా ప్రేమిస్తే తప్పుదారి తొక్కలేవు. నిన్నేం హేళనచేయాలని కాదిదంతా చెప్పడం. ఇప్పుడు నా హృదయంలో దయారసం తొణికిసలాడుతోంది ... యే విధంగా ప్రకృతి తన ప్రభావం మనమీద ప్రసరిస్తుందో విశదీకరించదలచాను. ప్రకృతి, ప్రేమ అవసరాన్ని మేల్కొల్పిందిగాని దాన్ని తృప్తిపరచలేకపోయింది. ప్రకృతి మనల్ని యింకో సజీవహస్తద్వయంలోకి నెట్టుతుంది. కాని దాన్ని మనం గుర్తించం. ప్రకృతి దగ్గరనుంచి యింకేదో ఆశిస్తాం. ఓ ఆండ్రీ! ఆండ్రీ! ఈ సూర్యరశ్మి, ఈ ఆకాశం, మనచుట్టూవున్న ప్రతి వస్తువూ యెంత మనోహరంగా వున్నాయ్! కాని నువ్వు మాత్రం విషాదానికి లోనైనావ్. ఈ నిమిషంలో నువ్వు ప్రేమించిన యువతి చెయ్యిపట్టుకుని – ఆ చెయ్యీ, ఆ యువతీ నీదైపోతే – నీ యేకాంత భావాలతోగాక ఆమె కళ్లతో చూచి అనుభవిస్తే, అప్పుడు ఆండ్రీ! ప్రకృతి నీలో ఆందోళనా, చింతా రేకెత్తించదు – దాని సౌందర్యాన్ని పర్యాలోకించడానికైనా ఆగవు. నువ్వు ప్రకృతికి – మూగ ప్రకృతికి – మాట్లాడే శక్తి నిస్తావు. అప్పుడు ప్రకృతి నిన్ను కీర్తిస్తుంది. నీ గీతానికి ప్రతిధ్వనిస్తుంది."

ఖూబిన్ ఎగిరి గంతేసి ఒకటి రెండుసార్లు అటూ యిటూ పచారు చేశాడు. బెర్సెనీవ్ తలవంచుకున్నాడు. ముఖం కొద్దిగా వైవర్ణ్యం పొందింది.

"నేను నీతో యేకీభవించను. ప్రకృతి అన్నివేళలా ప్రేమను సూచించదు. (యీమాట దగ్గర కొంచెం ఆగాడు) మనల్ని భయపెడుతుంది కూడా. మనకు భయంకరమైన, అభేద్యమైన సమస్యల్ని జ్ఞప్తికి తెస్తుంది. మనల్ని మింగివేయ జూస్తోంది ప్రకృతి కాదూ? ఇన్నాళ్లూ మనల్ని మింగేయడం లేదూ? ప్రకృతిలో జీవన్మరణాలున్నాయి. మృత్యువుకూడా ప్రాణియంత బిగ్గరగానే మాట్లాడుతుంది."

"ప్రేమలో జీవన్మరణాలున్నాయి" అన్నాడు షూబిన్.

"ఇంకా ఉదాహరణకు-వసంతకాలంలో కీకారణ్యంలో ఒబరాన్* కొమ్ముబూరా నినాదం వినిపిస్తుంది." ఈ మాటలు చెప్పటానికి బెర్సెనీవ్ కొంచెం సిగ్గుపడ్డాడు. "యిదికూడా..."

"అది ప్రేమపిపాస. ఆనందపిపాస. అంతకుతప్ప మరేంకాదు. ఆ నినాదమూ నాకు తెలుసు. సూర్యాస్తమయసమయంలో అడివికి అవతల నదీగర్భంనుంచి పైకి చీకట్లులేచేవేళ, అడివిమధ్యన చెట్టునీడనో, పొలాల గట్టుమీదనో వున్నప్పుడు ఆత్మను ఆవరించే భావోద్రేకం, ఆశాభావం నాకు తెలుసు. ఆనందం కావాలని ఆశిస్తా. అరణ్యంనుంచీ, నదులనుంచీ భూమినుంచీ, ఆకాశంనుంచీ, ప్రతి మబ్బుతునకనుంచీ, గడ్డిపోచనుంచీ ఆనందం కోర్తాను. ఆ ఆనందం నా కతిసన్నిహితమైనట్లనిపిస్తుంది. దాని పిలుపు వినిపిస్తుంది. 'నా దైవం దివ్యమూర్తి, ఆనందమూర్తి' అని అర్థంవచ్చే పద్యం రాయాలని వొకొకప్పుడు మొదలుపెట్టా. మొదటిపాదం గొప్పగా నడిచింది. కాని రెండోపాదంతోచలా. ఆనందం! ఆనందం! ప్రాణమున్నంతవరకు, వంట్లో జవసత్వాలున్నంతవరకు, పురోవృద్ధే కాని క్షీణత లేనంతవరకు దాన్ని తిట్టడం దేనికి?" అంటూ షూబిన్ ఆకస్మిక ఆవేశంతో మొదలపెట్టాడు. "మనం యువకులం, రాక్షసులం కాం. మనం ఆనందాన్ని లోబరచుకుందాం."

ఉంగరాలజుట్టు విదిలించి ఆత్మవిశ్వాసంతో నిర్లక్ష్యంతో ఆకసంకేసి చూచాడు. బెర్సెనీవ్ అతనికేసి తేరిపారజూసి "ఆనందాన్ని మించింది కేమీ లేదంటావా?" అన్నాడు నెమ్మదిగా.

"వుంటే, అదేదిటో చెప్పు చూద్దాం' అని అడిగి నిరీక్షించాడు షూబిన్.

"సరే, నువ్వూనేనూ యువకులం. తెలివిగలవాళ్ళం. యెవరికివారు ఆనందం కావాలని కోరుకుంటున్నాం... కాని ఆనందం అనేమాట మనల్ని ఐక్యంచేసి, భావాలను రగిల్చి మైత్రీభావం పెంపొందించేమాటేనా? స్వార్థంతో కూడుకున్నమాట కాదూ? అంటే మనల్ని వేరుపర్చేమాట కాదూ?" *

* గ్రీకు వేటదేవుడు.

" ఐక్యపచ్చేమాటలింకేవైనా నీకు తెలుసా?"

" ఆ అవేం అపూర్వమయినవేంకావు. నీకూ తెలుసు "

" సరే, యేమిటామాటలు ?"

" ఊ-కళ! యేమైనా నువు కళావేత్తవి తర్వాత ఐక్యపచ్చే మాటలు మాతృభూమి, శాస్త్రం, స్వాతంత్ర్యం, న్యాయం! "

" ప్రేమో ?" అని అడిగాడు ఘాబిన్.

" ప్రేమకూడా మనల్ని ఐక్యంచేస్తుంది. కాని నువు యిపుడు అర్రులు సాచే ప్రేమ మాత్రంకాదు. ఆనందంతో కూడిన ప్రేమా కాదు, త్యాగంతో కూడిన ప్రేమ" ఘాబిన్ ముఖం చిట్లించుకుని అన్నాడు:

" అదంతా జర్మన్లకే తగిపోయింది. నాకు ప్రేమ కావాలి. ప్రథమ స్థానం కావాలి."

" ప్రథమస్థానమా? ద్వితీయస్థానాన్ని వరించడమే జీవితలక్ష్య మవాలని నా ఉద్దేశం."

"నీ సలహా ప్రతివాడూ అనుసరిస్తే మామిడిపండు తినేవాడంటూ వుండడు. ప్రతివాడూ తన తరవాతవాడికి అట్టేపెట్టి చక్కాపోతాడు." అన్నాడు ఘాబిన్ అసమ్మతి సూచకంగా ముఖంపెట్టి.

'అంటే దాని అర్థం మామిడిపండు అంత అవసరమైంది కాదన్న మాట! అయినా నువ్వేం చింతపడ నక్కరలా. ఇతర్ల నోట్లో ముద్ద సంతోషంతో తీసుకుతినేవాళ్లు ఎప్పుడూ వుంటారు." మిత్రు లిద్దరూ కొంచెంసేపు మౌనం వహించారు.

"నిన్న ఇర్సనోవ్‌ను కలుసుకున్నా." అంటూ ప్రారంభించాడు బెర్సనేవ్. 'ఇక్కడకువచ్చి కలుసుకోమన్నా. నీకూ, స్టహోవ్ కుటుంబానికీ అతన్ని పరిచయం చేయాలని నా వూనిక."

"యెవరీఇన్సరోవ్? ఓ-అతనా-యీ మస్యను నువు నాతో చెప్పిన బల్గేరియనా? ఆ దేశభక్తుడు! ఈ వేదాంతమంతా నీ బుర్రలో కెక్కిస్తున్నదతనేనా యేం?"

"కావచ్చు."

"అయితే అతను గొప్పవాడే నన్నమాట !"

"ఆ—"

"మంచి తెలివిగలవాడూ సమర్థుడూ నన్నమాట !"

"ఆ - మంచి తెలివిగలవాడే. సామర్థ్యం - యేమో నాకు సరిగా తెలీదు. పెద్ద సమర్థుడని అనుకోను."

"అయితే అతని గొప్పదన మేదిటి?"

"నీకే తెలిసొస్తుందిలే. ఇక బయల్దేరే వేళయిందనుకుంటా. బహుశా అన్నా వాసిలెవ్నా మనకోసం నిరీక్షిస్తుంటుంది. టైమెంతయింది?"

"రెండు దాటింది. సరే - బయల్దేరదాం - పద. అబ్బ! యెంత ఉక్కగా వుంది. ఈ సంభాషణ నా రక్తాన్ని ఉడికెత్తించింది. ఒక సమయంలో నీ - నా కళా వైతృత్వం వూరికే పోతుందనుకున్నా, ప్రతిసి పరికిస్తే...నీ హృదయంలో ఒక స్త్రీ ప్రవేశించింది...కదూ?"

ఖూబిన్ తన మిత్రుని ముఖంలో ముఖంపెట్టి చూడాలనుకున్నాడు. కాని బెర్సెనీవ్ అవతలికి తిరిగి నిమ్మచెట్టుకిందనుంచి వెళ్ళిపోయాడు. ఉల్లాసంగా కాళ్లూపుకుంటో అతని వెనువెంటనే బయల్దేరాడు ఖూబిన్. బెర్సెనీవ్ బుజాలు పైకెత్తుకొని మెడసాచి వికారంగా నడుస్తున్నాడు. అయినా ఖూబిన్‌కన్న మంచి వంశస్తునిలాగా పెద్దమనిషిలాగా కన్పించాడు.



## ౨

యువకులిద్దరూ మాస్కోనదిని చేరుకుని ఒడ్డువెంటే నడవసాగారు. నీళ్ళపైనుంచి చల్లగాలి వీస్తోంది. చిన్నిచిన్ని కెరటాల మృదుమధురనినాదం వారిచెవుల కింపుగొల్పుతోంది.

"స్నానంచేయాలని వుందిగాని ఆలస్యం అయిపోతుంది. ఈ నది చూసినావు? ఆకర్షిస్తోంది. పురాతన గ్రీకులు నదిని దేవకన్య అనేవారు. కాని మనమేం గ్రీకులంగాం. ఓ దేవకన్యా! మేం మోటుసిథియన్లం!"

"మనకీ నదీదేవతలున్నారుగా" అన్నాడు బెస్సనీవ్.

"అవును. మనకీ నదీదేవతలున్నారనుకో. అయితే నాకు - శిల్పినైన నాకు - శీతాకాలంలో, ఓనాటి రాత్రి, ఓ రైతు గుడిసెలో భయకంపిత ఉత్సాహరహిత భావనాశక్తి నుంచి వుద్భవించిన నదీదేవతలవల్ల నాకేం లాభం? నాకు వెలుగుకావాలి. అవకాశం కావాలి. భగవాన్, నేను ఇటలీ యెప్పుడు వెడతానో, యెప్పుడో..."

"అంటే యుక్రెయిన్ వెళ్ళడమన్నమాట!

"సిగ్గు! సిగ్గు! ఆండ్రీ! అనాలోచితమైన కాస్త తప్పిదానికి యింత నిష్ఠూరమా! యిప్పటికే యెంతో పశ్చాత్తాపపడుతున్నా. నిజం. నేను వట్టి తెలివితక్కువ దద్దమ్మలా ప్రవర్తించా. యెంతో మెత్తటిమనసుగల అన్నావాసిలెవ్నా ఇటలీవెళ్ళి రావడానికి కావలసిన డబ్బిచ్చింది. కాని నేను యుక్రెయిన్ వెళ్ళి అక్కడివాళ్లతో కలిసి పిండివంటలు మెక్కుతూ..."

"ఇంకేమీ చెప్పక్కర్లేదులే" అంటూ అడ్డువచ్చాడు బెస్సనీవ్.

"అయినప్పటికీ ఆ డబ్బు వృధాగా వ్యయంచేయలేదనే అంటా. రక రకాల వ్యక్తుల్ని, ముఖ్యంగా రకరకాల స్త్రీలని చూచా...నాకు తెలుసు ...ఇటలీ దాటితే ముక్తిలేదు!"

"నువు ఇటలీ వెడతావులే." అన్నాడు బెర్సెనీవ్ షూబిన్ కేసి తిరగ కుండానే "కాని యేమీచెయ్యవు. రెక్కలల్లాడిస్తావేగాని యెగరవు. నీ సంగతి మాకు తెలీదూ?"

"స్టావసర్* యెగిరాడు. ఆయ నొక్కడేగాదు యింకా చాలామంది యెగిరారు. నేను యెగరలేదంటే నేను రెక్కలులేని పెంగుయిన్‌పక్షి నన్న మాట! ఇక్కడ నాకేం తోచడంలేదు. ఇటలీవెళ్ళితీరాలి. అక్కడ వెలుగు, సౌందర్యం!"

ఆ సమయంలో వెడల్పాటి అంచుగల గడ్డిటోపీ పెట్టుకొని గులాబి రంగు గొడుగువేసుకుని ఒక బాలిక వారిముందు ప్రత్యక్షమైంది.

"ఇదిగో! ఇక్కడకూడా సౌందర్యరాశి మనల్ని కలుసుకోటానికి వస్తోంది. సాధారణ శిల్పినైన నేను ఈ నవ మోహినికి సాష్టాభివందనం చేస్తున్నా" అని హఠాత్తుగా కేకేసి నాటకీయ భంగిమంలో టోపీ అల్లల్లాడించ సాగాడు షూబిన్.

ఈ ఆవేశపూరిత వాక్యాలకు గురైన ఆ బాలిక పేరు జోయా. ఆ బాలిక ఆగి షూబిన్‌ను తర్జనితో బెదిరించింది. మిత్రుడ్దరూ దగ్గరకు రాగానే మృదుమధుర స్వరంతో అన్నది: "భోజనాలకి రారాయేం? వడ్డించి యేవేళైంది?"

"యేమిటీ నే వింటూన్నది?" అన్నాడు షూబిన్ చేతులు చాస్తూ, "ఈ దివ్యసుందర విగ్రహం యింత యెండలో మాకోసం వెదకుతోందా? యీ నీ మాటలు యీ అర్థంలోనే తీసుకోనా? చెప్పూ, అవునా, కాదా? పోనీ చెప్పొద్దులే. నాకు కిష్టం చేస్తుందని యేవో అల్లిబిల్లిమాటలు చెబితే ఖూనీ అయిపోతాను!"

---

* రష్యన్ మహాశిల్పి.

"ఊఁ – ఇక చాల్లే పావెల్ యాగ్లోవిచ్?" అంటూ కొంచెం కష్టంగా జవాబిచ్చిందా బాలిక. "యేమిటా ఆషామాషీ మాటలు. నాకోపం వస్తుంది" అన్నది కులుకుతూ.

"కోప్పడకు, జోయా నికీలిష్నా, నా ఆదర్శ దేవతా! కోప్పడకు. నన్ను నిరాశా నరకకూపంలో పడద్రోయకు–ఇక ఆషామాషీ మాటలంటావా, నాదంతా అసలు ఆషామాషీ వ్యవహారమేగా!"

ఆ బాలిక బుజాలెగరవేసి బెర్సెనేవ్ కేసి తిరిగి "యెప్పుడూ యిలానే అంటుంటాడు. చంటిపిల్లని చూసినట్టు నన్ను చూస్తాడు. ఇక నాకో పద్ధెనిమిదేళ్ళు. పెద్దదాన్నయా?"

"అరి – భగవంతుడా!" అని షూబిన్ మూలిగాడు గుడ్లు పైకి తిప్పుతూ. బెర్సెనేవ్ మాట్లాడకుండా చిరునవ్వునవ్వాడు. జోయా కోపంతో నేలతన్నింది. "పావెల్ యాకోవ్లివిచ్! నాకోపం వస్తుంది!... ఎలీనాకూడా బయల్దేరిందిగాని యెండకు భయపడి తోటలోనే అట్టే వుండిపోయింది. నాకుమాత్రం యెండంటే యేంభయంలేదు. రండి, పోదాం."

అడుగడుక్కూ తీగలాంటి శరీరం వూపుకుంటూ, తీర్చివట్లున్న మురికి చేతుల్తో ముంగురులు పైకి ఎగదోసుకుంటూ జోయా నడవసాగింది. మిత్రులిద్దరూ ఆమెను అనుసరించారు. నిశ్శబ్దంగా చేతులు గుండెలమీద పెట్టుకుని నొక్కుకుంటూ మనస్ఫూర్తిగా మెచ్చుకుంటున్నట్టు నటించడానికి అవహేళనగా చేతులు పైకెత్తుతూ నడవసాగాడు షూబిన్. కొద్దినిమిషాలలో కంట్సోవో చుట్టూవున్న అనేక గృహాలలో ఒకదాన్ని చేరుకున్నారు. తోట మధ్యలో కుటీరాకృతిలో నిర్మించబడి గులాబీరంగు పూయబడ్డ ఓ చిన్ని కొయ్య యిల్లు కన్పించింది. ఆకుపచ్చటి చెట్లవెనకనించి ఆయిల్లు ప్రకృతి సిద్ధంగా తొంగిచూస్తున్నట్టుంది. జోయా ముందుగావెళ్ళి గేటు తెరిచి తోటలోకి పరుగెత్తింది. 'దేవదిమ్మర్లను యింటికి తోలుకొచ్చా' అని కేకేసింది. ఇంతలో యింకో బాలిక తోవపక్కన వున్న బల్లమీదనించి లేచినిల్చుంది. తెల్లబారిన ఆమెముఖం భావప్రకాశానికి అనువుగావుంది. తర్వాత యింటిదర్వాజావద్ద యింట్లో పెద్దావిడ ఊదారంగుపట్టుదుస్తులు ధరించి, ఎండతగలకుండా పట్టురుమాలు తలమీద వేసుకుని కనిపించింది. ఆవిడ ఆగంతకులను చూచి మందహాసంచేసింది. కాని ఆ మందహాసంలో బడలిక గోచరించింది.

# 3

అన్నా వాసిలెవ్నా స్టహోవ్ ఘ్ఞబిన్న ఇంటి ఆడపడుచు. ఏడో ఏటనే ఆమె తల్లిదండ్రులు చనిపోయారు. తత్ఫలితంగా ఆమెకు మంచి ఆస్తిపాస్తులు సంక్రమించాయి. ఆమె తండ్రివైపు చుట్టాలు అతిపేదవారు. తల్లివైపువారు అతి భాగ్యవంతులు. తల్లివైపువారిలో ముఖ్యులు సెనేటర్ వోల్గిన్, చికరసోవ్ రాకుమారి. అన్నా పోషణ బాధ్యత వహించిన ఆర్డిలియన్ చికరసోవ్ రాకుమారుడు మాస్కో బోర్డింగ్ స్కూల్లో ఆమెకి చదువు చెప్పించాడు. చదువు పూర్తయాక అతని యింట్లోనే ఆమె ఉంటూ వచ్చింది. అతని ఇంట్లో ధర్మసత్రం. విందులమీద విందులుజరుగుతుండేవి. శీతాకాలంలో నాట్య ప్రదర్శనాలు ఏర్పాటు చేస్తుండేవాడు. కాబోయే ఆమెభర్త నికొలాయ్ ఆర్టియోమెవిచ్ స్టహోవ్ఒకనాటి నాట్య ప్రదర్శనంలో ఆమె ప్రేమ చూరగొన్నాడు. అతన్ని వివాహమాడ్డానికి సమ్మతించిన సమయాన ఆమె ఆకర్షణీయమైన గులాబిరంగు గౌను, గులాబీ పూలు కుట్టినటోపీ ధరించి ఉంది. ఆ శుభముహూర్త జ్ఞాపకార్థం ఆమె ఆ టోపీని జాగ్రత్తపర్చింది.

నికొలాయ్ ఆర్టియోమెవిచ్ స్టహోవ్ తండ్రి కాప్టెన్. 1812 లో గాయపడి పింఛను పుచ్చుకుని పీటర్స్‌బర్గ్‌లో మంచి ఉద్యోగం సంపాదించుకున్నాడు. పదహారవయేట నికొలాయ్ మిలిటరీ పాఠశాలలో ప్రవేశించి తర్వాత తర్వాత రక్షణసైన్యంలో చేరాడు. సుస్వరప్రూపి. మంచిపొందికైన శరీరం. నృత్యంలో మంచిపేరు సంపాదించుకున్నాడు కాని అతనికి గొప్పవారి సాంగత్యం అలవడలేదు. యవ్వనంలో అతనికి రెండేరెండు కోరిక లుండేవి. ఒకటి, రాజఅంగరక్షకుడు కావాలని; రెండు, గొప్ప కుటుంబంలో

పిల్లను పెళ్ళిచేసుకోవాలని. మొదటి కోరిక తొందర్లోనే అంతరించిపోయింది. కాని రెండవ కోరిక ఇనుమడించింది. అందుకని ప్రతి శీతాకాలం మాస్కో వెడుతూండేవాడు. ఫ్రెంచిభాష చక్కగా మాట్లాడేవాడు. ఏ వ్యసనాలనూ దరికిచేరనీయకపోవడంవల్ల వేదాంతి అనే కీర్తి వచ్చింది. సామాన్య సైనికాధికారిగా వున్న రోజుల్లోనే "మనిషి జీవితకాలంలో ప్రపంచమంతా చూచి రాగలడా? సముద్రగర్భంలో జీవితం యెలా వుంటుందో తెలుసుకోగలమా?" మొదలైన ప్రశ్నలపై ఎప్పుడూ సాధ్యం కాదంటూ మొండిగా వాదిస్తుండేవాడు.

అన్నాను వివాహమాడిన నాటికి అతనికి ఇరవై అయిదేళ్ళు. ఉద్యోగంనించి రిటైరై తన ఎస్టేటువ్యవహారాలు స్వయంగా చూచుకుందామని గ్రామసీమలో నివాస మేర్పరచుకున్నాడు. కాని భూమంతా కౌలు కీయబడడంవల్ల పనేమీలేక జీవితం విసుగెత్తింది. దాంతో మకాం మార్చి మాస్కోలో భార్య యింట్లోనే స్థిరంగావుండిపోయాడు. యవ్వనంలో ఆటల్లో పాల్గొనలేదు. కాని యిపుడు లాటరీ ఆటఅంటే ఆసక్తి కలిగింది. ప్రభుత్వం దాన్ని నిషేధించినతర్వాత పేకాటంటే పిచ్చిపట్టింది. ఇంటిదగ్గర విసుగెత్తింది. తోచేదికాదు. జర్మన్ దేశస్థురాలైన ఒక పూర్వసువాసినితో ప్రేమకలాపం సాగించాడు. రోజంతా ఆమెతోనే గడుపుతూండేవాడు. 1853 వసంతంలో కంటోన్నావాకు వెళ్ళిపోయాడు. ప్రియురాలిని విడిచి వుండలేక మందుపుచ్చుకోవాలని వంకపెట్టి మాస్కోలోనే ఉండిపోయాడు. ఆ జర్మనుయువతితోనైనా ఎక్కువగా సంభాషించేవాడుగాదు. "వాన రాకడా-ప్రాణపోకడా తెలుసుకోగలమా లేదా" లాంటి విషయాలమీద ఆమెతో చర్చిస్తుండేవాడు. ఒకమాటు ఎవడో ఆతన్ని నిరాశావాది అని పిల్చాడు. ఆమాటా ఆతనికి అమితంగా సంతోషంగలిగించింది. 'అవును' మూతితిప్పుతూ అటూ యిటూ వూగుతూ ఆత్మసంతృప్తితో "అంత తేలిగ్గా సంతృప్తిపడేవాణ్ణేంగాను. నన్నేం ఆడించలేరు" అనుకునేవాడు. ఏదైనా మాట వినబడితే - ఉదాహరణకు - మనోనిబ్బరం అనేమాట వినబడితే వెంటనే మనోనిబ్బరం అంటే ఏమిటి అని ప్రశ్నించటం, ఎవరన్నా ఖగోళశాస్త్ర విజయాలను వర్ణిస్తే 'సరే నీకు ఖగోళశాస్త్రంలో నమ్మక మున్నదన్నమాట' అని చెప్పటం, ఇదీ నికోలాయ్ నిరాశావాదం!

ప్రత్యర్థిని శంగారు పెట్టదలచినప్పుడు 'వట్టిమాటలు, పసలేదు' అనేవాడు. చాలామంది ఈమాదిరి జవాబుకు నిరుత్తరులయేవారు. కాని, క్రిస్టియనోవ్నా తన దాయాదిని ఫెడలిండా పీటర్ర్డీలియన్‌కు ఉత్తరాల్లో ఇతన్నిగురించి 'పిచ్చికుంక' అని రాసిందనే సంగతి పాపం! నికొలాయ్‌కి తెలీదు.

ఇతని భార్య అన్నావాసిలెవ్నా పొట్టిపొటి మనిషి. బక్కపల్చన. సున్నితమైన అవయవాలు. ఉద్వేగం, ఆందోళన, విచారం ఆమెలో జీర్ణించిపోయాయి. పాఠశాలలో సంగీతం నేర్చుకుంది. నవలలు ఎక్కువగా చదువుతుండేది. తర్వాత ఈ రెండూ వదిలేసి చక్కటి దుస్తులు వేసుకోవడంలో ఆసక్తి తీసుకోటం మొదలెట్టింది. ఆతర్వాత ఇందులోనూ ఆసక్తి తగ్గిపోయింది. కూతురుకు విద్యగరపే బాధ్యతవహించింది. కాని త్వరలోనే అది తన వల్లగానిపని అని కూతురు చదువు ఓ పంతులమ్మకు ఒప్పగించింది. నానాటికీ క్షీణించిపోతూ ఉద్రేకానికి తేల్గ్గా లోనవుతూండేది. ఎలీనా పుటకతో ఆమె ఆరోగ్యం చెడిపోయింది. ఇక పిల్లలుపుట్టే ఆశ అంతరించింది. క్రిస్టియనోవ్నాతో తన మైత్రిని సమర్థించుకుంటానికి నికొలాయ్ యీ విషయం ఆధారం చేసుకొనేవాడు. భర్త విశ్వాస ఘాతుకత్వానికి అన్నా చాలా విచారపడేది. నికొలాయ్ ఆ జర్మన్ వనితకు తన గుర్రపుసాలనుంచి రెండు బూడిదరంగు గుర్రాలను రహస్యంగా తోలిపెట్టించినప్పుడు అన్నా అమితంగా బాధపడింది. కాని ఎన్నడూ భర్తను ముఖంమీద నిందించలేదు. వరసాగ్గా ఇంట్లో వాళ్లందరితోటీ చెప్పుకుఏడ్చింది. అన్నాకు ఇల్లుకదిలి వెళ్లడం ఇష్టముండేది కాదు. కాని ఎవరైనా వచ్చి కాస్సేపు బాతాఖానీకొడితే సంతోషించేది. ఒంటరిగావున్నప్పుడు మాత్రం బాధపడేది. ఆమెమృదుల హృదయ, ప్రేమార్ద్రురాలు. జీవితం ఆమెను త్వరితంగా అణగతొక్కేసింది.

పావెల్ యాకొవిచ్ షూబిన్ ఆమెకు దూరపుబంధువు. అతనితండ్రి మాస్కోలో ప్రభుత్వోద్యోగి. పావెల్ సోదరులు కాడెట్లదళంలో చేరారు. అందర్లోకి చిన్నవాడైన పావెల్ అంటే తల్లికి అమితగారాబం. ఆరోగ్యం అంతమంచిది కాకపోవటంవల్ల పావెల్ ఇంటిదగ్గరే ఉండిపోయాడు. ఉన్నతవిద్య అభ్యసించాలనే చూపుతో ఎలాగోవిధంగా హైస్కూలు చదువు సాగించాడు. చిన్నప్పటినించి అతనికి శిల్పమంటేసరదా. అతని పదహారోయేట

సెనేటుసభ్యుడు వోల్గిన్ అతని ప్రతిమలు చూసి సంతోషించి ఆ మేధావికి అండగా నిలబడతానని చెప్పాడు. తండ్రి చనిపోవటంతో అతని భవిష్యత్తంతా మారిపోయింది. మేధాపోషకుడైన ఆ సెనేటుసభ్యుడు హోమరుకవి * విగ్రహం అతనికి బహూకరించాడు. అంతే. కాని అన్నా ధనసహాయం చేసింది. పందొమ్మిదోయేట వైద్యవిద్య నభ్యసించడానికి విశ్వవిద్యాలయంలో ప్రవేశించాడు. కాని పావెల్ కు వైద్యవిద్య అంటే ఏమాత్రం ఆసక్తిలేదు. ఆనాటి ఉద్యోగపస్థితుల్లో ఇంకోవిద్య అభ్యసించడం అసాధ్యమై పోయింది. పైగా శారీరకశాస్త్రం చదవాలని అభిలాష కలిగింది. కాని అదీ సాగలేదు. రెండో సంవత్సరం చదవకుండానే – అసలు పరీక్షలదాకా ఆక్కుండానే తన అభిమానవిద్యకు కాలమంతా వినియోగించాలనే ఉద్దేశంతో చదువుకు స్వస్తిచెప్పాడు. ఎపుడో తిక్కతిరిగినపుడు పట్టుదలతో పనిచేశేవాడు. మాస్కో శివార్లలో రైతుబిడ్డల బొమ్మలుగీస్తూ, పెద్దా చిన్నా గొప్పా బీదా మొదలైన రకరకాలవారితోనూ, ఇటలీ శిల్పులతోనూ, రష్యన్ చిత్రకారులతోనూ కలిసిమెలిసి తిరుగుతుండేవాడు. చిత్రకళాశాలలో చేరటమన్నా, ఓగురువుదగ్గిర విద్య అభ్యసించడమన్నా అతనికి గిట్టేదికాదు. ప్రతిభవుంది. అందులో సందేహంలేదు. అతనికి మాస్కోలో కూడా పేరు ప్రతిష్టలు లభించాయి. అతనితల్లి పారిస్ లో మంచి కుటుంబంలో పుట్టింది. దయార్ద్రహృదయ. తెలివిగలది. ఈకొడుకుని చూసుకుని మురిసిపోతుండేది. ఫ్రెంచిభాష మాట్లాడడం నేర్పింది. అతిగారాబంగా పెంచింది. పావెల్ ఇరవైఒకటవయేట క్షయవ్యాధితో ఆమె మరణించింది. మరణించేటప్పుడు పావెల్ ను అన్నాకు అప్పగించిపోయింది. పావెల్ యాకోవ్లవిచ్ షూబిన్ యిపుడు అన్నాకుటీరంలో ఓగది ఆక్రమించుకున్నాడు.

* గ్రీసుదేశపు ఆదికవి




ఆయింటి యజమానురాలు "రాండి - రాండి భోజనానికి కూర్చుందాం" అని చింతాకలిత స్వరంతో వారినాహ్వానించింది. అందరూ భోజనశాలలోకి వెళ్ళారు. "జోయా! నా పక్కనకూర్చో. ఎలీనా! అతిథిసంగతి చూడు....పావెల్! సరిగా ప్రవర్తించు. జోయానువేపుకు తినకు. ఇవాళ నాకు తలనొప్పిగావుంది." అన్నది అన్నా.

తిరిగి గుడ్లుపైకి తిప్పాడు షూబిన్. జోయా ప్రత్యుత్తరంగా చిరునవ్వు నవ్వింది.

ఈ జోయా - సరిగా చెప్పాలంటే - జోయా నికిటిష్నామ్యూలర్ చూడచక్కని చిన్నది. మంచి ముఖవర్చస్సు. నిండైనవిగ్రహం. కొంచెం మెల్లకన్ను. ముక్కుచివర కొంచెంసొట్ట. ఎర్రటిచిన్ని పెదిమలు. ఈమె తల్లిదండ్రులలో ఒకరు రష్యన్, ఒకరు జర్మన్. రష్యావీరగీతాలు పసందుగా పాడగలదు. పియానోమీద ఉల్లాసకరమైన వివిధమధురగీతాలు బాగా వాయించగలదు. సొగసైనదుస్తులే ధరించింది గాని ఆ ధరించడంలో చిలిపితనం, డాబూ గోచరిస్తాయి. అన్నా తనకూతురికి ఈ బాలికను చెలికత్తెగా నియమించిందిగాని ఎప్పుడూ తన పనులకే నియోగిస్తూండేది. ఒంటరిగా ఉన్నపుడు జోయాతో ఏం మాట్లాడాలో ఎలీనాకు తోచేదికాదు. అందుకని జోయా ఎప్పుడూ తల్లి తగ్గిరేవున్నా ఏమీ అనుకునేదికాదు.

భోజనాల సమయంలో బెర్సెనీవ్ తన విశ్వవిద్యాలయ జీవితం గురించీ, తన ఆశలు, ఆశయాలను గురించీ ఎలీనాకు తెలియజేశాడు.

ఖూబిన్ ఇదంతా మెదలకుండా వింటూ అతి సంభ్రమంతో భోజనం చేశాడు. మధ్య మధ్య జోయాకేసి నవ్వులాటకు చిక్క-చూపు ప్రసరిస్తుంటే జోయాజవాబుగా మామూలు ఉదాసీన మందహాసం చేసింది.

. భోజనానంతరం ఎలీనా, బెర్సెనీవ్ ఖూబిన్‌లతో కలిసి తోటలోకి వెళ్ళింది. జోయావారికేసి తేరిపారజూచి బుజా లెగరేసి పియానో ముందు కూర్చుంది.

"నువ్వుకూడా కాసేపు అలా షికారు వెళ్ళకపోయావా ?" అని జవాబుకోసం నిరీక్షించకుండానే అన్నా "ఏదైనా వాయించు. ఏదైనా కరుణారసంతో కూడినపాట" ఉన్నది.

* "వీబర్ పాట పాడనా ?"

"ఊఁ -" అన్నది అన్నా పడకకుర్చీలో కూలబడుతూ. ఆమె కను ల్లో అశ్రువులు తళుక్కుమన్నాయి.

ఎలీనా ఆ మిత్రు లిద్దరినీ ఓ పొదరింటికి తీసికెళ్ళింది. ఆ పొద రింటి మధ్య చిన్న బల్లా, జల్లచుట్టూ బెంచీలూ వున్నాయి. హఠా త్తుగా ఖూబిన్ వెనక్కితిరిగి గంతేసి ఆగండి అని గొణిగి తన గదికి పరు గెత్తాడు. ఇంత బంకమట్టితో తిరిగొచ్చి తలాడిస్తూ గొణుక్కుంటూ తనలో తాను నవ్వుకుంటూ జోయా ప్రతిమను తయారుచేయసాగాడు.

"పాతఆటే" అంది ఎలీనా అతనికేసి చూసి. తర్వాత భోజనాల సమయంలో ప్రారంభించిన సంభాషణ కొనసాగించే ఉద్దేశంతో బెర్సెనీవ్ కేసి తిరిగింది.

"పాత ఆటా ? అయితే మటుకు నీనికేం అంతుందా ? యివాళ కోజూకంటె నాదుంప తెంపుతోంది."

"యెందుకని ?" అని అడిగింది ఎలీనా "యెవరైనా వింటే నువ్వు యెవరో నీచపు ముసలిముండనుగురించి మాట్లాడుతున్నావనుకుంటారు. కాని జోయా చక్కని చుక్క..."

"అవునవును" అంటూ అడ్డువచ్చాడు ఖూబిన్ "చక్కనిచుక్క! బహుచక్కని చుక్క! దారిబోయేవాడెవడికంటైనా పడితే 'ఈ చక్కని

* ప్రఖ్యాత జర్మన్ స్వరకర్త. (1786–1826) గొప్ప సంగీత నాట కాలు రచించాడు.

చుక్కలతో దాన్ని చేస్తే మహాభావుండును' అని అనుకొని తీరతాడు. అంతే గాదు, యిలా అనుకుంటారని జోయాకీ తెలుసు. యిలా అనుకోవడమూ దానికిష్టమే. లేకపోతే ఆ ఉలుకూ, ఆ పిగ్గూ...సరే-నే చెప్పే దర్ధమెం దనుకుంటా." అన్నాడు షూబిన్ తూంష్ణీభావంతో. "యేదైనా యిప్పుడు నీకు వేరే పనుంది కదూ?"

షూబిన్ జోయా ప్రతిమను విసుగుతో నలిపేసి బంకమట్టిని కలిపి తిరిగీ ప్రతిమను చేయ నారంభించాడు.

"అయితే ప్రొఫెసరుని కావాలని వున్నదన్నమాట?" అని ఎలీనా బెర్సెనీవ్‌ని ప్రశ్నించింది.

"ఆ" ఎర్రటిచేతులు మోకాళ్లమధ్య నొక్కుకుంటూ జవాబిచ్చాడు బెర్సెనీవ్. "అదే నా మహదాశయం. అటువంటి వున్నతపదవి స్వీకరించ డానికి నాలో అనేక కొరతలున్నాయని యెరుగుదు. నేనింకా పూర్తిగా సంసిద్ధుణ్ణికాలా. విదేశాలకు వెళ్ళాలనుకుంటున్నా. అక్కడ అవసరమైతే మూడునాలుగేళ్లుండి, ఆతర్వాత..." ఆగి కిందకిచూచాడు. తర్వాత వెంటనే కళ్ళు పైకెత్తి వికటంగా చిరునవ్వు నవ్వి తల నిమురుకున్నాడు. బెర్సెనీవ్‌కు ఆడవాళ్ళతో మాటాడేటప్పుడు అతిమెల్లగా మాటాడటం అలవాటు. కొంచెం నత్తికూడా వస్తుంది.

"హిస్టరీ ప్రొఫెసరివి కావాలనివుందన్నమాట?" అని అడిగింది ఎలీనా.

"హిస్టరీ ప్రొఫెసర్ని కానీ ఫిలాసఫీ ప్రొఫెసర్ని కానీ కావాలనివుంది, సాధ్యపడితే" అన్నాడు బెర్సెనీవ్ స్వరం ఇంకా తగ్గించి.

"వేదాంతంలో గట్టి పిండం!" అన్నాడు షూబిన్ గోళ్ళతో మట్టి ముద్దమీద లోతుగా గీతలుగీస్తూ "విదేశాలకి వెళ్లడం దేనికీ?"

"ఆ పదవి నీకు పూర్తిగా సంతృప్తి నిస్తుందా?" మోచేతిమీద ఆనుకుని బెర్సెనీవ్ ముఖంలోకి సూటిగా చూస్తూ అడిగింది ఎలీనా.

"పూర్తిగా, ఎలీనా నికొలయవ్నా, పూర్తిగా సంతృప్తి నిస్తుంది. యింతకంటే మంచి వృత్తేముంది? ఆలోచించు! టిమోఫీ నికొలేయవిచ్*

* మాస్కో విశ్వ విద్యాలయంలో ప్రపంచ చరిత్రాధ్యాపకుడు (1813-55)

అడుగుజాడల్లో నడవడం...అటువంటి పన్ని గురించి ఆలోచనే నాకానందం గలిస్తుంది...నాలోవున్న లోట్లు తెలుసుకునుండడంవల్ల కొంచెం తత్తరపాటు కల్గుతోంది. ఈ పనిని నిర్వహించమని మా నాన్న నన్నాశీర్వదించాడు."

"మీ నాన్నగారు మొన్నటి శీతాకాలంలో చనిపోయారు గదూ?"

"అవును, ఎలీనా! ఫిబ్రవరిలో చనిపోయాడు."

"గొప్ప గ్రంథ మేదో రాసుంచారంటారు, నిజమేనా?"

"నిజం. ఆయన అద్భుతమైన వ్యక్తి. నీకు బాగా నచ్చేవారు."

"ఆ - తప్పకుండా నచ్చేవారు. ఆ గ్రంథం దేనిమీద రాశారూ?"

"నాలుగుముక్కల్లో చెప్పాలంటే మహాకష్టం. మా నాన్న గొప్ప విజ్ఞాని - షెల్లింజియన్. ఒకొకప్పుడు ఆయన ధోరణి అర్థమయేదేకాదు."

"ఆంద్రీ పెట్రోవిచ్!" ఎలీనా అడ్డంతగిలి అడిగింది:

"తెలీక అడుగుతున్నా - షెలింజియన్ అంటే యేమిటి?" బెర్సెనీవ్ చిరునవ్వునవ్వి అన్నాడు: "షెలింజియన్ అంటే జర్మన్ వేదాంతి షెల్లింగ్ అనుయాయుడు అని అర్థం. ఇక షెల్లింగ్ తత్వం..."

"ఆంద్రీ! నీకు పుణ్యముంటుంది ఎలీనా నికోలయెవ్నాకు షెల్లింగ్ మీద ఉపన్యాసం దంచకు. బాబూకాస్త కనికరించు." అన్నాడు షూబిన్.

"ఎఁహ్, ఉపన్యాసమేంకాదు." అని గొణిగాడు బెర్సెనీవ్. ముఖం ఎర్రబారింది. "నా ఉద్దేశం..."

"యేం, ఉపన్యాసం మట్టుకెందుకివ్వకూడదూ? నాకూ, నీకూ, ఉపన్యాసాలు వినే అవసరమెంతైనా వుంది." అన్నది ఎలీనా. షూబిన్ ఆమెకేసి తేరిపారజూచి హఠాత్తుగా నవ్వాడు.

"యెందుకూ నవ్వుతున్నావ్?" అని అడిగింది ఎలీనా నిరుత్సాహం గానూ, కోపముతోనూ. షూబిన్ మారుపలకలేదు.

"సరే-సరే, మంచిది." అన్నాడు కాసేపైనతర్వాత.

"కోప్పడకు. నాదే తప్పు. యీ చెట్లకింద, యిలాంటి వాతావరణంలో వేదాంతం గురించి మాట్లాడాలని యెలా బుద్ధిపుట్టిందో! గులాబీ

లను గురించీ, కోయిలలను గురించీ, యువతీయువకుల నేత్రాలు, మంద హాసాలను గురించీ మాట్లాడడం ఉత్తమం."

"ఔనౌను. ఫ్రెంచి నవలలనుగురించీ, ఆడవాళ్ళ ఫాషన్లను గురించీ మాట్లాడడం మరీవుత్తమం." అన్నది ఎలీనా.

"యేం అందగత్తెలైతేసరి, వాళ్ళఫాషన్లను గురించీ మాట్లాడొచ్చు." అని సమాధానమిచ్చాడు, షూబిన్.

"యెందుకు మాట్లాడకూడదు ? మాట్లాడొచ్చు. కాని ఫాషన్లను గురించి మాకు మాట్లాడాలని లేదనుకో. శిల్పివిగా. స్వాతంత్ర్యం కావాలంటావే, ఇతర్ల స్వాతంత్ర్యానికి అడ్డుతగుల్తావేం ? ఇవే నీ అభిప్రాయాలైతే ఆ జోయా వెంటపడు. ఫ్యాషన్లగురించీ, గులాబీలగురించీ చర్చించడానికి తగినవ్యక్తి జోయా."

"అదా - సరే" అన్నాడు తొణుకుతూ. "సరే - మీ సూచన అర్థమైంది. ఆ అమ్మాయిదగ్గిరికి నన్ను తరిమెయ్యాలనా ఆలోచన ? అంటే పానకంలో పుడకలా నేనిక్కడున్నానన్నమాట !"

"ఇక్కడనించి నిన్ను తరిమెయ్యాలని మాకేంలేదు."

"అంటే మీ వుద్దేశం - నేను ఆ అమ్మాయిలాంటి వాణ్ణనీ, మరితరుల మధ్య మెలగ తగినవాణ్ణి కాదనీ, ముద్దొచ్చే ఆ జర్మనుపిల్లలాగా నేనూ మట్టిబుర్రననీ, చిలిపవాణ్ణనీ, అల్పుణ్ణననీ - కాదూ ?"

ఎలీనా ముఖంముడిచి "ఆ అమ్మాయిని గురించి యెప్పుడూ యిలా మాట్లాడవే ?" అంది ఎలీనా.

"ఆ - నన్నాక్షేపిస్తున్నావా ? సరే - నేనేం దాయటంలేదు వొకొప్పుడు, ఒక్క నిముషం ఆ నవనవలాడే చెక్కిళ్ళు...నీ మాటలే నీ కప్పగించాలనుకుంటే...సరే శెలవు." హఠాత్తుగా మళ్ళీ అన్నాడు. "ఏవో అర్థంలేని మాటలుమాటాడుతున్నా." తల ఆకారంగా తయారుచేసిన మట్టిముద్దను ఈడ్చి ఒక దెబ్బకొట్టి పొదరింటిలోంచి పరుగెత్తుకుని తన గదికి వెళ్ళిపోయాడు' "వట్టి పసిపిల్లాడు !" అంది ఎలీలా షూబిన్ కేసిచూస్తూ.

"శిల్పి !" అన్నాడు బెర్సెనీవ్ ప్రశాంతంగా మందహాసంచేస్తూ. "కళాకారులంతా యింతే. వాళ్ళ అవకతవక చేష్టలు మనం మన్నించాలి. అదివాళ్ళ జన్మహక్కు."

"అవును, కాని పావెల్ యింతవరకు అటువంటి హక్కు నిర్ధారించుకోలేకపోయాడు. యిప్పటివరకు యేం ఘనకార్యంచేశాడు? యేదీ నీ చెయ్యి. ఆ చెట్లదాకా నడిచివెడదాం. మన మాటలకు అడ్డంవచ్చాడు. మీనాన్నగారి గ్రంథంగురించి మాట్లాడుకుంటున్నాం కదూ?

బెర్సెనీవ్ ఎలీనా చెయ్యిపట్టుకున్నాడు. ఇద్దరూ తోటలో షికారు చేశారు. కాని ఆగిపోయిన సంభాషణ తిరిగి మొదలెట్టలేదు. ప్రొఫెసరు వృత్తిని గురించి తన అభిప్రాయాలూ, భవితవ్యంలో తన కార్యకలాపాలూ తిరిగి విశదీకరింప నారంభించాడు. బెర్సెనీవ్ నిక్కృతంగా ఆమె చెయ్యి పట్టుకుని, నిక్కృతంగా నడుస్తూ ఎప్పుడైనా తన బుజంతో ఆమెని తాకుతూ ఒక్కమారైనా ఆమెకేసి చూడకుండా ఆమె పక్కనే మెల్లగా నడవ సాగాడు. సరళంగా మాయామర్మ లేకుండా మాట్లాడాడు. చెట్లబోదెల మీదా, కంకర వేసిన బాటమీదా, పచ్చికమీదా ప్రసరిస్తున్న అతని కళ్ళు ఉత్తమభావాలు రేపే ఉద్రేకంతో వెలిగిపోతున్నాయి తనకు ప్రియమైన వారికి తన భావాలను విస్పష్టంగా విశదీకరించగల్గానని తెలుసుకున్నవానికి కల్గే ఆనందం అతని స్వరంలో ధ్వనిస్తోంది. ఎలీనా అతని మాటలు శ్రద్ధగా వింది. అతనికేసి సగం తిరిగి కొంచెం పాలిపోయిన అతని ముఖంకేసీ, ఆమె చూపుతో చూపు కలపకుండా తప్పించుకుంటున్నా ప్రశాంతంగానూ, స్నేహపూర్వకంగానూ ఉన్న కళ్ళకేసీ తేలిపారజూచింది. ఆమె ఆత్మ వికసించింది. హృదయంలోకి ఏదో సుకుమారమైన, న్యాయయుతమైన సద్భావం ప్రవహిస్తున్నట్టుఅందులో పెంపొందుతున్నట్టు ఆమెకిఅనిపించింది.



## ౫

చీకటిపడ్డా షూబిన్ తన గదిలోంచి బయటికి రాలేదు... బాగా పొద్దుబోయింది. శుక్లపక్షచంద్రుడు నడిమింటికెక్కాడు. పాలపుంత తెల్లగా ప్రకాశిస్తోంది. నక్షత్రాలు మినుకుమినుకు మంటున్నాయి. అన్నా వాసిలెవ్నాదగ్గిరా, ఎలీనా జోయాల దగ్గిరా శెలవుతీసుకొని బెర్సెనీవ్ మిత్రుని గదిద్వారం చేరుకున్నాడు. తలుపు గడియవేసి ఉంది. తట్టాడు.

"యెవరక్కడ?" షూబిన్ స్వరం.

"నేనూ" అని బెర్సెనీవ్ సమాధానం.

"యేంకావాలి?"

"లోపలికి రానీ, పావెల్! యిక కస్సుబుస్సులు కట్టేయ్. సిగ్గూ బిడియం లేమూ?"

"నేనేం కస్సుబుస్సు లాట్టంలేదు. నిద్రబోతున్నా. జోయాను గురించి కలలు కంటున్నా!"

"యికచాల్లే. నువేం చంటిపిల్లాడివా? లోపలికిరానియ్. నీతో మాట్లాడాలి."

"యేం, ఎలీనాతో మాట్లాడుతూంటివిగా"

"యికచాల్లే పావెల్! లోపలికిరానియ్."

సమాధానంగా షూబిన్ గురకపెట్టడం నటించసాగాడు. బెర్సెనీవ్ భుజాలు ఎగరేసి ఇంటిమొహం పట్టాడు.

ఉష్ణంగా వుంది. ఎందుకనో ఎన్నడూలేని నిశ్శబ్దం విలసిల్లు తోంది. చుట్టుపక్కల ప్రతి వస్తువూ వింటున్నట్టూ, కనిపెట్టి చూస్తున్నట్టూ అనిపిస్తోంది. గాఢాంధకారం గుప్పిట చిక్కుకుని బెర్సనీవ్ తటాలున ఆగిపోయి తానూ వినసాగాడు, కనిపెట్టి చూడసాగాడు. మధ్య మధ్య దగ్గిరగావున్న చెట్లపైన స్త్రీ దుస్తుల గరగరలాగా ధ్వనివిన్పించీ విన్పించనట్టు విన్పించింది. బెర్సనీవ్‌లో ఒక మధురభావం, భీతీ కలిగాయి. శరీరం జలదరించింది. తాత్కాలికంగా కన్నీటితో కళ్లు తడిసిపోయాయి. బాటన వేళ్లమీద చప్పుడిగాకుండా నడిచివెళ్ళి ఎక్కడైనా దాక్కోవాలని బెర్సనీవ్‌కి బుద్ధిపుట్టింది. పార్శ్వంనుంచి ఝుమ్ అని గాలివీచింది. బెర్సనీవ్ కొద్దిగా కంపించిపోయి నిలువునా నిలబడిపోయాడు. ఒకచెట్టు కొమ్మ నించి నిద్రిస్తున్న కుమ్మరి పురుగొకటి టపీమని కిందపడింది. 'ఒహో' అంటూ మళ్ళీ ఆగిపోయి ఎలీనాను గురించి ఆలోచించసాగాడు. ఊగిసలాడే భావాలు మటుమాయమైపోయాయి. ఉద్రిక్తపర్చే ఆ నిశి కొంగ్రొత్తతనం, వాహ్యాళిపరిజ్ఞానంమాత్రం మిగిలాయి. అతని తనువంతా ఆ నవయవ్వనవతిరూపంతో నిండిపోయింది. ఆమె మాటలు, వేసిన ప్రశ్నలు జ్ఞప్తికి తెచ్చుకుంటూ తలవంచుకుని బెర్సనీవ్ నడక సాగించాడు. వెనక తొందర తొందరగా పడుతున్న అడుగులు చప్పుడు అయినట్టు వినిపించింది. విన్నాడు. ఎవరో పరుగెత్తుకొస్తున్నారు. తన్ను కలుసుకో నున్నారు. నిట్టూర్పు వినిపించింది. హఠాత్తుగా ఒకచెట్టు నీడలోంచి షూబిన్ బైటపడ్డాడు హాటులేదు. జుట్టు చిందరవందరగా వుంది. ముఖం పాలిపోయింది.

“యీ తోవనే నువ్వు వెడుతూండడం మంచిదైంది. నిను కలుసుకోక పోతే యీ రాత్రంతా నాకు నిద్రపట్టేదికాదు. యేదీ, నీ చెయి అందియ్. యింటికే వెడుతున్నావుగా.” అన్నాడు షూబిన్ అతికష్టంమీద.

“ఆ - యింటికే వెడుతున్నా.”

“నీతో నేనుకూడా వస్తా.”

“అరే - హాటులేకుండా యెలా వస్తావ్ ?”

“మరేం ఫర్వాలేదు. టైకూడా తీసిపారేశా. వుడుకెత్తిపోతోంది.”

మిత్రులిద్దరూ నాలుగడుగులు వేశారు.

"యివాళ వట్టి తెలివితక్కువ దద్దమ్మనై పోయాగదూ ?" అని హఠాత్తుగా ప్రశ్నించాడు ఖూబిన్.

"అవును. నిజం. నిన్నర్థం చేసుకోలేకపోయా. నువ్విలా ప్రవర్తించడం యెన్నడూ యెరగను. ఆ కాస్త భాగ్యానికి అంత తామసం యెందుకొచ్చింది ?"

"హుఁ—" అని "నీకలాగేవుంటుందిలే. కాని నాకుమాత్ర మదేం చిన్నవిషయంకాదు. నువ్వేమన్నా అనుకో నేను... నేను... నేను ఎలీనాను ప్రేమిస్తున్నా ?"

"నువ్వు...నువ్వు ఎలీనాను ప్రేమిస్తున్నావా ?" అని కొయ్యలా నిలబడిపోయాడు, బెర్సెనీవ్.

"అవును." అంటూ సాగించాడు ఖూబిన్ బలవంతపు ఉదాసీనతను సూచించే కంఠంతో.

"యేం, ఆశ్చర్యంగా వుందా ? యింకో విషయంకూడా చెప్తా. యీ సాయంకాలంవరకూ ఎలీనా యేనాటికైనా నను ప్రేమించకపోతుందా అని ఆశతోవున్నా. యివాళ నాఆశ నిరాశ అయిపోయింది. యింకోర్ని ప్రేమిస్తోంది."

"యింకోర్నా ? యెవర్ని ?"

"యెవర్నా ! నిన్నే" అని ఖూబిన్ బెర్సెనీవ్ బుజం తట్టాడు.

"నన్నా ?"

"ఆ—నిన్నే" అని తిరిగిచెప్పాడు ఖూబిన్.

బెర్సెనీవ్ ఒక్క అడుగువెనక్కి వేసి కొయ్యబొమ్మలా నిల్చుండిపోయాడు. ఖూబిన్ అతనికేసి తీక్షణంగా చూసి "యిదికూడా నీకు ఆశ్చర్యం కలిగిస్తోందా ? నువు వట్టి బిడియస్తుడివి. అయినా నిన్నే నిశ్చయంగా ప్రేమిస్తోంది."

"యేమిటిగా పిచ్చిమాటలు." అన్నాడు బెర్సెనీవ్ కొంచెం కష్టంగా.

"పిచ్చిమాటలేంకావు. యెందుకూ ఆగడం ? పద. నడుస్తుంటే మనసు తేలిగ్గావుంటుంది. చాలాకాలంనించీ ఆమెని బాగా యెరుగుదును. నేనేం పొరపాటుపడలా. నువ్వంటే ఆమెకి మోజుపుట్టింది వొకప్పుడు

నేనంటే యిష్టంగానే వుండేదిగాని ఆమెముందు నేనేపాటి? నువ్వు గంభీరుడివి. నైతికంగా, శారీరకంగా బహుయోగ్యుడివి. భావలోకసంచారివి. అయితేనేం 'అతి' నీలోలేదు. రష్యన్ మధ్యతరగతి ఘరానా మనుషులు గర్వించే శాస్త్రీయోపాధ్యాయత్వానికి ప్రతినిధివి...యింతేగాదు మొన్నో రోజున నేను జోయా చేతులు ముద్దెట్టుకుంటుంటే ఎలీనా చూసింది."

"జోయా చేతులా!"

"ఆ-జోయా చేతులు. మరేమనుకున్నావ్? ... జోయా బుజాలు యెంత అందంగా వుంటాయనుకున్నా!"

"బుజాలా?"

"ఊ-బుజాలు, చేతులు! రెండూ వొకటేగా! యిలా అతిచనువుగా ప్రవర్తించడం భోజనాలయ్యాక ఎలీనా కంటబడింది. భోజనాలకి పూర్వం నేను జోయాను తిడుతున్నా. దురదృష్టవశాత్తు యిలాంటి వైరుధ్యాలలోని స్వాభావికత ఎలీనాకు అర్థంకాలా. సరిగ్గా ఆ సమయానికే నువువచ్చేశావ్. నువు - యిప్పుడు నీకు దేంటో విశ్వాసముంది? ఉలకటం, కంగారుపట్టం, * షిల్లర్ షెల్లింగ్ లమీద వుపన్యాసాలు దంచడం, (గొప్పవాళ్లకోసం ఆమె వెతుకుతూంటుంది.) యింకేం విజయలక్ష్మిని చేపట్టేశావ్. యిక నేను-దురదృష్టవంతుణ్ణి - చలోక్తులు విసరాలని తంటాలుపట్టం...యీలోపున..."

షూబిన్ హఠాత్తుగా ఏడ్వడం ప్రారంభించాడు. ఒక పక్కకు వెళ్ళి జుట్టు చేత్తోపట్టుకొని నేలమీద కూర్చుండిపోయాడు. బెర్సెనీవ్ అతని దగ్గిరికి వెళ్ళి "పావెల్! యేమిటీ, మరీ చిన్నపిల్లాడివైపోతున్నావేం? యివాళ యిలా తయారైనావేం? నీ బుర్రలోకి యీ చెత్తంతా యెలా యెక్కిందో దేవుడికే తెలియాలి. యేడిచేస్తున్నావ్. నిజం చెప్పాలంటే, యిదంతా నటన అనిపిస్తోంది నాకు."

షూబిన్ తలెత్తాడు. చెంపలమీద కన్నీటిబిందువులు వెన్నెట్లో తళుక్కుమంటున్నాయి. కాని ముఖంలో మందహాసం తాండవిస్తోంది.

---

* షిల్లర్ (1750-1805) విశ్వవిఖ్యాతి గాంచిన జర్మన్ నాటక రచయిత, గొప్ప విమర్శకుడు.

"ఆండ్రీ! నీ యిష్టమొచ్చినట్టు అనుకో. యివాళేదో నాకొంచెం మతిపోయింది. నేను ఎలీనాను ప్రేమిస్తున్నా, ఎలీనా నన్ను ప్రేమిస్తోంది. ముమ్మాటికీ యిది నిజం. సరే - మీ యింటి దగ్గర నిను దిగబెడతానని మాట యిచ్చాగదూ, మాట నిలబెట్టుకుంటా." షూబిన్ లేచి నుంచుని" అహో! యేం రాత్రి! ధావళ్యం! అంధకారం! యవ్వనం! యెవరోవొకరు నను ప్రేమిస్తున్నారనే చైతన్యం యెంత మహోన్నతమైంది! నిద్రపోకుండా వుంటంలో యెంత ఆనందముంది! నిద్రపోతావా ఆంద్రీ!"

బెర్సెనీవ్ జవాబియ్యకుండా త్వరత్వరగా నడవ నారంభించాడు.

"యెక్కడికి కా పరుగు ఆంద్రీ! నీ జీవితంలో యిలాంటి రాత్రి తిరిగీ రాదు. కాని యింటిదగ్గిర షెల్లింగ్ రాసిన పుస్తకం నీకోసం కాచుక్కూచుం టుంది! యివాళ షెల్లింగ్ నీకెంతో వుపయోగపడ్డాడన్నమాట నిజమేగాని అంత తొందరెందుకు? నీకు సంగీతంవస్తే పాడు. బిగ్గరగా పాడు. రాకపోతే హేటు తీసిపారేసి రొమ్మువిరుచుకుని నక్షత్రాలకేసి చూస్తూ చిరునవ్వు నవ్వు. నక్షత్రాలు నిను కనిపెట్టి చూస్తున్నాయ్. నిన్నొక్కణ్ణే చూస్తున్నాయ్. అవి ప్రేయసీ ప్రియులకేసి చూస్తాయ్. అదే వాటిపని. అందుకే అవి అంత అందంగా వుంటాయ్. నువు ప్రేమలో పడ్డావ్, ఆంద్రీ! కాదూ? జవాబు చెప్పవేం?" షూబిన్ తిరిగీ ప్రారంభించాడు! "సరే - మాట్లాడకు. ఆనందం కల్గితే నోరు మెదపద్దు. నేను యెవరూ ప్రేమించని దరిద్రుణ్ణి, నటుణ్ణి, మాంత్రికుణ్ణి, హాస్యగాణ్ణి! అందుకే యిలా వాగేస్తున్నా. యెవరో వొకరు నను ప్రేమిస్తున్నారని తెలిస్తేనా! యీ నక్షత్రాలకింద, యీ నిశా వాయువులో మాటలకందని మహదానందం యెన్ని గుక్కలు తాగేసేవాణ్ణో! బెర్సెనీవ్! నీకు సంతోషంగా వుందా?"

బెర్సెనీవ్ వెనకటిలానే మౌనం వహించి రోడ్డువెంట త్వరత్వరగా నడవసాగాడు. ముందు, చెట్లమధ్య అతను నివసించే గ్రామంలోని దీపాలు మినుకుమినుకు మంటున్నాయ్. రోడ్డుకు కుడివైపున ఊరి మొదట్లో రెండు రావిచెట్లకింద చిన్న దుకాణం ఉంది. అప్పటికే దుకాణ కిటికీ మూసేశారు. కాని తెరిచివున్న ద్వారంగుండా విశాలమైన కాంతి పుంజం విసనకర్రలా పచ్చికమీదా చెట్లమీదా వచ్చిపడి ఒత్తుగా పెరుగుతున్న ఆకుల అడుగు భాగాలను ప్రకాశింపజేస్తోంది. సేవకురాలుగా కనిపించే ఓ బాలిక వీపు

తలుపువైపుకు పెట్టి నిల్చుని బేరమాడుతోంది. తలమీద యెఱ్ఱటి రుమాలు వేసుకుని చుబుకంమీద దాన్ని చేతుల్తో అదిమిపట్టుకుంది. ఆ రుమాల్లో దాక్కొన్న యెత్తైన బుగ్గలు, సన్నటి మెడా సరిగా కన్పించడంలేదు.

యువకులిద్దరూ ఆ కాంతి పుంజంలోకి అడుగుపెట్టారు. ఖ్రూబిన్ దుకాణం లోకి తొంగిచూసి 'అనుష్కా' అని కేకేశాడు. ఆ బాలిక గిఱ్ఱున వెనక్కి తిరిగింది. కొంచెం విశాలమూ, అందమూ అయిన ముఖం. నవనవలాడే శరీరవర్ణం. మందహాసం చేసే గోధుమరంగు కళ్ళు, నల్లటి కనుబొమలూ దృగ్గోచరమైనాయ్. 'అనుష్కా' అని తిరిగీ కేకేశాడు ఖ్రూబిన్. ఆ బాలిక అతనికేసి తొంగిచూసి అదిరిపడి, కంగారుపడి, కొనదలచినవి కొనుక్కో కుండానే గబగబా మెట్లుదిగి వారివైపునుంచే తొందరగా దూసుకుపోయింది. వెనక్కి తిరిగి చూస్తూ ఎడమవైపుకు రోడ్డు దాటింది. పల్లెటూరి వ్యాపారస్తులందరిలాగానే ఈ దుకాణదారూ వట్టి పొగరుబోతు. లావుపాటి మనిషి. పళ్ళు పటపట కొరికి ఆవళింపసాగాడు. ఖ్రూబిన్ బెర్సెనీవ్ కేసి తిరిగి "యిక్కడ చూచావ్గా, నే నెరుగున్న కుటుంబ మొకటుంది. అదే వారి యిల్లు – మనం అనుకోకేం..." మాట పూర్తిచేయకుండానే వెళ్ళిపోతున్న బాలిక వెంటబడ్డాడు ఖ్రూబిన్.

"కన్నీళ్ళయినా తుడుచుకో" అని బెర్సెనీవ్ ఖ్రూబిన్ వెనక కేకేసి పక్కున నవ్వాడు. కాని ఇంటికి చేరుకున్నాక సంతోషం మటుమాయమైంది. నవ్వలేకపోయాడు. ఖ్రూబిన్ చెప్పినమాటల్లో భ్రాంతిగా నమ్మకం కుదరలేదు. కాని అవి హృదయంలో హత్తుకుపోయాయి.

"పావెల్ నన్ను పరిహాసం చేస్తున్నాడు. యెప్పుడో వకరోజున ఆమె యెవర్నో వకర్ని ప్రేమిస్తుంది. యెవర్ని ప్రేమిస్తుందో?" అనుకున్నాడు.

బెర్సెనీవ్ గదిలో చిన్న పాతపియానో ఒకటుంది. శ్రుతులు సరిగా లేకపోయినా మృదుమధురనాదం గొలుపుతుంది. బెర్సెనీవ్ పియానోముందు కూర్చునివాయించ నారంభించాడు. సాధారణంగా రష్యాలో పెద్దకుటుంబాల్లో పుట్టిన వారంతా యవ్వనంలో సంగీతమంటే చెవికోసుకునేవారు. నిజానికి బెర్సెనీవ్ ప్రేమించింది సంగీతప్రదర్శన కళాకాదు, సంవిధానమూ కాదు. (స్వరాలు, తాళాలు, సంగీతనాటకాలు అతన్ని కుంగదీసేవి) మూలసూత్రా

లను అతను ప్రేమించేవాడు. స్థాయిల హెచ్చుతగ్గులూ, స్వరసమ్మేళనం, హృదయంలో రేపే అస్పష్ట, మధుర, లక్ష్యరహితభావాలను ప్రేమించేవాడు. గంటకుపైగా వాయించిందే వాయిస్తూ కొత్తస్వరంకోసం అవకతవకగా యత్నిస్తూ మందరంలో పరవశుడు కాసాగాడు. హృదయం బాధపడింది. ఒకటి రెండుసార్లు కన్నీరు ప్రవహించింది. చీకటిలో ప్రవహించిన ఆ కన్నీటికి అతను సిగ్గుచెందలేదు. "పావెల్ అన్నదే సరైంది. యిప్పుడు తెలిసొస్తోంది. యిలాంటి సాయంకాలం తిరిగిరాదు" అనుకున్నాడు. ఎట్టకేలకు లేచి కొవ్వొత్తి వెలిగించాడు. పడక దుసులుంధరించి "రౌమర్" రచించిన "* హోహెన్‌స్టాఫెన్ చరిత్ర" రెండో భాగం అలమారాలోంచి తీసి ఒకటి రెండుమాట్లు నిట్టూర్చి చదవడానికి కూర్చున్నాడు.

---

* జర్మన్ రాజవంశం. 1138 నుండి 1209 వరకు తిరిగి 12 4 నుండి 1254 వరకు జర్మనీని పరిపాలించారు.

## ౬

ఈలోపున ఎలీనా తనగదికి వెళ్ళి తెరిచివున్న కిటికీదగ్గర చేతిమీద తలానించుకుని కూర్చుంది. ఈ కిటికీదగ్గిర రోజూ పావుగంటసేపు అలా కూర్చోటం ఆమెకి అలవాటు. ఈ సమయంలో తనలో తాను విషయపరిశీలన చేసుకోటం, గతదినపు చర్యలను సంస్మరించుకోటం ఆమెకి పరిపాటి. ఇరవయ్యో ఏడు కొనసాగుతున్న దే దాటింది. పొడగరి. అతి తెలుపుశరీరం. విల్లంబులాంటి కనుబొమలు. బూడిదరంగు పెద్దకళ్ళు. కళ్ళచుట్టూ చిన్న చిన్న మచ్చలు. తిన్నని నుదురు, ముక్కు, పల్చటిజుట్టు. సున్నితమైన మెడ. కొనదేలిన చుబుకం. ఆమె తనువంతటిలో, అతిజాగృతీ భీతీ వెలువరించే ముఖకవళికలో, చంచల నేత్రాలలో, అలసతాభావం గోచరించే దరహాసంలో, బొంగురుగొంతులో బిగువూ, ఆ వేగమూ, తొందరపాటూ ప్రస్ఫుటమవుతాయి. ఈ భావాలను అందరూ మెచ్చుకోలేరు. కొందరు కంటగించుకుంటారు కూడా. సన్నని గులాబిరంగు చేతులు, పొడుగాటివేళ్ళు, సున్నితాలైన పాదాలు. ముందుకు కొంచెంవంగి తొందరతొందరగా అడుగులు వేస్తుంది. ఆమెలో ఉద్రిక్తత విచిత్రపరిణామం పొందింది. ఆదిలో తండ్రిని ఆరాధించేది. తర్వాత తల్లిని పిచ్చిగా ప్రేమించసాగింది. ఆతర్వాత యిద్దరిమీదా, ముఖ్యంగా తండ్రిమీద, ప్రేమ చల్లారిపోయింది. ఇటీవల రోగిష్టి ముసలమ్మను చూచినట్టు తల్లినిచూడసాగింది. చిత్రమైనపిల్లఅని పేరు గణించుకున్నంతవరకు ఎంతో గర్వంతో చూసుకున్న తండ్రి ఎలీనా పెద్దదికాగానే భయపడసాగాడు. "వొళ్ళుతెలీని స్వేచ్ఛావాది" అనీ "యెవరిపోలికవచ్చిందో బాబూ" అనీ ఎలీనాను గురించి అంటుండేవాడు. నైతికదౌర్బల్యానికి ఆమె మండిపడేది. తెలివితక్కువతనానికి కోపగించుకునేది. అబద్ధాలాడే

వారిని ఎన్నడూ క్షమించేదికాదు సనేమిరా కోరికలు తగ్గించుకోట మనేదిలేదు. ప్రార్థనలలో కూడా తరచు నిందావాక్యాలు దొర్లుతుండేవి. ఏ వ్యక్తిమీదనైనాసరే ఆమెకి గౌరవం పోయిందంటే అంతటితో అతని ఉనికే మర్చిపోయేది. ఒక అభిప్రాయానికి కూడా త్వరగా, తరుచు అతిత్వరగా వచ్చేది. ప్రతీదీ ఆమె ఆత్మమీద అతిగాఢంగా ముద్రితమయ్యేది. ఆమె దృష్టిలో జీవితం అంత తేలికైందేంగాదు.

ఎలీనా చదువు పూర్తిచేయడానికి – అసలు అన్నావాసిలెవ్నా కూతురికి చదువు ప్రారంభిస్తేనా – తల్లి నియోగించిన పంతులమ్మ రష్యన్ వనిత. స్త్రీ కళాశాలలో చదువుకుంది. ఆమె తండ్రి లంచాలు మరిగి అంపమూలంగా సర్వనాశనమయ్యాడు. ఆ పంతులమ్మ రసపిపాసి, దయార్ద్ర హృదయ. కాని నిజాయితీపరురాలుకాదు. వరసగా అనేకసార్లు ప్రేమ పాశాల్లో చిక్కుకుని చివరికి ఓ అబ్కారీశాఖాధికారిని వివాహమాడింది. కాని వెనువెంటనే ఆ అధికారి ఆమెను పరిత్యజించాడు...ఇదంతా జరిగింది 1850 లో. అప్పటికి ఎలీనాకు పదిహేడేండ్లు. ఆ పంతులమ్మకు సాహిత్య మంటే అమితయిష్టం. చిన్న చిన్న పద్యాలుకూడా రాస్తుండేది. శిష్యు రాలిలో చదువంటే ఆసక్తి రేకెత్తించింది. కాని ఒక్క చదువుతో ఎలీనా తృప్తిపడలేకపోయింది. దరిద్రులు, క్షుద్బాధాపీడితులు, రోగిష్టులమీదే ఆమె దృష్టి. వారి విషయమై ఎంతో విచారపడేది, బాధపడేది. వారిని గురించి కలలు కనేది. పరిచితులందరినీ వారిని గురించే ప్రశ్నించేది. బాగా ఆలోచించి, సహజ తీవ్రబుద్ధితో, మహోద్రేకంతో ముష్టివేస్తుండేది. బక్కచిక్కిన పశువులు, తిండితృప్తిలేని కుక్కలు, చావుకు సిద్ధంగా ఉన్న పిల్లికూనలు, గూళ్ళలోనించి కిందపడ్డ పిచ్చుకలు, చివరకు పురుగులు, పాములు కూడా ఎలీనా సహాయం, ఆశ్రయం పొందేవి. వాటికి స్వయంగా ఆహారం పెట్టేది. ఎంత అసహ్యం కొల్పినా వాటిని విడనాడేదిగాదు. ఇందులో ఆమె తల్లి జోక్యం కల్పించుకోలేదు. కాని తండ్రి ఇదంతా చూసి మండి పడేవాడు. ఆమె దయార్ద్రతను అసభ్య చిత్తవృత్తిగా చిత్రిస్తూ మాట్లాడే వాడు! కుక్కలతో, పిల్లులతో ఇల్లో తిరిగడానికి ఆస్కారంలేకుండా పోయిందని నిందించేవాడు. "లెనోచ్కా! రా. అదిగో, సాలెపురుగు ఈగను తినేస్తోంది. పాపం! వచ్చి ఈగను విడిపించు" అంటూ ఆమెను

పిల్చేవాడు. ఆమె ఆదుర్దాతో వణికిపోతూ పరుగెత్తుకుంటూవచ్చి ఈగను వదిలించేది. "సరే, యిక అంత దయగలదానివైతే ఆ సాహసపురుగును నిన్ను కరవనీ" అనేవాడు హేళనగా. కాని ఆమాట ఆమె క్షమించుకునేదికాదు.

పదేళ్ళప్రాయంలో ఆమెకి కాట్యా అనే ముష్టిపిల్లతో పరిచయం కల్గింది. రహస్యంగా వెళ్ళి తోటలో ఆ పిల్లని కలుసుకుంటుండేది. ఆ పిల్ల ఇచ్చిన మిఠాయి, రొట్టెముక్కలు తీసుకుని వాటికి బదులుగా రుమాళ్ళు, డబ్బులు ఆ పిల్లకి బహూకరిస్తుండేది కాట్యా ఆటవస్తువులు బహుమానంగా పుచ్చుకునేదికాదు. ఇద్దరూ పొదలమధ్య ఏ దురదగొండిచెట్టు చాటునో నేలమీద ఒకరిపక్కన ఒకరు కూర్చుండేవారు. వినమ్రతాభావంతో ఉప్పొంగిపోతూ, కాట్యా ఇచ్చిన పాసిపోయిన రొట్టెతింటూ, ఆ పిల్ల చెప్పే కథలు ఎలీనా వింటుండేది. కాట్యాకి ఓ పిన్ని ఉంది. ఆమె వట్టి క్రూరురాలు. తరుచు కాట్యాను కొట్టేది. ఆమంటే కాట్యాకు పరమ అసహ్యం. పిన్నిబారినించి ఎలా తప్పించుకుని పారిపోయి, "భగవంతుని స్వేచ్ఛాప్రపంచం"లో నివసించదలచిందో కాట్యా వర్ణిస్తుంటే ఎలీనా అప్రకటిత గౌరవభావంతో, భయంతో దృష్టి కాట్యాపై నిలిపి విచిత్రమైన యీనవ్యభావాలను వింటుండేది. ఆ సమయంలో కాట్యా తనువంతటిలో, మృగాలకళ్ళవంటి తీక్ష్ణమైన నల్లటికళ్ళలో, ఎండవేడిమికి కమిలిపోయిన చేతుల్లో, బొంగురుగొంతులో, చినిగిపోయిన బట్టల్లో సైతం విశిష్టమైన పవిత్రత ఎలీనాకు గోచరించేది. ఇంటికి తిరిగివెళ్ళి దరిద్రులవిషయం, 'భగవంతుని స్వేచ్ఛాప్రపంచం' విషయం ఆలోచించేది. ఓ కర్రా, జోలీ పట్టుకుని కాట్యాతో పారిపోయి తలకు గడ్డిపూలదండ (అటువంటి దండ కాట్యా ధరించడం ఓమాటు చూచించి) చుట్టుకుని రహదారులవెంట తిరగాలని ఆలోచించేది. అలా ఆలోచించేసమయంలో తన కుటుంబంలోని వారెవరైనా గదిలోకి రావడం తటస్థిస్తే ఎలీనా సిగ్గుపడి, చిరచిరలాడేది. ఓమాటు కాట్యాకు కలుసుకోటానికి వానలో పరుగెత్తుకువెళ్ళి దుస్తులు బురదచేసుకుంది. తండ్రిచూచి 'మడ్డమృగమా' అని తిట్టాడు. ఆమె సిగ్గుతో కుంచుకుపోయింది. విచిత్రమైన భీతావహం ఆమె నాక్రమించుకుంది. తరుచుగా కాట్యా సైనికులు పాడే ఓ అసభ్యగీతం పాడుతుండేది. ఎలీనా

ఆ గేయం నేర్చుకుంది...అన్నా వాసిలెవ్నా ఒకతడవ ఆపాటవిని మండిపడి "ఆ వెధవ చెత్త యెక్కడ నేర్చుకున్నా?" అని మందలించింది.

ఎలీనా తల్లికేసి చూచి, జవాబియ్యక మెదలకుండా ఊరుకుంది. ముక్కలుముక్కలు కింద కోసేసినా తన రహస్యం బైటపెట్టకూడదని ఎలీనా నిశ్చయించుకుంది మళ్లీ ఆ మధురభీతావహభావం ఆమె నాక్రమించింది. అయితే ఏంలాభం? కాట్యాతో చెలిమి అట్టేకాలం నిలవలేదు పాపం! ఆ ముష్టిపిల్ల జ్వరంతగిలి కొద్దిరోజులకే చనిపోయింది.

కాట్యా మరణవార్త విని ఎలీనా అమితచింతాక్రాంతురాలైంది. చాలా కాలంవరకు ఆమెకి రాత్రిళ్ళు నిద్రపట్టేదికాదు. ఆ ముష్టిపిల్ల ఆఖరిమాటలు అవిరామంగా ఎలీనా చెవుల్లో గింగురుమంటుండేవి. ఆ మాటలామెను పిలుస్తున్నట్టుండేవి...

మంచుకింది నీరులాగా సంవత్సరాలకి సంవత్సరాలు త్వరితంగా, తెలీకుండా గడిచిపోయాయి. ఎలీనా బాల్యం పైకి సోమరితనంలో, అంతస్సంఘర్షణ, తుఫానులతో వెళ్ళిపోయింది. ఆమెకి స్నేహితులంటూ ఎవరూలేరు. స్నహోఫుల ఇంటికి వచ్చే బాలికల్లో ఒకరితోనైనా ఆమెకి బాగా పరిచయం ఏర్పడలేదు. తలిదండ్రు లెన్నడూ ఆమెమీద అధికారం చెలాయించేవారుకారు. పదహారవయేటనించీ ఆమె సర్వస్వతంత్రురాలైంది. జీవితం తన ఇష్టమొచ్చినట్టు గడిపింది. కాని ఒంటరి జీవితం! ఆ ఒంటరితనంలో ఆమె ఆత్మ వెలిగి చల్లారిపోతుండేది. పంజరం లేకపోయినా పంజరంలోని పక్షిలా కొట్టుకునేది. ఆమెమీద ఎట్టి నిర్బంధాలూ, నిషేధాలూ ఎవరూ పెట్టి ఎరగరు. అయినా ఆమె కొట్టుకులాడుకునేది. చివరికి క్షీణించిపోయింది.

ఒకొక్కప్పుడు తనను తానే అర్థంచేసుకోలేకపోయేది. తన్ను చూచుకుని తానే భయపడేది. చుట్టూవున్న ప్రతిదీ అర్థరహితంగానూ, అగమ్యంగానూ ఆమెకి కన్పించేది. 'ప్రేమ లేకుండా జీవిత మేమిటి?' అనుకుంది. 'కాని ప్రేమించడానికి ఎవరూలేరు.' ఇటువంటి ఆలోచనలు, ఇటువంటి భావాలు ఆమెని భయపెట్టేవి. పద్దెనిమిదోఏట జ్వరంవచ్చి చావుకు సిద్ధమైంది. స్వభావసిద్ధంగా మంచి ఆరోగ్యవంతమైన ఆమె శరీరతత్వం తీవ్రంగా దెబ్బతిన్నది. చాలాకాలానికిగాని ఆమె కోలుకోలేదు. రోగం

పూర్తిగా నయమైపోయిందిగాని ఆమె తండ్రిమాత్రం యథాప్రకారం ఆమె నరాల బలహీనతను అధిక్షేపిస్తుండేవాడు. ఒకొక్కప్పుడు ఎవరూ కోరని దేనో తాను కోరుతున్నట్టు, రహస్యాలో ఎవరూ కనని కలలు తాను కంటున్నట్టూ ఆమెకి అనిపించేది. తర్వాత కుదటపడి నిశ్చితంగా ఉదాసీనంగా రోజులకు రోజులు గడిపింది. తనను చూసుకుని తానే నవ్వుకుంది. కాని ఉన్నట్టుండి హఠాత్తుగా అణచుకోలేని బలీయమైన, అనిర్దిష్టమైన భావమేదో ఆమెలో సలసలాకాగి పొంగి పొరలాలని చూసింది. కాని పొంగు అణిగిపోయింది. అలిసిపోయిన రెక్కలు ఎగరకుండానే వాలిపోయాయి. కాని ఈ చిత్తవృత్తులు ఊరికేపోలేదు. తనలో రేగుతున్న తుపాను బయటికి పొక్కకుండాచేయాలని ఆమె ఎంత ప్రయత్నించినా కలతబారినఆత్మ పడిన ఆవేదనను ఆమె అతిశాంతమే పట్టిచ్చింది. ఈ వైచిత్ర్యం అర్థం చేసుకోలేక ఆమె తలిదండ్రులు తెల్లబోయారు.

మన కథ ప్రారంభమైన రోజున కిటికీదగ్గర ఎలీనా మామూలుకన్న ఎక్కువసేపు కూర్చుంది. ఇన్సారోవ్‌ను గురించీ అతనితో సంభాషణ గురించీ తలపోసింది. అతనంటే ఆమె కిష్టమే. అతని భావాలలో, ఆశయాలలో నిజాయితీగలదని విశ్వసించింది. ఆరోజు సాయంత్రం మాట్లాడినట్టు అతడెన్నడూ ఆమెతో మాట్లాడలేదు. అతని కళ్ళల్లో, చిరునవ్వుల్లో కనిపించిన బిడియం జ్ఞప్తికొచ్చిందిరాలించుకుంది. అతన్ని గురించి ఆలోచన సాగకపోయినా చిరునవ్వు నవ్వుకుని ఆలోచనా సముద్రంలో పడింది. తెరిచివున్న కిటికీగుండా తేరిపారజూచింది. కిందికొరిగినట్టున్న నల్లటిఆకాశం కేసి చాలాసేపు దృష్టి నిలిపింది. లేచి ముఖంమీదపడిన జుట్టు తల విదుల్చుతో సరిచేసుకుని ఎందుకో తెలీకుండా చేతులు ఆ ఆకసంవంక జాపింది. తర్వాత చేతులు దించి పక్కచెంత మోకరిల్లింది. తలగడామీద ముఖం ఆనించి వరదలా వచ్చిపడుతున్న భావపరంపరలకు లొంగిపోగూడదని ఎంత ప్రయత్నించినా ఆపుకోలేక కలవరంతో అసాధారణంగా ఏడ్వసాగింది. వేడివేడి కన్నీటిబొట్లు జలజలా రాలాయి.

# ౮

మర్నాడు పదకొండుగంటలు అయి అవడంతోనే బెర్సెనేవ్ తిరుగు బండీలో, మాస్కోకు బయలుదేరాడు. పోస్టాఫీసులో కొంచెం డబ్బు తీసుకోవాలసి ఉంది. కొన్ని పుస్తకాలు కొనాలసి ఉంది. ఇంతేగాక ఇన్సరోవ్‌ను కలుసుకోవాలనికూడా అనుకున్నాడు. షూబిన్‌తో మాట్లాడేటప్పుడు తనతో నివసించడానికి ఇన్సరోవ్‌ను ఆహ్వానించాలని బుద్ధి పుట్టింది. అతన్ని కలుసుకోవడం చాలాసేపటికి గాని పడలేదు. ఇన్సరోవ్ బస మార్చాడు. కొత్తయిల్లు కనుక్కోవడం కష్టమైపోయింది. అర్బాట్, పోవర్స్కాయాలమధ్య పీటర్స్‌బర్గు విధానంలో కట్టిన ఓ అసహ్యంగొల్పే పెంకుటింటివెనక దొడ్డిలో ఆ ఇల్లుఉంది. ఇన్సరోవ్ బస కనుక్కోటానికి దుమ్ముకొట్టుకున్న మేడ మెట్లు ఒకటి తర్వాత ఒకటి బెర్సెనేవ్ ఎక్కాడు, కాని ప్రయోజనం లేకపోయింది. నౌకర్లు చాకర్లు అనేకమందిని అడిగి చూచాడుగాని ఒక్కరూ ఇన్సరోవ్ బస పత్తా తెలపలేదు. పీటర్స్‌బర్గులో నౌకర్లు కొత్తవా:దృష్టినించి తప్పించుకుంటారు. మాస్కోలో ఈ అలవాటు మరీ మితిమీరిపోయింది. బెర్సెనేవ్‌కు ఒక్కరూ తగు సమాధానం చెప్పలేదు. బుజంమీద బూడిదరంగు దారప్పుకండీ, మాసినగడ్డం, బొద్దుమొహం దర్జీవాడొకడు ఎత్తుగా వున్న కిటికీగుండా జిజ్ఞాసాదృక్కులు బరిపాడు. పాచిపోగుమీది కెక్కిన ఓ నల్లమేక అతనికేసి తిరిగి అరిచి తిరిగి అంతకు ముందుకన్న త్వరితంగా నెమరవేయసాగింది. చిట్టచివరకి పాతకోటూ, ఎత్తు తక్కువ చెప్పులూ తొడుక్కున్న ఓ ముసలమ్మ దయతలచి ఇన్సరోవ్ బస చూపెట్టింది. బెర్సెనేవ్ వెళ్ళేసరికి ఇన్సరోవ్ ఇంట్లోనే ఉన్నాడు. ముఖా

వంతో జిజ్ఞాసాద్రృక్కులు బరపిన ఆ దర్జీయింట్లోనే ఇన్సరోవ్ గది అద్దెకు తీసుకున్నది. ఆగది పెద్దది. సామానేంలేదు. చిక్కని ఆకుపచ్చరంగు గోడలు, మూడు చదరపు కిటికీలు. ఓమూల సన్నపాటి పరుపు, ఇంకోమూల తోలుసోఫా గదిలోవున్నాయి. లోకప్పుకు వేలాడుతూ పెద్ద పంజరం ఒకటుంది. ఒకప్పుడు దాంట్లో ఓకోకిలవుండేది. బెర్సెనీవ్ గుమ్మంలో అడుగు పెట్టగానే ఇన్సరోవ్ ఎదురొచ్చి లోపలికి తీసుకువెళ్ళాడు. 'ఆ-నువ్వా' 'యేం పనిమీదవచ్చావ్!' అనిగాని చివరికి 'బాగున్నావా' అనైనా అడగలా. చెయ్యిపట్టుకుని ఒత్తి తీసుకువెళ్ళి ఆ ఒక్క కుర్చీలో కూర్చో బెట్టాడు.

'కూర్చో' అన్నాడు బల్లఅంచుమీద తానూ కూర్చుంటూ. నేల మీద కుప్పలుకుప్పలుగా పడివున్న కాగితాలు, పుస్తకాలు చూపిస్తూ "చూచావా! అంతా గజిబిజగావుంది. సరిగా సర్దుకోటానికి వ్యవధి చక్కలా."

ప్రతిముక్కా స్పష్టంగా, ఉత్సాహంతో ఉచ్చరిస్తూ ఏమాత్రంతప్పులు దొర్ల కుండా రష్యన్ భాష మాట్లాడాడు. ఇంపుగావున్నా అతని గుబ్బగొంతురష్యన్ గొంతుకాదు. ఇన్సరోవ్ విదేశీయుడు. ఒక్కరయా దేశస్థుడు. అతను విదేశీయు డని అతని ఆకారమే ఇంకా స్పష్టంగా తెలుపుతోంది. పాతికయేళ్ళుంటాయి. బక్కపల్చనగాని బలశాలి. నిక్కబొడుచుకునే నీలిజుట్టు, లోతైన ఎదురొమ్ము, బిగురుచేతులు, విస్పష్టమైన రూపరేఖలు. గద్దముక్కు, చిన్ని నుదురు, చిన్ని లోతుకళ్ళు, బొద్దుకనుబొమలు. పెదవులు పల్చనివి, గట్టివి, కొంచెం పెద్దవి. చిరునవ్వునవ్వుతూంటే అందమైన తెల్లటిదంతాలు క్షణికం పొడగట్టుతాయి. పాతదైనా శుభ్రమైన "జాకెట్టు" తొడుక్కుని మెడదాకా గుండీలు పెట్టుకున్నాడు.

"ఆ యిల్లు ఖాళీచేసి వచ్చేశావేం?"

"యీ యింటికి అద్దె తక్కువ. యూనివర్సిటీకి దగ్గరగాకూడావుంది"

"కాని శెలవురోజులుగా... పైగా వేసంగిలో పట్నంలో వుండా లనుకోవడమేమిటి? ...బస మార్చదలచుకుంటే ఓ కుటీరం తీసుకుంటే బాగుండేదిగా..."

ఇన్సరోవ్ జవాబు చెప్పలేదు. పైపు బెర్సెనీవ్‌కి అందిస్తూ, 'క్షమించు. సిగార్లు, చుట్టలు నా దగ్గరలేవు' అన్నాడు. బెర్సెనీవ్ పైపు వెలిగించాడు.

"ఇక నేను-కంట్సోవోకి దగ్గరసా ఓ కుటీరం అద్దెకు తీసుకున్నా. అద్దె తక్కువ. మాంచి వసతిగా వుంది. మేడమీద ఓ గది నా కనవసరం. ఖాళీగానే వుంది." ఈసారికూడా ఇన్సరోవ్ జవాబు చెప్పలేదు. బెర్సెనీవ్ పైపు తాగుతూ "నేననుకున్నా-" అని తిరిగీ మొదలుపెట్టాడు గుప్పుగుప్పున పొగ ఊస్తూ. "యెవరన్నా - నీబోటివాళ్ళు ఆ కుటీరంలో నాతోకలిసి ఆ ఖాళీగదిలో వుండగోరేవారుంటే యెంత బాగుండును! యేమంటావ్, డిమిట్రి నికనరోవిచ్" ఇన్సరోవ్ పైకి ఓ మాటుచూసి, "అంటే నీతోకలిసి నేనుండాలని గదూ నీ ఉద్దేశం."

"ఔను. పైన మేడమీద గది ఖాళీగా వుంది."

"కృతజ్ఞుణ్ణి ఆంద్రీపెట్రోవిచ్! కాని నాకంత వరుమానం లేదు."

"అంత అంటే?"

"గ్రామసీమలో కూడా వుండేటంత వరుమానంలేదు. రెండిళ్లూ అట్టే పెట్టుకోలేను."

"కాని నేను..." బెర్సెనీవ్ ఆరంభించబోయి ఆగాడు. మళ్ళీ అందుకుని "ఖర్చు మరేం ఎక్కువ కాదులే. యీగదికూడా అట్టేపెట్టుకున్నా పర్వాలేదు. అక్కడ ప్రతిదీ కారుచౌక. మనిద్దరం కలిసి భోజనం విషయం యేర్పాటుచేసుకోవచ్చు."

ఇన్సరోవ్ మాట్లాడలేదు. బెర్సెనీవ్‌కి ఏమీ పాలుబోలా. "పోనీ, యెప్పుడైనావచ్చి చూచిపోతూవుండు" అన్నాడు కొంచెంసేపు ఆగి. "నేనున్న యింటికి నాలుగడుగుల్లో ఓ కుటుంబంవుంది. వాళ్ళతో నువు పరిచయం చేసుకోవాలని నా అభిలాష. అక్కడ అద్భుతమైన బాలిక వుంది. ఇన్సరోవ్! ఆమెతో నీకు పరిచయమైతేనా! మంచి ప్రజ్ఞావంతుడు నా ప్రాణస్నేహితుడొకతను కూడా అక్కడ వుంటున్నాడు. అతన్తో నువు సర్దుకుపోగలవనే నా విశ్వాసం. (రష్యన్లు ఇతర్లతో కాకపోయినా తమ స్నేహితులతో హాయిగా వుంటారు.) నువు తప్పకుండా రావాలి. వచ్చి అక్కడ వుండిపోతే యింకా మంచిది. అవును. తప్పకుండా రా.

మనిద్దరం కలిసి చదువుకోవచ్చు. పనిపాటలు చేసుకోవచ్చు. నేను చరిత్ర వేదాంతం చదువుతున్నా. నీకు తెలుసుగా! నా దగ్గిర బోలెడన్ని పుస్తకాలున్నాయి."

ఇన్సరోవ్ లేచి గదిలో పచార్లు చేయసాగాడు.

"మరేం అనుకోకు. అద్దె యెంతిస్తున్నావ్?" అని అడిగాడు చిట్టచివరికి.

"నూరు రూబుళ్ళు."*

"గదు లెన్నున్నాయి?"

"అయిదు."

"ఆ లెక్క ప్రకారం ఓ గదికి అద్దె ఇరవై రూబుళ్ళన్నమాట."

"ఆ లెక్క ప్రకారం! నిజానికి నాకా గది అనవసరం. ఖాళీగానే వుంది కూడా."

"బహుశా- విను.' అన్నాడు ఇన్సరోవ్ ఓ నిర్ణయానికివచ్చి నిర్మొహమాటంగా, స్వాభావికంగా తలాడిస్తూ, 'అద్దెలో నా వంతుకు న్యాయమైన భాగం నువు పుచ్చుకుంటే నీ ఆహ్వానం అంగీకరిస్తా. నువ్వన్నట్లు తక్కిన వాటి ఖర్చు తగ్గుతుంది కాబట్టి ఇరవైరూబుళ్ళు తేలిగ్గా యిచ్చుకోగల."

"సరే. అలానే కానీ. కాని నా అంతరాత్మ మట్టుకు బాధపడుతుంది. సరే అలానే కానీ."

"అంతకంటె వేరే మార్గంలేదు, ఆంద్రేపెట్రోవిచ్!"

"సరే - నీ యిష్టమొచ్చినట్టే కానీ. అబ్బ! ఎంత పట్టుదల!" ఈ తడవా ఇన్సరోవ్ ఏమీ అనలేదు.

ఇన్సరోవ్ ఏనాడు తరలివస్తే బాగుంటుందో నిర్ణయించుకున్నారు. ఇంటి యజమానిని పిలిచారు. కాని అతను రాకుండా కూతుర్ని పంపాడు. ఆ అమ్మాయికి ఏడేళ్ళుంటాయి. తలమీద గళ్ళగళ్ళ రుమాలు కప్పుకుంది. ఇన్సరోవ్ చెప్పిందంతా అతిశయంతో అతి శ్రద్ధతో విని మాట్లాడకుండా వెళ్ళిపోయింది. తర్వాత నిండుగర్భిణితోఉన్న ఆ అమ్మాయి తల్లి వచ్చింది. తలమీద ఈమెకూడా చిన్న రుమాలు కప్పుకుంది. కంట్సోవాకు దగ్గిరగా

* రష్యన్ నాణెము. సుమారు మన రూపయన్నరకు సమానం.

ఉన్న ఓ కుటీరంలోకి బస మారుస్తున్నాననీ, అయినా ఆ గది అట్టే ఉంచుకుని సామానంతా ఆమె కప్పగిస్తాననీ ఇన్సరోవ్ తెలియజేశాడు. ఆమెకూడా కూతురులాగానే బయటికి వెళ్ళిపోయింది. చివరికి ఇంటియజమాని స్వయంగా వచ్చాడు. మొదట ఇన్సరోవ్ చెప్పిందంతా అర్థంచేసుకున్నట్లు కనిపించి ఆలోచనపూర్వకంగా అన్నాడు:

"కంట్సోవో దగ్గిరిగానా" తర్వాత హఠాత్తుగా తలుపు తెరిచి 'అయితే ఈ గది అట్టే పెట్టుకుంటావా?' అని బిగ్గరగా అరిచాడు. ఇన్సరోవ్ అతన్ని శాంతపర్చాడు. 'తెలుసుకోటం ఎంతో అవసరం' అని ఇంటి యజమాని చక్కాబోయాడు.

తన యత్నం విజయవంతమైనందుకు సంతృప్తిపడుతూ బెర్సెనెవ్ ఇంటికి బయలుదేరాడు. రష్యాలో అరుదుగా కన్పించే స్నేహపూర్వక మర్యాదతో ద్వారందాకా ఇన్సరోవ్ అతన్ని అనుసరించాడు. బెర్సెనెవ్ వెళ్ళిపోయాక చొక్కా విప్పి ఏవో కాగితాలు చదువుకో నారంభించాడు.



# ౮

అదేరోజు సాయంత్రం అన్నా వాసిలెవ్నా కచేరీ సావిడిలో కూర్చుని ఉంది. గుడ్లలో కన్నీళ్లు గిర్రున తిరుగుతున్నాయి. ఆ గదిలో ఆమె భర్త, అతని దూరపు దాయాది యువార్ ఇవనోవిచ్ స్టహోవ్ కూడా ఉన్నారు. యువార్ అశ్వదళసేనానిగా పనిచేసి పించను పుచ్చుకున్నాడు. అరవై యేళ్ళుంటాయి. స్థూలకాయుడు. ఓ పట్టాన కదిలేకాయం కాదు. పచ్చటి నిద్రమత్తు కళ్ళు. బుంగమొహం. పాలిపోయిన పెదిమలు. పించను పుచ్చుకున్నప్పటినించీ భార్య ఇచ్చిపోయిన ఆస్తిమీద జీవిస్తూ మాస్కోలోనే ఉంటున్నాడు. పనీపాటా ఏమీ చేసేవాడుగాదు. ఆలోచించటం కూడా మానేశాడు. కర్మాంతాలకి ఎప్పుడైనా ఆలోచించినా ఆ ఆలోచనల్ని తనలోనే దాచుకునేవాడు. జీవితంలోకల్లా ఒక్కమాటు ఉద్వేగం పొందాడు. అప్పుడే అతనిలో చలనం కన్పించింది. లండన్‌లో జరుగుతున్న అంతర్జాతీయ ప్రదర్శనోత్సవంలో 'విమాన విధ్వంసక శతఘ్ని' ప్రదర్శింపబడిందని పత్రికల్లో చదివినప్పుడు ఈ ఉద్వేగం, చలనం కన్పించాయి. ఆ శతఘ్ని ఒకటి కొందామనుకున్నాడు. డబ్బు ఎవరికి పంపాలో, ఏ ఏజెన్సీ ద్వారా పంపాలో విచారించాడు. యువార్ ఇవనోవిచ్ పుగాకురంగు బిగుతు షేర్వాణీ తొడిగాడు. తెల్లటి మఫ్లరు మెడకు చుట్టాడు. రోజుకు అనేకసార్లు తినడం అతనికి అలవాటు. ఎప్పుడైనా అభిప్రాయం వెల్లడించవలసి వచ్చినప్పుడు తత్తరపడుతూ, బొటనవేలిదగ్గరనించి చిటికెనవేలిదాకా, తిరిగీ చిటికెనవేలిదగ్గరనించి బొటనవేలిదాకా వేళ్ళు టకటకా ఆడించి ఎంతో యత్నంమీద "అవును... నే చెప్పేదేమంటే... ఒకవిధంగా" అనేవాడు.

యువార్ ఇవనోవిచ్ అతికష్టంమీద నిశ్వసిస్తూ కిటికీదగ్గిర పడక కుర్చీలో కూర్చున్నాడు. నికొలాయ్ జేబుల్లో చేతులు పెట్టుకుని పచార్లు కొడుతున్నాడు. అతని ముఖంలో అసంతృప్తి గోచరిస్తోంది.

తుదకు ఆగి తలూచాడు. "అవును మా రోజుల్లో ఆ పెంపకమే వేరు. పిల్లలు పెద్దవాళ్లను ఎదిరించేవాళ్ళు కాదు. కాని ఈ రోజుల్లో – సరే, గుడ్లప్పగించి చూస్తూ ఆశ్చర్యపోతున్నా. నా పద్ధతి తప్పు, వాళ్ళదే సరైంది కావచ్చు. అయినప్పటికీ, నా దృక్పథంతోనే విషయపరిశీలన చేస్తా. నేనేం తెలివితక్కువ మొద్దనిగాను. నీ అభిప్రాయ మేమిటి యువార్!" యువార్ ఇవనోవిచ్ అతనికేసి ఊరికే చూసి వేళ్ళు ఆడించాడు. 'ఎలీనా సంగతి చూడు' అని తిరిగి ఆరంభించాడు నికొలాయ్. "నాకేం అర్థం కావడంలా. దాని అంతస్తుకు నేను చేరుకోలేకపోతున్నా. దాని హృదయం మహా విశాలమైంది. వేసవ కప్పలదగ్గిర్నించి, బొద్దింకలదగ్గిర్నించి ప్రకృతి అంతకూ ఆ హృదయంలో స్థానంవుంది కాని కన్నతండ్రికి రవ్వంతైనా స్థానం లేదు. సరే – అదంతా నాకు తెలుసు. అందుకే దానికర్మకి దాన్ని వదిలేసా. దానిది అతిసున్నితహృదయం. సాహితీపరాగాలు! గాలిమేడల్లో నివాసం! ఇదంతా మన ధోరణికాదు. కాని ఈ షూబిన్ – సరే, గొప్ప అద్భుతమైన శిల్పి అనుకుందాం–అయితేమట్టుకు పెద్దవాణ్ణి – కాటికి కాళ్ళుచాచుకున్నవాణ్ణి – తనకెంతో ఉపకారంచేసినవాణ్ణి – నన్ను అగౌరవపరుస్తాడూ! ఊహుం–నేభరించలేను. నేనేం పెద్దగా కోరటంలేదు. అసలది నా స్వభావమే కాదు. అయినా దేనికైనా హద్దూపద్దూ అంటూ వుండాలి."

మహా ఆందోళనతో అన్నావాసిలెవ్నా గంటకొట్టింది. ఒక నౌకరు కుర్రాడు ప్రవేశించాడు. 'పావెల్ రాలేదేం? నే పిలుస్తుంటే రాకపోవడ మేమిటి?' అని అడిగింది.

నికొలాయ్ భుజాలు ఎగరవేశాడు. "అసలు, అతన్నెందుకూ పిలిపించడం? యేమాత్రం అవసరంలేదు. నిజంగా అతన్ని పిలిపించాలని నాకేం లేదు."

"యెందుకనేం, నికొలాయ్ ఆర్టియోమెవిచ్! నిన్ను వేధించుకు తిన్నాడు. నీ ఆరోగ్యం తలకిందులైపోయిందేమో! సంగతేమిటో తేల్చేసుకుంటా. నీకింతబాధ కల్గడాని కేం చేశాడో తెలుసుకోవాలి."

"మళ్ళీ చెబుతున్నా. అతన్ని పిలిపించడం అనవసరం. యీ విధంగా గృహకల్లోలాలు రేపడం యెందుకు?"

అన్నా వాసిలెవ్నా ముఖం ఎర్రబారింది.

"అలా అనకు, నికొలాయ్ ఆర్టియోమెవిచ్! నే నెప్పుడూ గృహకల్లోలాలు రేపేదాన్ని కాను. వెళ్ళు, ఫెదూష్కా! వెళ్ళి తక్షణం పావెల్‌ని వెంటబెట్టుకు రా."

కుర్రాడు వెళ్ళిపోయాడు.

"యేం అవసరంలేదు." అని నికొలాయ్ గొణుక్కుని తిరిగీ పచార్లు మొదలెట్టాడు. 'అతన్ని పిలిపించాలని నే నుద్దేశపడలేదు' అన్నాడు.

"కాని పావెల్ నీకు తప్పకుండా క్షమాపణ చెప్పుకోవాల్సి వుంటుంది."

"అయితే వాడి క్షమాపణవల్ల నాకేం ప్రయోజనం? అదీగాక, క్షమాపణేమిటి? మాటలపోగు కాకపోతే."

"యేం ప్రయోజనమా? వాడికి బుద్ధిచెప్పాలి?"

"ఆ చెప్పేదేమిటో నువ్వే చెప్పు. నీమాట వెంటనే వింటాడు. నాకు వాడిమీదేం కోపంలేదు."

"అలాకాదు, నికొలాయ్ ఆర్టియోమెవిచ్? నువ్వు వచ్చిన దగ్గరనించీ చిరచిరలాడుతున్నావు. నువు బరువు తగ్గిపోయినట్టు స్పష్టంగా కనిపిస్తోంది. నీకా మందులేం సుగుణం యివ్వడం లేదనుకుంటా."

"మందులు అత్యవసరం. నా లివరు పనిచెయ్యడంలా"

సర్గ్గా ఆ సమయానికి షూబిన్ వచ్చాడు. అతని పెదవులమీద వికటహాసం సూక్ష్మంగా నెలకొని వుంది.

"నా కోసరం కబురంపారా, అన్నా వాసిలెవ్నా" అని అడిగాడు.

"అవును. నిజం. నీకోసం కబురంపా. నిజంగానే, పావెల్! యిది మహాఘోరం! నీ నడక నాకు సుతరాం నచ్చలా. నికొలాయ్ ఆర్టియోమెవిచ్‌ని యెలా అగౌరవపర్చ గల్గావ్."

"నికొలాయ్ ఆర్టియోమెవిచ్ నామీద నేరం మోపాడా?" అని అడిగాడు, నికొలాయ్‌కేసి చూస్తూ. ఇంకా వికటహాసం అతని పెదవులమీద నెలకొనేవుంది. నికొలాయ్ తలతిప్పి కిందికి చూడ నారంభించాడు.

"అవును. నేరం మోపాను. ఆయనికి బాధ కల్గించే పనేం జేశావో! నువు తక్షణం క్షమాపణ కోరుకో. యెందుకంటే ప్రస్తుతం ఆయనకి వంట్లో యేం బాగుండలా. అదికాకపోయినా సహాయం చేసినవారిని గౌరవించడం విధాయకం కాదూ."

"ఓ - బలే సబబు" అనుకుని నికొలాయ్ కేసి తిరిగి 'క్షమార్పణ కోరడానికి సంసిద్ధుణ్ణి, నికొలాయ్ ఆర్టియోమెవిచ్! అసలు మిమ్మల్ని అవమాన పర్చాలంటే" అన్నాడు ఖూలిన్ వంగి వినయవిధేయతలతో నమస్కరిస్తూ.

"వుండే - అంతేగదూ" అని ఎత్తిపొడిచాడు నికొలాయ్ ఖూలిన్ దృష్టినించి తప్పించుకుంటూ. "యేమైనప్పటికీ నిన్ను సంతోషంతో క్షమిస్తాను. నీకు తెలుసుగా - నేను సర్దుకుపోయేవాణ్ణని."

"అవును. నిజం. మీరు సర్దుకుపోయేవారనడంలో యేమాత్రం అనుమానంలేదు. కాని క్షమించండి, తెలీక అడుగుతున్నా. నేనేం తప్పుచేశానో అన్నా వాసిలెవ్నాకు తెలుసా."

"ఊహుం-నాకేం తెలీదు." అన్నది అన్నా - ఇక ముందేం చెబుతాడో వినటానికి ముందుకు వంగుతూ.

"ఆ, భగవంతుడా!" అని గబగబా మాట్లాడసాగాడు నికొలాయ్. 'యెన్నిమార్లు బతిమిలాడుకున్నా,యెన్నిమాట్లు వేడుకున్నా...యీ సంరంభం, యీ వ్యాఖ్యానాలు విసుగెత్తిస్తున్నా యని యెన్నిసార్లు చెప్పాగాను. యేహోహాయిగా కాలక్షేపం చేద్దామని యే నెలకో ఒకమాటు కొంపకువస్తే గొడవలు, యేడ్పులు, పెడబొబ్బలు. వొక్క నిమిషంకూడా ప్రశాంతంగా కూర్చోనివ్వరుగదా? యే క్లబ్బుకో పోతేనే నయం. నేనూ అందరిలాంటి మనిషినే. నాకూ శరీరం వుంది. కోరికలున్నాయ్. కాని ఇక్కడ..."

మాట పూర్తిచేయకుండానే బయటికి వెళ్ళి దభీమని తలుపువేసేశాడు. అన్నావాసిలెవ్నా అతను వెడుతూంటే పరకాయించి చూసింది.

"క్లబ్బుకేం" అని మహ గొణుక్కుంది. "పిచ్చిపుల్లాయా, క్లబ్బుకేం వెళ్లడంలేదు. నా గుర్రాల్ని, నేనెంతో అభిమానించే బూడిదరంగు గుర్రాల్ని స్నానం చేయ్యడానికి క్లబ్బులో యెవరూలేరు.' గొంతెత్తి 'నువు క్లబ్బుకేం వెళ్ళడంలేదు.' లేచి "పావెల్! నీకు సిద్ధమయ్యాడంలేదూ? నువ్వేం

చంటిపిల్లాడివా? ఇక... నా తల నొచ్చుతోంది. జోయా ఎక్కడుందో నీ కేమైనా తెలుసా?"

"మేడమీద పనిగదిలో వుందనుకుంటా. ఆ జిత్తులమారి నక్క యిలాంటి దుమారం లేచే సమయంలో కన్నంలో దాక్కుంటుంది."

"సరే-సరే-" అని అన్నావాసిలెవ్నా దేనికోసమో నాలుగుమూలలా చూసి 'నగిషీ చెక్కిన నా గ్లాసు చూశావా, సరే - ఇకముందు నన్ను విసిగించబోకు పావెల్! అన్నది.

"నిను విసిగిస్తానా, పిన్నీ! నీ చెయ్యి ముద్దెట్టుకోనియ్. నీ గ్లాసు చదువుల గదిలో బల్లమీద చూశా."

"తాన్యా, యెప్పుడూ యెక్కడో పెట్టి మర్చిపోతూనే వుంటుంది." అని అన్నావాసిలెవ్నా పట్టువస్త్రాలు గరగరలాడించుకుంటూ వెళ్ళిపోయింది.

ష్చూబిన్ ఆమెని అనుసరించి వెళ్లదలచినంతలో యువార్ ఇవనోవిచ్ మందస్వరం విన్పించి ఆగిపోయాడు.

"అరే బుల్లోడా! నీ కతను కాస్త రుచి చూపించాల్సింది" అన్నాడు ఆగి ఆగి సంచను పుచ్చుకున్న ఆ అపూర్వదళ సేనాని.

"కొంచెమేం? మహానుభావా?"

"కొంచెమా? నువ్వింకా కుర్రాడివి. గౌరవించాలి."

"ఎవర్ని?"

"ఎవర్నా? నీకు తెలీదేం? ఇకిలించావులే?"

ష్చూబిన్ ఎదర్రొమ్ముమీద చేతులు కట్టుకుని.

"హా! నాటక సూత్రధారీ! ఓ యమధర్మరాజా! ఓ సాంఘిక సౌధభాగాల స్తంభమా!"

యువార్ ఇవనోవిచ్ వేళ్ళు ఆడించి,

"ఇక చాల్లే, కట్టెయ్యవోయ్, అడ్డదిడ్డ ప్రశ్నలు వేయక!"

"అయితే ఇక విను" అని ప్రారంభించాడు ష్చూబిన్.

"నువ్వేం కుర్రాడివి కావటమూ? అయినా నీ హృదయంలో యెంత అమాయకత్వం, విశ్వాసం, దాక్కుంది! గౌరవించాలి? తాతయ్యా! నామీద నిన్నెందుకు అంత కోపం వచ్చిందో తెలుసా? ఆయన ప్రియురాలు లేదూ, జర్మన్ యువతి - వాళ్ళింట్లో యివాళ హృదయమంతా

నేనూ నికోలాయ్ గడిపాం. మేం ముగ్గురం కలిసి 'నను విడనాడకుమా' అనే పాట పాడుతున్నాం. నువు వినలేవుగాని వింటే పరవశుడవై పోయే వాడివి. అలా పాడాం, పాడాం. పాడీ పాడీ నాకు విసుగెత్తింది. ప్రపంచ మంతా రసమయమైపోయింది. ఆహారాంతరంగా రొయ్యలో మాంసఖండం ఏమోనని వాళ్ళని వేసంచుకు తింటం మొదలెట్టా. నా ఎత్తు బాగా పారింది. మొదట ఆమెకి నామీద కోపం వచ్చింది. తర్వాత నికోలాయ్‌మీద కోపం వచ్చింది. అతనికి ఆమెమీద కోపంవచ్చి యింటి దగ్గరే తనకి సుఖంగా వుంటుందనీ, అదే తనకి స్వర్గమనీ అన్నాడు. దానిమీద ఆమె అతన్ని నీతినియమాలులేని వాడని తిట్టింది. నేను *'ఆవ' అన్నా జర్మన్ భాషలో. ఆయన లేచి చక్కా పోయాడు. నేను వుండిపోయా. సరే. యిక్కడికి- తన స్వర్గలోకానికి - వచ్చాడు. కాని యీ స్వర్గలోకం అతనికి విసుగెత్తించింది. యింకేం, గొణుగుడు మొదలెట్టాడు. యిక చెప్పండి. తప్పెవరిదో?

"తప్పు నీది."

ఖూబిన్ అతనికేసి తేరిపారజూచి 'వీరమ్మన్యా' అని ప్రారంభించాడు, కపటవినయంతో.

"తమ ఆలోచనాశక్తి నంతటినీ వినియోగించే యీ నిగూఢపదాలు ఉచ్చరించారా లేకపోతే వాయుసంచలనంవల్ల కలుగుతుందంటారా - ధ్వని, ఆధ్వనిపుట్టించాలనే కుతుకకోరిక ప్రోత్సహించగా యీపలుకులు పలికారా?

"చాల్లే - అడ్డదిడ్డ ప్రశ్నలు వేయక" అని మూల్గాడు యువార్.

ఖూబిన్ పొట్టచెక్కలయ్యేట్టు నవ్వి వెళ్ళిపోయాడు. పావుగంట అయినాక 'యేయ్. వో గ్లాసెడు వోడ్కా, తే' అన్నాడు యువార్.

ఒక పిల్లవాడు ట్రేలో వోడ్కా, పలహారం తెచ్చాడు. యువార్ మెల్లిగా వోడ్కాతో నిండిన గ్లాసుతీసుకుని చేతిలో యేముందో స్పష్టంగా తెలియనట్టు చాలాసేపు దానికేసే పరికాయించి చూశాడు. తర్వాత పిల్ల వానికేసితిరిగి 'నీ పేరు వాస్కా!' అని అడిగి అతికష్టంమీద వోడ్కా తాగి కొద్దిగా పలహారంచేసి జేబురుమాలుకోసం జేబులో చెయ్యి పెట్టాడు...పిల్ల వాడు ట్రే తీసేసి మిగిలినపలహారంతిని పడుకుని నిద్రపోయిన తర్వాతకూడా చాలాసేపటిదాకా యువార్ వేళ్ళ మీద జేబురుమాలు పెట్టుకుని కిటికీకేసీ, నేలకేసీ,గోడలకేసి పూర్వంలాగానే అతిశ్రమతో పరికాయించిచూస్తున్నాడు.

* నీకు ఆరోగ్యం కల్గుగాక !

# ౯

షూబిన్ తన గదికి తిరిగి వెళ్ళి పుస్తకం తెరవబోతుండగా నికోలాయ్ నౌకరు మెల్లిగా వచ్చి ముక్కోణాకారంగా మడిచి సీలువేసిన చీటీ ఒకటి అతని కందించాడు. ఆ చీటీలో — "నేటి ఉదయం మనం చర్చించిన ప్రామిసరీ నోటు విషయం ఒక్కమాటైనా నువ్వు పైకి పొక్కనీయవనే ఆశిస్తున్నా. నా నియమాలూ, ఆ విషయంలో నా స్థానం, నోటు తాలూకు సొమ్ము తదితర పరిస్థితులూ నీకు తెలుసు. ఇంతేగాకుండా మనం కప్పిపుచ్చాల్సిన కుటుంబ రహస్యాలుంటాయి. కుటుంబ ఐక్యత చెడగొట్టేవాడివి కావని నమ్ముతున్నా. ఈ చీటీ తిరిగి పంపించు—యన్. యస్." అని ఉంది.

ఆ చీటీకింద పెన్సిలుతో "సంతోషించాను. నేనింకా పక్కవాళ్ళ జేబులు కొట్టేయటానికి దిగలా" అని రాసి చీటీ నౌకరుకు తిరిగి ఇచ్చివేసి షూబిన్ మళ్ళీ పుస్తకం తీసుకున్నాడు కాని పుస్తకం చేతుల్లోంచి జారిపోయింది. ఎర్రబారుతున్న ఆకాశంకేసీ, తోటలో పక్కపక్కన చెట్లకు దూరంగా ఉన్న రెండు లావుపాటి దేవదారు చెట్లకేసీ చూశాడు. 'పగలు యీ దేవదారు చెట్లు నీలివర్ణంగా వుంటాయి. కాని సాయంకాలమయ్యేటప్పటికి యెంత ఆకుపచ్చగా తయారవుతాయో' అనుకుని ఎలీనా కనిపిస్తుందనే ఆశతో తోటలోకి వెళ్ళాడు. అతనికి ఆశాభంగం కాలేదు. తోవలో అతని ముందు పొదల మధ్య ఆమె దుస్తులు ప్రత్యక్షమయ్యాయి. వెనకాతే వెళ్ళి ముఖాముఖీ నిలబడి "నాకేసి చూడకు. నేను చూడదగినవాణ్ణి కాను" అన్నాడు. ఆమె అతనికేసి చురచురా చూసి చటుక్కున నవ్వి తోటలోకి వెళ్ళిపోయింది. షూబిన్ ఆమె వెంటబడ్డాడు.

"నాకేసి చూడవద్దన్నాను. కాని నీతో మాట్లాడుతున్నా. పరస్పర విరుద్ధవిషయాలు అయినప్పటికీ పోనీలే, యిదేం మొదటిసారా? నిన్న తెలివితక్కువగా ప్రవర్తించినందుకు నిన్ను క్షమాపణ వేడుకోవాలని యిప్పుడే జ్ఞాపకంవచ్చింది. నామీద కోపంలేదుగదూ, ఎలీనా!"

ఆమె ఆగింది. మొదట్లో జవాబియ్యలేదు. జవాబియ్యకపోవడం కోపంవల్లకాదు. ఆమె ధ్యాస ఎక్కడో, ఎక్కడో ఉంది.

షూబిన్ పెదవి కొరుక్కున్నాడు.

"యెంతటి పరధ్యాస! యెంతటి వుదాసీనత!" అని గొణుక్కుని గొంతెత్తి అన్నాడు: "ఎలీనా! నా స్నేహితుడికథ వొకటి చెబుతావిను. అతనికి యింకో స్నేహితుడుండేవాడు. తాగుడు అలవాటుకాకపూర్వం చాలా మర్యాదగా ప్రవర్తిస్తుండేవాడు. వో రోజు వుదయం నా స్నేహితుడాతన్ని తాగుండగా వీధిలో కలుసుకున్నాడు. అప్పటికే స్నేహం వదిలిపోయింది. తాగిన అతన్నిచూసి బుద్ధిపూర్వకంగానే వైతొలగిపోయాడు. కాని తాగుబోతు అతనిదగ్గరకెళ్ళి 'నన్ను పల్కరించకపోతే అంతబాధపడేవాణ్ణికాను. యెందుకు వైతొలగిపోవడం? దుఃఖం నన్నిలా తయారుచేసిందేమో, ఆలోచించావా? శుభంఅన్నాడు" అని వూరుకున్నాడు షూబిన్.

"అంతేనా?" అని అడిగింది ఎలీనా.

"అంతే"

"నాకేం అర్థం కావడంలా. నువు చెప్పదలచిందేదిటి? యిప్పుడే కదా అంటివి నాకేసి చూడవద్దని..."

"అవును వైతొలగిపోవడం యెంత తప్పోతెలుసా యిప్పుడే కదూ చెప్పాను."

"కాని నేను..." ఎలీనా అనబోయింది.

"వైతొలగి పోలేదూ?"

ఎలీనా కొద్దిగా వైవర్ణ్యం పొంది చెయ్యిచాచింది. షూబిన ఆచేతిని ప్రేమతో నొక్కాడు.

"నిమిడేమో కోపంతో వుండగా నను పట్టుకున్నట్టుంది నీ వైఖరి. నీ అనుమానానికి ఆధారంలేదు. మొగం తప్పించాలని నేనేం ఆలోచించ డంలా."

"సరే – సరే. వొప్పుకున్నా. యీ నిమిషంలో నీ బుర్రలో వెయ్యి ఆలోచనలున్నాయి. కాని వొక్కటీ నాతో చెప్పవు. నే చెప్పింది నిజం కాదూ ?"

"కావచ్చు."

"యెందుకనేం"

"నా ఆలోచనలు నాకే స్పష్టం గావడంలేదు."

"యితర్లకి వాటిని చెప్పవల్సిన సమయం సర్గాయిదే. అసలుచిక్కేమిటో చెప్పనా. నేనంటే నీకు సదభిప్రాయం లేదు."

"నాకా ?"

"అవును. నీకే. నేను శిల్పిని కాబట్టి నాదంతా నటన అనుకుంటు న్నావు. నేనేమీ చెయ్యలేని చచ్చునని – బహుశా ఈ విషయంలో నీ అభి ప్రాయం సరైందే కావచ్చు – నా చిత్తవృత్తి గాఢమైందీ శుద్ధమైందీ కాదనీ, నా మేధుప్పసితం కపటమనీ, నేను అతిగా వాగుతాననీ, నా వాగు డంతా ద్వేషంతో కూడిందనీ నీ భావనకాదూ ? నేను శిల్పినవడమే దీనికి కారణమంటావు కదూ ? మేము వట్టి దౌర్భాగ్య దామోదరులమనేగా నీ వుద్దేశం. నేను నిజంగా పశ్చాత్తాపపడుతున్నానంటే నువ్వు నమ్మవు."

"అలాకాదు, పావెల్. నువ్వు పశ్చాత్తాపపడుతున్నావని నమ్ముతా. నీ కన్నీరు కపటంకాదనీ నమ్ముతా. కాని నీ పశ్చాత్తాపం, నీ కన్నీరూ నీకు వినోదంగా వుంటాయనుకుంటా."

ఘూబిన ఉలిక్కిపడి "సరే – డాక్టర్లు అంటూంటారే 'ఇది నయమయే కేసు కాదు' అని. యిదీ అలానే వుంది. సరే-యిక చేసేదేముంది తలవంచి లొంగిపోతా. ఆరి దేవుడా ! నా పక్కన యిటువంటి మనిషి వుండగా నా విషయమై యింత చింతపట్టం యేమిటి ? ఆ మనిషి హృదయంలోకి చొచ్చుకుపోలేక పోవడం, ఆమె ఎందుకు విచారంగా వుందో, యెందుకు సంతోషంగా వుందో, ఆమెలో యెలాంటి తుఫాను చెలరేగుతోందో,

యెక్కడికి పోతోందో తెలుసుకోలేకపోవడం...” కొంచెంసేపు మౌనం వహించి “యెప్పుడైనా, యే పరిస్థితుల్లోనైనా శిల్పిని ప్రేమించగల్గుతావా? ఎలీనా!” అని ప్రశ్నించాడు.

ఎలీనా అతని కళ్లలోకి సూటిగా చూసి “ప్రేమించలేను, పావెల్, ప్రేమించలేను” అంది.

“సరే–తేలిపోయింది” అన్నాడు షూబిన్ విచారగ్రస్త హాసంతో. “యికమీదట నీ షికారుకు అడ్డురావడం నాకు తగనిపని. ప్రొఫెసరు బహుశా అడిగేవాడు “యే ఆధారంమీద ‘ప్రేమించలేను’అనే జవాబిచ్చావు” అని. కాని నేను ప్రొఫెసర్ని కాను. నీ వుద్దేశం నేను పసిపిల్లాణ్ణని. కాని జ్ఞాపకముంచుకో, యెవరూ పసిపిల్లల నించి వైదొలగిపోరు. శెలవు. శుభం.”

ఎలీనా అతన్ని ఆపబోయింది. కాని ఒక్క క్షణం ఆలోచించి తానూ ‘శెలవు’ అంది.

షూబిన్ ఇంటి ఆవరణదాటి వెళ్ళిపోయాడు. కొద్దిదూరం వెళ్లగానే బెర్సనీవ్ కలిశాడు. బెర్సనీవ్ తలవంచుకుని హాటు వెనక్కి తోసుకుని త్వరత్వరగా నడిచి వెడుతున్నాడు.

“ఆంద్రీ పెట్రోవిచ్” అని కేకేశాడు షూబిన్.

బెర్సనీవ్ ఆగిపోయాడు.

“వెళ్ళు, వెళ్ళు” అని ప్రారంభించాడు షూబిన్. ‘నేను నిన్నూరికే పిల్చానిగాని, ఆగమన్లేదు. తోటలోకి అడుగుపెట్టు. ఎలీనా నీకోసం నిరీక్షిస్తోందనుకుంటా...యేమైనాయెవరికోసమోవొకరికోసంనిరీక్షిస్తోంది.యీమాటల్లోని అంతరార్థం తెలిసిందా? నిరీక్షిస్తోంది! ... యింకో ఆశ్చర్యకరమైన సంగతి విన్నావా? రెండు సంవత్సరాలనించీ వొకే ఇంట్లో యిద్దరం వుంటున్నాం. నేనామెను ప్రేమిస్తున్నా కూడా. అయితే నేం యీ నిమిషం లోనే – నాకామేం అర్థం కాలా – ఆమెని ‘చూచాను.’ చూసి చకితుణ్ణయాను. అలా వేళాకోళంగా యికిలిస్తూ నాకేసి చూడకు. నీ గంభీర రూప రేఖల కదేం తగిందికాదు. అవునవును. అనుష్కా సంగతి జ్ఞాపకంచేయాలని చూస్తున్నావు గదూ? సరే – యేం? నేనేం కాదనడంలేదే! మావంటి

వాళ్ళకి అనుష్కాయే తగించే. అనుష్కాకి సై, జోయాకి సై సై సై - అవగస్టినా క్రిస్టియనోవ్నాకూడా సై. ఇక నువ్వెళ్ళి ఎలీనాను చూడు. నేను అనుష్కా దగ్గిరికి నడతానని అనుకుంటున్నావు కదూ? ఊహుం - యింకా అధ్వాన్నపు పనిచేస్తున్నా. చికరసోవ్ దగ్గిరికి వెడుతున్నా. ఆయన కళాపోషకుడు. వోజ్జిన్‌లాగా కాజాన్ నించి వచ్చిన టాటారు. యీ ఆహ్వానం చూడు. అక్షరాలు ఆర్. యస్. వి. పి - కన్పిస్తున్నాయా? యీపత్రాలపట్టులో కూడా నాకు శాంతి దొరకడంలేదు. శెలవు.”

బెర్సెనీవ్ మాట్లాడకుండా అంతా విని షూబిన విషయమై ఆందోళన చెంది స్టహోవ్ ఇంటికి చక్కాబోయాడు. షూబిన్ చికరసోవ్ దగ్గిరికి వెళ్ళి సౌమ్యంగా సంభాషలాడాడు. ఆ కళాపోషకుడు కడుపుబ్బా నవ్వాడు. అతిథులు ముసిముసి నవ్వులు నవ్వారు. నిజానికి ఒక్కడూ సంతోషించలేదు. ఎవరిదారినవారు మోహం ముడుచుకు చక్కాపోయారు. నాటినించీ నెవ్‌స్కీ ప్రాస్పెక్టులో పరిచయంకల ఇద్దరు వ్యక్తులు కలుసుకున్నప్పుడు హఠాత్తుగా ఒకర్నిచూచి ఒకరు ఇకిలించి, మొహం ముడుచుకొని, దాటిపోయినాక హఠాత్తుగా యథాప్రకారం ఉదాసీన వైఖరో, చింతాక్రాంత వైఖరో, లేకపోతే [illegible] వైఖరో తాల్చేవారు.

# ౧౦

ఎలీనా తోటలోనించి కచేరీసావిడిలోకి వెళ్ళి అక్కడ బెర్సెనేవ్‌ని కలుసుకుని ఎంతో ఉత్సాహంతో ఆహ్వానించింది. వెనువెంటనే అత్యాతురతతో, కిందటిరోజు సంభాషణ తిరిగి ప్రారంభించింది. ఆమె ఒంటరిగా ఉంది. నికొలాయ్ మెల్లిగా ఎక్కడికో జారుకున్నాడు. అన్నా వాసిలెవ్నా తలకు కట్టుకట్టుకుని మేడమీద పండుకొంది. ఆమె పక్కన జోయా ఎక్కడా ముడతలులేని కోటువేసుకుని ఒడిలో చేతులుపెట్టుకుని కూర్చుంది. యువార్ ఇవనోవిచ్ గదిలో మంచివెడల్పుగా, సదుపాయంగావున్న సోఫా మీద పడుకున్నాడు. ఆ ఇంట్లోవాళ్ళు ఆ సోఫాను 'నిద్రాదేవత' అని పిలుస్తారు. బెర్సెనేవ్ తానెంతో పవిత్రంగా ఎంచుకునే తన తండ్రిని గురించి తిరిగీ చెప్పాడు. ఆ విజ్ఞానిని గురించి నాల్గుముక్కలు తెలుసుకోవాలసిన సమయమిదే.

బెర్సెనేవ్ తండ్రికి 82 మంది బానిసలుగల ఎస్టేటువుండేది. చనిపోయే ముందు వారందరికీ స్వాతంత్ర్యం ప్రసాదించాడు. ఆయన [1]'జ్ఞానోదయ సంఘ' సభ్యుడు. [2]గోటింజన్ విశ్వవిద్యాలయ విద్యార్థి. 'ఆత్మ పరిణామం' అనే గ్రంథం రచించాడుగాని అది ముద్రణకాలేదు. ఆ గ్రంథంలో

---

1. రహస్య సంఘం. సభ్యులంతా ప్రజాస్వామికవాదులు. ఆస్తికులే గాని మతగ్రంథాలు ఒప్పుకోరు.

2. ప్రష్యాలో ఒక పట్టణం.

[1]షెల్లింగియానిజం, [2]స్వీడెన్‌బర్గియానిజం, [3]రిపబ్లికానిజం సమ్మిళితమై సరికొత్తరూపం తాల్చాయి. బెర్సెనీవ్ పసితనంలోనే తల్లి చనిపోయింది. భార్య చనిపోగానే ఈ పసివాణ్ణితీసుకుని మాస్కో వచ్చి చదువు స్వయంగాచెప్ప నుద్యమించాడు. ప్రతిపాఠానికీ జాగ్రత్తగా నోట్సు తయారుచేస్తూ అపూర్వ చైతన్యంతో పనిచేయనారంభించాడు కాని ప్రయోజనం లేకపోయింది... ఆయన పట్టి భావనాప్రపంచవిహారి. పుస్తకాలరాయుడు. మధ్యమధ్య కొంచెం నత్తివచ్చినా గబగబా ఎవరికీ అర్థంకాని భాషలో అతి వివరంగా అలంకారాలతో మాట్లాడేవాడు. కొడుకంటే అమితప్రేమ. అతనిముందు సిగ్గుపడేవాడు. పాఠం అయిపోగానే ఆంద్రీ మాట్లాడకుండా కళ్ళు మిణుకరించేవాడు. చదువుకాస్తయినా అబ్బలా. ముసలాయన (ఆయనవయస్సు యాభై. చాలా ఆలస్యంగా పెళ్ళిచేసుకున్నాడు.) పరిస్థితి సవ్యంగాలేదని గ్రహించి ఆంద్రీని ఓ బోర్డింగుస్కూలులో ప్రవేశపెట్టాడు. ఆంద్రీ చదువు ప్రారంభమైంది గాని తండ్రి దృష్టినుంచి మాత్రం తప్పించుకోలేకపోయాడు. తండ్రి స్కూలుకు పదేపదేవస్తూ హెడ్‌మాస్టర్ని సంభాషణతో ఆదేశాలతో విసుగెత్తించాడు. తక్కిన మాస్టర్లుకూడా అనాహ్వానితంగా వచ్చి విద్యాబోధన మీద గొప్పగొప్ప గ్రంథాలు తెచ్చియిచ్చే ఈయనమూలంగా ఎంతో బాధపడ్డారు. ముసలాయన స్ఫోటకపుమచ్చల మొహం, బక్కపల్చని శరీరం, ఆ పాతకోటూ చూడగానే విద్యార్థులకుకూడా కంగారుపుట్టేది. పొడుగాటిముక్కూ, కొంగనడకా, చిరునవ్వెరగక చిరచిరలాడే ముఖం గల ఆ ముసలాయన విద్యార్థులంతా తన పిల్లలే అనుకుని వాళ్ళకోసం బెంగపెట్టుకుని బాధపడేవాడని వాళ్ళకి తెలీదు. ఒకమాటు [4]వాషింగ్టన్‌ను గురించి

1. ఆదర్శ, వాస్తవికవాద సమన్వయ సిద్ధాంతం. 2. స్వీడెన్‌బర్గ్ (1688-1672) స్వీడిష్‌శాస్త్రజ్ఞుడు, వేదాంతి. భగవంతుడు కలలోకనిపించి బైబిల్ యదార్థ సత్యమును వెల్లడించ మని ఆజ్ఞాపించాడట. దానిమీద 'న్యూచర్చి' స్థాపించాడు. ఇతనిప్రబోధములనే స్వీడెన్‌బర్గియానిజమంటారు.

3. ప్రజాస్వామికవాదం.

4. 1732 - 1799 అమెరికా ప్రథమాధ్యక్షుడు. అమెరికా స్వాతంత్ర్య పోరాటంలో ప్రముఖపాత్ర వహించినవాడు. గొప్ప ప్రజాస్వామికవాది.

వాళ్ళకి ఉపన్యాసం యివ్వాలని ఆతనికి బుద్ధిపుట్టింది. 'విద్యార్థులారా!' అని ప్రారంభించాడు. కాని అతనిగొంతు వినీవినడంతో పిల్లలంతా పారి పోయారు. ఆయనికి జీవితం గులాబీపూలపాన్పు కాలేకపోయింది. ప్రపంచ పరిణామం, రకరకాల సమస్యలూ అతన్ని కుంగతీసేసాయి.

బెర్సెనీవ్ యూనివర్సిటీలో చేరినాకూడా తండ్రివెంట వెడుతుండేవాడు. కాని అప్పటికే అయన ఆరోగ్యం చెడిపోయింది. *1848 లో జరిగిన సంఘ టనలు ఆయన్ని మొదలంటూ కదల్చివేశాయి. (ఇదివరలో రాసినగ్రంథమంతా తిరిగి రాయవలసివచ్చింది) 1853 శీతాకాలంలో చనిపోయాడు. యూని వర్సిటీ పరీక్షలో కొడుకు ఉత్తీర్ణుడవడం చూచుకోలేకపోయాడు. ముందే కుమారుని ఆశీర్వదించి, విజ్ఞానశాస్త్రానికి జీవితం అంకితం చేసినందుకు అభినందించాడు. ఇంక రెండుగంటలకు చనిపోతాడనగా "విజ్ఞానజ్యోతిని నీకందిస్తున్నా. బ్రతికున్నంతవరకూ దాన్ని నే తిప్పాను. నీవు మాత్రం దాన్ని వదిలేయకు" అని ఆదేశించాడు.

చాలాసేపు తన తండ్రిసంగతులు ఎలీనాకు చెప్పాడు బెర్సెనీవ్. ఇదివరలో అవిడముందు పడే కంగారు మాయమైపోయింది. నత్తికూడా చాలాభాగం తగ్గింది. సంభాషణ యూనివర్సిటీవైపు మళ్ళింది.

"నీ స్నేహితుల్లో యెవరైనా ప్రముఖులున్నారా? అని అడిగింది ఎలీనా. షూబిన్ మాటలు స్మరణకువచ్చి బెర్సెనీవ్ అన్నాడు? "ఊహూ నిజంచెప్పాలంటే మాలో వొక్కడూ ప్రముఖుడు లేడు. మాస్కో యూని వర్సిటీ ఒకప్పుడు పేరు ప్రఖ్యాతులు పొందించిందంటారు. కాని యిపుడు ఆపేరు ప్రఖ్యాతులు లేవు. ప్రస్తుతం అక్కడ యూనివర్సిటీలేదు. స్కూలు మాత్రం వుంది. నా సహాధ్యాయుల విషయంలో చింత పడుతూంటాను."

"చింత?" అని అడిగింది ఎలీనా మెల్లిగా.

"కాని ఒక్క సవరణ. ఒక్కవిద్యార్థిమాత్రం, గొప్పవాడున్నాడు"

"అతనిపేరు!" అని అడిగింది ఎలీనా ఆతురతతో.

"ఇన్సరోవ్ - డిమిట్రీ నికరోవిచ్ ఇన్సరోవ్. బల్గేరియా దేశస్థుడు."

---

* 1848 లో పారిస్, వియన్నా, బెర్లిన్, మిలాన్ లలో జరిగిన తిరుగుబాట్లు

"రష్యన్ కాదూ"

"కాదు."

"అలా అయితే మాస్కోలో యెందుకుంటున్నాడు?"

"చదువుకోడానికి వచ్చాడు. అతని చదువులో అసలుఉద్దేశం యేమిటో తెలుసా? మాతృభూమిని విముక్తిచేయటం. అతని జీవితంకూడా అపూర్వమైంది. అతనితండ్రి బాగావున్న వర్తకుడు. టిర్నోవో నివాసస్థలం. టిర్నోవో ఇప్పుడైతే చిన్నపట్నం కాని పూర్వం బల్గేరియా స్వాతంత్ర్యం అనుభవించినదినాల్లో రాజధాని. ఆయన వర్తకమంతా సోఫియాలో, రష్యాతో కూడా సంబంధంవుండేది. ఆ ఋనచెల్లెలు యిప్పటికీ కీవ్‌లోవుంటోంది. ఆమె భర్త అక్కడ సీనియరు హిస్టరీమాస్టరు. 1835 అంటే 18 సంవత్సరాలక్రితం మహాఘోరం జరిగింది. ఇన్సరోవ్ తల్లి హఠాత్తుగా మాయమైంది. వారం రోజుల తర్వాత ఆమెశవం కనిపించింది. యెవరో హత్యచేసుంటారు." ఎలీనా గజగజా వణికిపోయింది. బెర్సెనీవ్ ఆగాడు.

"చెప్పు చెప్పు" అన్నదామె.

"ఓ టర్కీ ఆఫీసరు ఆమెని చెరిచి హత్యచేశాడని పుకారు బయల్దేరింది. ఆమె భర్త నిజం తెలుసుకుని పగతీర్చుకోవాలని యత్నించాడు. ఆ ఆఫీసరుని కత్తితో పొడిచాడు. గాయం అయింది గాని వాడు చావలా. దానిమీద అతన్ని కాల్చి చంపేశారు."

"కాల్చి చంపేశారా? విచారణచేయకుండానే?"

"ఔను. అప్పటికి ఇన్సరోవ్‌కి యేడేళ్లు. పొరుగింటివాళ్ళు యీ పిల్లవాడని సాకసాగారు. అతని మేనత్త తన సోదరుని కుటుంబానికి కల్గిన ఆపద విని పిల్లవాణ్ణి తన కప్పగించమని కోరింది. ఒడిస్సామీదుగా కీవ్ తీసుకువచ్చి ఇన్సరోవ్‌ను మేనత్తకు అప్పగించారు. నిండా పన్నెండేళ్ళు కీవ్‌లో గడిపాడు. అందువల్లనే రష్యన్ భాష అంత బాగా మాట్లాడగల్గుతున్నాడు."

"రష్యన్ మాటాడతాడన్నమాట!"

"నువ్వూ నేనూ మాటాడగలిగినంత బాగామాట్లాడతాడు. ఇరవైయ్యోయేట అంటే 1848 ఆరంభంలో, స్వదేశానికి తిరిగివెళ్ళాలని బుద్ధిపుట్టింది, సోఫియా, టిర్నోవోలు వెళ్ళి చూశాడు. బల్గేరియా ఆ చివరనించి యీ చివరి

దాకా తిరిగాడు. ఆ దేశంలో రెండుసంవత్సరాలుండి మాతృభాష నేర్చుకున్నాడు. టర్కీ ప్రభుత్వం అతన్ని వెంటాడింది. ఆ రోజుల్లో మహా ఆపద పాలైవుంటాడు. అతని మెడమీద పొడుగాటి మచ్చ చూచాం. బహుశా అది గాయంతగిలి మానిన మచ్చయివుంటుంది. యీ విషయాలను గురించి మాట్లాట్టం అతని కిష్టంలేదు. యింతేకాదు, అతను మితభాషి. యీ విషయాలన్నీ అతనిచేత వెళ్ళకక్కించాలని చూచాగాని లాభంలేకపోయింది. ఆకుకు అందకుండా పోకకు పొందకుండా జవాబు లిచ్చాడు. మహా మొండి. చదువు పూర్తిచేసుకుందామనీ, రష్యన్ల తత్వం పూర్తిగా తెలుసుకుందామనీ 1850 లో తిరిగీ మాస్కో వచ్చాడు. ఇక యూనివర్సిటీ వదిలి వెళ్లేటప్పుడు...”

“వెళ్లేటప్పుడు ?”

“పరమాత్ముడికే తెలియాలి. జరగబోయేది యెవరు జోస్యం చెప్పగలరూ ?”

చాలాసేపటికివరకు ఎలీనా బెర్సెనీవ్ ముఖంకేసి రెప్పవాల్చకుండా చూసి చివరికి “బలే చోద్యమైన కథే ? అతను యెలా వుంటాడేం ? అతని పేరేమిటన్నావ్, ఇన్సరోవ్ కదూ ?” అన్నది.

“యేమని చెప్పను ? నా మట్టుకు నాకు అందవికారంగా వున్నట్టు కన్పించడు. నువ్వే చూస్తావుగా !”

“యేమిటీ ?”

“యిక్కడికి తీసుకొస్తాను. చూద్దువుగాని. యెల్లుండి యిక్కడకు వస్తాడు. యిక నాతోబాటే నా కుటీరంలో వుంటాడు.”

“నిజంగానే. మమ్మల్ని చూడ్డానికి యిక్కడికి వస్తానంటాడో రానంటాడో ?”

“ఓ - తప్పకుండా వస్తాడు.”

“అయితే అతనికి గర్వం లేదన్నమాట !”

“అతనికా ! అబ్బే. పిసరంతైనాలేదు. కాని అతనికి యింకో రకమైన గర్వం వుంది. అయితే అది నువ్వన్న అర్థంలో కాదు. ఉదాహరణకు, అతను యేమైనాసరే అప్పుచేయడు.”

"బీదవాడా ?"

"మరీ బీదవాడు కాదుగాని పెద్దగా యేం లేదు. బల్గేరియా వెళ్ళి నప్పుడు వాళ్ల నాన్న ఆస్తి నాశనమైంది నాశనమై పోగా మిగిలింది అమ్మి కొంత డబ్బు చేసుకున్నాడు. వాళ్ల మేనత్త కొంత సహాయం చేస్తుంది. కాని అంతా కలిసినా యెదో స్వల్పం..."

"అలా అయితే అతను మంచినడత గలవాడన్నమాట !"

"అవును. ఉక్కు మనిషి. అతనికి పట్టుదల, మర్మం యెంత వుంగో అంత పసితనం, అంత బోళాతనం వుంది. అతని బోళాతనం మన దండగమారి బోళాతనం – యేమీ దాచడానికి లేని మనవారి బోళాతనం–లాంటిదికాదు. యింతెందుకు, అతన్ని తీసుకువస్తాగా, నువ్వే చూద్దువుగాని వుండు."

"బిడియస్తుడా ?"

"ఊహు–కాదు. సున్నితహృదయంగల వాళ్లా బిడియస్తులు."

"అయితే నీ హృదయం సున్నితమైందేనా ?" బెర్సనీవ్ కంగారు పడి, జవాబుచేతులతో సూచించాడు.

"నాకు జిజ్ఞాస రేకెత్తించావు. సరే – అతను ఆ టర్కీవాడిమీద పగతీర్చుకున్నాడా ?"

బెర్సనీవ్ మందహాసంచేసి "నవలల్లోనే మనుషులు పగతీర్చుకుంటారు ఎలీనా ! ఆ టర్కీవాడు యీ పన్నెండేళ్ళలో చచ్చిపోయే వుంటాడు."

"యీ విషయం ఇన్సరోవ్ యెప్పుడూ నీతో చెప్పలా ?"

"ఊహు – యేమీ చెప్పలా ?"

"సోఫియాకి యెందుకు వెళ్ళాడూ ?"

"వాళ్ళనాన్న అక్కడుండేవాడు."

ఎలీనా ఆలోచనా సముద్రంలో మునిగింది.

"మాతృదేశవిముక్తి ! యీ మాటలు వుచ్చరిస్తేనే భయంవేస్తుంది. అవి అంత గొప్పపదాలు!"

సరిగ్గా ఆసమయానికి అన్నావాసిలేవ్నా రావడంతో సంభాషణ ఆగిపోయింది.

ఆ సాయంత్రం ఇంటికి నడిచివెళ్ళేటప్పుడు బెర్సేనీవ్ మహా ఆందోళనపడ్డాడు. ఇన్సరోవ్‌ని ఎలీనాకు పరిచయంచేయాలనే తన నిర్ణయానికి పశ్చాత్తాపపడలేదు. ఆ బల్గేరియా యువకుని కథ ఆమె హృదయంలో గాఢంగా హత్తుకుపోవడం సహజమనే అనిపించింది. అలా గాఢంగా హత్తుకుపోవాలని తానూ యత్నించాడు. కాని ఏమిటో తెలియని చింత అతని హృదయంలో ప్రవేశించింది. అయినా కిందటి సాయంకాలం చదివి వదిలినప్పటి దగ్గరనుంచీ 'హోహెన్‌స్టాఫెన్ చరిత్ర' చదవడానికి ఆ చింత అడ్డురాలేదు.

# ౧౧

ఆడినమాట ప్రకారం రెండురోజుల తర్వాత ఇన్సరోవ్ తన సామానంతా తీసుకుని బెర్సెనీవ్ కుటీరంముందు ప్రత్యక్షమయాడు. సేవకులెవరూ లేరు. ఎవరిసాయం లేకుండానే సామానంతా సర్ది గది ఊడ్చి శుభ్రం చేశాడు. వ్రాతబల్ల అమర్చడానికి చాలాసేపుపట్టింది. దీనికోసం ప్రత్యేకించిన గోడభాగంలో పట్టక తిప్పలుపెట్టింది. కాని ఇన్సరోవ్ పట్టుదలతో తనపని సాధించుకోగలిగాడు. ఈ పట్టుదలే అతనిలోని విశేషం. ఈవిధంగా ఆ కుటీరంలో ప్రవేశించి పది రూబుళ్ళు బజానాగా బెర్సెనీవ్‌కిచ్చి ఓ దుడ్డుకర్ర పట్టుకుని కొత్తయింటి చుట్టుప్రక్కలు పరిశీలించడానికి వెళ్ళి మూడుగంటలతర్వాత తిరిగివచ్చాడు. తనతోపాటు భోజనానికి రమ్మని బెర్సెనీవ్ అతన్ని అహ్వానించాడు. ఆ రోజుకుమాత్రం ఆహ్వానం తిరస్కరించలేననీ యజమానురాలితో భోజనంవిషయం మాట్లాడి యేర్పాటుచేసుకున్నాననీ ఇన్సరోవ్ సమాధానం చెప్పాడు.

"కాని ఆ తిండి మహాఘోరంగా వుంటుంది." అంటూ ఆక్షేపించాడు బెర్సెనీవ్. "ఆవిడకి వంటచేయడం బొత్తిగా చేతగాదు. ఇద్దరం కలిసి భోజనం తెప్పించుకుందాం. చెరిసగం భరించొచ్చు."

"కాని నీలాగా తినేంత వరుమానం నాకు లేదు." అన్నాడు ఇన్సరోవ్ ప్రశాంతంగా మందహాసంచేస్తూ.

ఆ మందహాసంలో ఏముందో బెర్సెనీవ్ ఈ విషయంలో ఇక పట్టుపట్టలేక పోయాడు. మరి మాట్లాడలేదు. భోజనానంతరం స్టహోవ్‌ల

ఇంటికి వెడదామని సూచించాడు. కాని ఇన్సరోవ్ 'ఆ సాయంత్రమంతా తన బల్గేరియన్ మిత్రులకు జాబులు రాయడానికి వినియోగించదలచానని ఇంకోరోజున వెడదామని అన్నాడు. ఇన్సరోవ్ మహాపట్టుదల మనిషని బెర్సెనేవ్‌కి ఇదివరకే తెలుసు. కాని ఇప్పుడు ఇద్దరూ ఒకేచూరుకింద నివసించడం ఆరంభించాక ఇన్సరోవ్ చేసినవాగ్దానం ఎలా తప్పడో అలానే చేసుకొన్న నిర్ణయాలనూ మార్చుకోడని బెర్సెనేవ్ మొదటిసారిగా గుర్తించాడు. రష్యాలో పుట్టి పెరిగిన బెర్సెనేవ్‌కి ఇలాంటి చిన్నవిషయాలలో కూడా ఇన్సరోవ్ చూపే అతిపట్టుదల మొదట చోద్యంగానూ అపహాస్యంగానూ కనిపించింది. కాని త్వరలోనే దీనికి అలవాటుపడి పోయాడు. చివరకు పట్టుదల గణనీయమైంది కాకపోయినా లాభకారి అని నిశ్చయించుకున్నాడు.

కొత్త ఇంటిలో చేరిన మర్నాడు ఉదయం నాల్గింటికల్లా లేచి ఇన్సరోవ్ ప్రశాంతంగా కంట్సోవో చుట్టూ ఒకమాటు తిరిగి నదిలో స్నానంచేసి వచ్చాడు. ఓ గ్లాసు పాలుతాగి పనిచేసుకోటానికి కూర్చున్నాడు. నిజానికి అతను చేయవలసిన పని బోలెడంత ఉంది. రష్యాదేశ చరిత్ర, న్యాయశాస్త్రం, ఆర్థికశాస్త్రం చదువుతున్నాడు. బల్గేరియా గీతాలు, గాథలు తర్జుమా చేస్తున్నాడు. బాల్కన్ సమస్యమీద వ్యాస రచనకు కావలసిన సాధన సామగ్రి పోగుచేస్తున్నాడు. బల్గేరియా ప్రజల ఉపయోగార్థం రష్యన్ వ్యాకరణం రచిస్తున్నాడు. బెర్సెనేవ్ వచ్చి *ఫ్యూయర్‌బాచ్ మీద చర్చ మొదలెట్టాడు. ఇన్సరోవ్ శ్రద్ధగా విని మధ్యమధ్య సూటిగా వ్యాఖ్యానించాడు. ఆ వ్యాఖ్యానాన్నిబట్టి ఫ్యూయర్‌బాచ్ గ్రంథాలు చదవాలా అక్కరలేదా అని ఇన్సరోవ్ మనసులో నిశ్చయించుకోటానికి యత్నిస్తున్నట్టు స్పష్టమైంది. ఇన్సరోవ్ రచనలమీదికి సంభాషణ మళ్ళింది. ఏదైనా అతను రాసింది చూపమని బెర్సెనేవ్ కోరాడు. బల్గేరియా గీతాలు రెండు మంచి అనువాదాలు విన్పించి అభిప్రాయం చెప్పమని ఇన్సరోవ్ అడిగాడు. అనువాదం సరిగానేవున్నా తగినంత జీవం వాటిలో లేదనే అభిప్రాయం వెలిబుచ్చాడు బెర్సెనేవ్. ఇన్సరోవ్ ఈ విమర్శనను గుర్తుపెట్టుకున్నాడు. గీతాలనుంచి బల్గేరియా ప్రస్తుత పరిస్థితిమీదికి సంభాషణ తిరిగింది. మాతృ

* జర్మన్ వేదాంతి. 1804-1872.

దేశం పేరు ఉచ్చరించినంతమాత్రాన ఇన్సరోవ్‌లో వచ్చిన మార్పును మొట్టమొదటిసారిగా బెర్సెనీవ్ గమనించాడు. ఇన్సరోవ్ ముఖం యెర్రబడ లేదు. స్వరం హెచ్చలేదు. అదేంకాదు. అతని తనువంతా బలం, ఆతురత చేకూర్చుకున్నట్లు కన్పట్టింది. పెదిమలు తీక్షణత, కాఠిన్యం తాల్చాయి. అతని నేత్రాంతాలలో ఆర్పరాని అగ్ని ప్రజ్వరిల్లింది. తన దేశానికి తాను వెళ్ళివచ్చిన విషయం విస్తరించి చెప్పటానికి ఇష్టపడకపోయినా బల్గేరియా విషయాలు ఎవతోనైనాసరే మహా సంతోషంతో ఇన్సరోవ్ మాట్లాడేవాడు. టర్కీవారిని గురించీ, వారి రాక్షసకృత్యాలను గురించీ, తనవారి కష్టాలను గురించీ, వారి ఆశలనుగురించీ తాపీగా మాట్లాడాడు. చిరకాలవాంఛమీద కేంద్రీకరించిన దీర్ఘాలోచన అతని ప్రతిమాటలోనూ వ్యక్తమయింది.

ఈవిధంగా ఇన్సరోవ్ మాటాడుతూంటే "ఇన్సరోవ్ తలిదండ్రుల మృతికి కారకుడైన ఆ టర్కీవాడు మహాఅవస్థకు గురికావలసి వస్తుంది." అనుకున్నాడు బెర్సెనీవ్.

ఇన్సరోవ్ ఇంకా మాటాడుతునే ఉన్నాడు. ఇంతలో తలుపుతెరిచి గుమ్మంలో షూబిన్ ప్రత్యక్షమై, అతి ఉత్సాహంగా, అతి నీటుగా గదిలో ప్రవేశించాడు. షూబిన్‌ను బాగాయెరుగున్న బెర్సెనీవ్ అతను ఎందుకో తలకిందులయ్యాడని గ్రహించాడు.

"యేగొడవా అక్కర్లేకుండా నన్ను నేనే పరిచయం చేసుకుంటా" అన్నాడు షూబిన్ సంతోషంతో 'పేరు షూబిన్. యీయువకుని స్నేహితుణ్ణి. (బెర్సెనీవ్‌ని చూపించాడు.) మీరు ఇన్సరోవ్ ! కదూ ?"

"అవును. నేనే ఇన్సరోవ్‌ని"

"కరస్పర్శ చేసుకుందాం...ఒకరివిషయం ఒకరం తెలుసుకుందాం. నన్నుగురించి మీకు బెర్సెనీవ్ చెప్పాడోలేదో తెలియదుగాని మిమ్మల్ని గురించి బోలెడంత నాకు చెప్పాడు. యిక్కడ వుంటానికి వచ్చారా ! భేష్ ! ఈవిధంగా మీకేసి తేరిపారజూడడం లక్ష్యపెట్టకండి. నేను శిల్పిని. మీ శిరాకృతిప్రతిమ తయారుచేయడానికి అనుమతి కోరుతున్నాను."

"ఓ - నా శిరస్సు ఎపుడూ మీ ఆధీనమే" అన్నాడు ఇన్సరోవ్.

"యివాళ యేం చేయదల్చుకున్నారు?" అని అడిగాడు ఘూబిన్ హఠాత్తుగా కుర్చీలో కూర్చుంటూ. మోకాళ్ళు దూరంచేసి వాటిమీద చేతులు ఆనించాడు.

"ఆంద్రీ పెత్రోవిచ్! ప్రభువుగారు యివాళ యేదైనా ప్లానేశారా? యేదైనా వినోదం గాలిపేవిషయం ఆలోచించాలి. వాతావరణం మహా పసందుగావుంది. యెండుగడ్డి వాసన, యెండు స్ట్రాబెర్రీ[illegible]డు వాసన... స్ట్రాబెర్రీటీ తాగుతున్నట్టుంది. యీ ప్రదేశంలోని వివిధ సౌందర్యాలు యీ నూతనపురుషుడికి చూపిద్దాం. ('యేదో యితన్ని తలకిందులుచేసింది' అని ఇంకా బెర్సెనీవ్ అనుకుంటూనే ఉన్నాడు.) 'యేవి టీమూగనోము? మిత్రమా! *హోరాషియో! భవిష్యత్తును వెలువరించే నీపెదిమెలు కదుల్చు. యేం చేద్దామో చెప్పు."

"ఇన్సరోవ్ యేమనుకుంటున్నాడో నాకు తెలుసు. యేదో పనిచేసుకో డానికి తయారవుతున్నాడనుకుంటా."

ఘూబిన్ కుర్చీలోతిరిగి 'యేదైనా పనిచేసుకుందామనుకుంటున్నారా?' అని అడిగాడు ముక్కుమాట నటిస్తూ.

"లేదు. యివాళ్లా తిరుగుదాం."

"బలేబాగుంది. యికపదండి. ఆంద్రీ, మిత్రమా! తలమీద హాటు పెట్టుకో. కంటికి కనిపించినంతదూరం తిరుగుదాం. మనం యువకులం. కావలసినంతదూరం చూడగలం. నేనొక చెత్తహోటలు యెరుగున్నా... అక్కడ యింత చెత్తడిండి పడేస్తారు. మనమంతా బాగా కులాసాగా కాలం గడుపుదాం, రండి రండి."

అరగంట తర్వాత ముగ్గురూ మాస్కోనది ఒడ్డువెంట నడవ నారంభించారు. చెవులున్న విచిత్రమైన టోపీ ఒకటి తెచ్చాడు ఇన్సరోవ్. ఆ టోపీచూసి, ఘూబిన్ అపరిమితంగా ఆనందించాడు. ఇన్సరోవ్ ప్రశాంతంగా చూస్తూ, నిశ్వసిస్తూ, మాటాడుతూ, మందహాసంచేస్తూ తాపీగా

---

*హోరాషియో : షెక్స్పియర్ హామ్లెట్ నాటకంలోని ఒకపాత్ర. హామ్లెట్ స్నేహితుడు.

నడిచాడు. ఆ రోజంతా వినోదంగా గడపాలని నిశ్చయించుకున్నాడు. పూర్తిగా ఆనందం అనుభవిస్తున్నాడు. "ఆదివారంనాడు షికారుకు బయలుదేరిన పిల్లలల్లే" అని బెర్సనీవ్ చెవిలో ఊదాడు షూబిన్. షూబిన్ విదూషకుని పాత్ర ధరించాడు. ముందు పరుగెత్తుకునివెళ్ళి ప్రసిద్ధ శిలా ప్రతిమల భంగిమం అనుకరించి చూపాడు. గడ్డిమీద పిల్లిమొగ్గలు వేశాడు. చీదరపుట్టించని ఇన్సరోవ్ శాంతస్వభావం అతన్ని హాస్యగాణ్ణిగా చేసింది.

"యెందుకో ఆందోళన? ఫ్రెంచి మిత్రుడా!" అన్నాడు బెర్సనీవ్ చాలామాట్లు.

"అవును. నేను ఫ్రెంచివాణ్ణి. సగం సగం ఫ్రెంచివాణ్ణి. అందుకనే హాస్యాన్ని, గభీరతను — ఓ హోటలుబాయ్ చెప్పినట్లు – సమపాళంలో నడుపుతున్నా." అని తిరిగి జవాబిచ్చాడు షూబిన్.

నదిఒడ్డునించి మళ్ళి ఎత్తైన గోడల్లా వున్న పచ్చనిపంటచేల వరసల రెంటి మధ్య బురదతో నిండిన దోవవెంట నడవసాగారు. ఆ చేలు వారిమీద నీలిరంగుచాయను ప్రసరిస్తున్నాయి. కంకులమీదుగా సూర్యరశ్మి రాచుకొనిపోతున్నట్టుంది. భరద్వాజపక్షులు పాడుతున్నాయి. కోలంకి పిట్టలు అరుస్తున్నాయి. వెచ్చటిగాలికి చుట్టూఉన్న పచ్చికలేచి కదులుతూ ఆకుపచ్చగా ప్రకాశిస్తోంది. కాడలమీద పువ్వులు అల్లల్లాడుతున్నాయి. చాలాసేపు వారు నడుస్తూ మాటాడుకుంటూ మధ్య మధ్య విశ్రాంతి తీసుకున్నారు. దారినబోయే ఓ బోసినోటి రైతుతాతతో షూబిన్ 'కప్పగంతాట' ఆడాలని చూచాడు. కాని ఏం చేసినా ఆ తాత ఇకిలించి ఊరుకున్నాడు. చివరికి ఆ 'చెత్తహోటలు' చేరుకున్నారు. అక్కడ నాకరు దఖీమని వీళ్ళమీద పడ్డాడు. తర్వాత దక్షిణ బాల్కన్ సారాతో 'చెత్తతిండి' తెచ్చిపెట్టాడు. షూబిన్ చెప్పినట్టు తృప్తిగా ఆనందించేందుకు ఇవేమీ అడ్డురాలా. ఈ వినోదంలో షూబిన్ మహా గోలచేశాడు కాని దీనిలో నిజాయితీలేదు. ఎవరో ఎవరికీ తెలీని వెనెలిన్ అనే గొప్ప వ్యక్తి ఆరోగ్యార్థం, క్రం, హ్రం, హ్రాం ఏగోపేరిటి బల్గేరియా రాజు ఆరోగ్యార్థం సారా సేవించాడు. ఆ బల్గేరియా రాజు ఆదం నాటివాడని ఓ మాట షూబిన్ వదిలాడు.

దానిమీద ఇన్సరోవ్ అందుకొని “పందొమ్మిదో శతాబ్దం నాటి” అని దిద్దాడు.

“ఓ - అలాగా. పందొమ్మిదో శతాబ్దంలోనా. బలే! అద్భుతం!” అన్నాడు షూబిన్.

ఈ అవహేళనమధ్య, ఈ హాస్యాలమధ్య షూబిన్ ఏదో కలవరంతో ఇన్సరోవ్‌ను పరీక్షిస్తున్నట్లు, అతని హృదయంలోకి తొంగిచూస్తున్నట్లు బెర్సెనీవ్ కనిపెట్టాడు. కాని ఇన్సరోవ్ యథాప్రకారం ఏ కలతా లేక శాంతంగానే ఉన్నాడు.

తిరిగితిరిగీ ఇంటికి చేరుకుని మనసులుమార్చి నాటి ఉదయంనుండి నిలవరించుకుంటున్న చిత్తవృత్తి సమసిపోకుండా ఉండేందుకుగాను స్టహోవ్‌ల ఇంటికి వెళ్ల నిశ్చయించుకున్నారు. వారి రాకను తెలియజేయడానికి షూబిన్ ముందుగా పరిగెత్తాడు.

## ౧౨

"కథానాయకుడు ఇన్సరోవ్ మనకు దర్శనం ప్రసాదించనున్నాడు." అన్నాడు షూబిన్ గంభీరంగా స్టహోవ్ కచేరీసావిడిలో ప్రవేశిస్తూ. ఆ సమయంలో ఎలీనా, జోయా లిద్దరే అక్కడ ఉన్నారు.

"యెవరూ?" అని జర్మన్ భాషలో అడిగింది జోయా. హఠాత్తుగా మాట్లాడవలసినపుడు తన మాతృభాషలో మాట్లాడడం జోయాకి అలవాటు. ఎలీనా ఎక్కడా చలనంలేకుండా కూర్చుంది. షూబిన్ ఆమెకేసిచూసి ఆటకాయితనంగా చిరునవ్వునవ్వాడు. ఆ నవ్వుకు ఎలీనా కలతచెందింది గాని మాటాడలేదు.

"వినిపించిందా? శ్రీ ఇన్సరోవ్‌గారు వస్తున్నారు." అని తిరిగీ చెప్పాడు.

"ఆ - విన్నా. ఆయన పేరుకి నువు తగిలించిన గౌరవవాచకాలూ విన్నా. ఆశ్చర్యంగావుంది! ఇన్సరోవ్ యింతవరకు యింట్లో అడుగుపెట్టనే లేదు, అపుడే ఆయనమీద చలోక్తులు విసురుతున్నా" అని జవాబిచ్చింది ఎలీనా. షూబిన్ హఠాత్తుగా మాటతిప్పుకుని "సరె, సరే ఎలీనా! నిజానికి నాకేం చెడుతలంపులేదు. ఇవాళ్లల్లా కలిసితిరిగాం. బలేమనిషి!" అన్నాడు.

"ఆ విషయం నిన్నేమడగలేదే!" అంది ఎలీనా లేచినిల్చుంటూ.

"ఇన్సరోవ్ పడుచువాడేనా?" అని అడిగింది జోయా.

"ఆ - 144 యేళ్ళుంటాయి!" అని సమాధాన మిచ్చాడు షూబిన్ కోపంతో.

"నౌకరువచ్చి ఇన్సరోవ్, బెర్సెనీవ్‌ల రాక తెలియపర్చాడు. మిత్రులిద్దరూ గదిలో ప్రవేశించారు. బెర్సెనీవ్ అందరికీ ఇన్సరోవ్‌ని పరిచయం చేశాడు. ఎలీనా వారిని కూర్చోమని తానూ కూర్చుంది. అన్నా వాసిలెవ్నాకు వీరిరాక తెల్పడానికి జోయా మేడమీదికి వెళ్ళింది. సాధారణంగా ప్రథమ సంభాషణలాగానే సంభాషణ చిన్న చిన్న విషయాల మీద నడిచింది. ఒకమూల ఒదిగి షూబిన్ మాట్లాడకుండా చూస్తున్నాడు. కాని ప్రత్యేకంగా చూడదగిందేమీలేదు. అతనిమీద కోపం ఎలీనా అణచుకుంటున్న సూచనలుమాత్రం కనిపించాయి. అంతే. ఇన్సరోవ్ బెర్సెనీవ్‌లవేపే చూసి, శిల్పిలాగా, వారిద్దరి మొగాలూ పోల్చి చూశాడు. వాళ్ళిద్దరిలో ఒకరూ స్ఫురద్రూపులు కారనుకున్నాడు. ఆ బల్గేరియన్ ముఖం సలక్షణంగా, శిల్పశాస్త్రానుగుణంగానుంది. పైగా ఆ సమయంలో వెలుతురు సరిగ్గా ఆ ముఖంమీద పడుతోంది. ఇక ఆ రష్యన్ ముఖం వర్ణచిత్రం గీయటానికి అనుగుణంగా ఉంది. రేఖలు స్ఫుటంగా లేవుగాని ఆకృతి దివ్యంగా వుంది. ఏ బాలికైనా వీరిద్దరిలో ఎవరినైనా ప్రేమించవచ్చు. ఎలీనా ఇంతవరకు ఎవరినీ ప్రేమించి ఎరగదు. బెర్సెనీవ్‌నే ప్రేమిస్తుంది. ఇదీ షూబిన్ ఊహ!

అన్నా వాసిలెవ్నా కచేరీ సావిడిలోకి వచ్చింది. సంభాషణ జనపద గృహ వైఖరిదాల్చింది. ఎక్కువగా జనపద సంబంధంగానో గృహసంబంధంగా సంభాషణ నడిచింది. అనేక విషయాలమీద చర్చలతో సంభాషణ వివిధ రూపాలు తాల్చింది. కాని ప్రతి మూడునిమిషాలకోమారు విసుగెత్తించే విరామం సంభాషణకు అడ్డువస్తోంది. అలాంటి విరామంలో అన్నా పియానో వాయించమని జోయాను కోరింది. జోయా చేసిన సంజ్ఞను అర్థంచేసుకుని షూబిన్ ముఖం ముడుచుకున్నాడు. జోయా పియానో ముందుకూర్చుని తనకు వచ్చిన పాటలన్నీ వాయించింది. యువార్ ఇవనోవిచ్ తలుపుచాటునుంచి ప్రవేశించబోయి చేతివేళ్ళు ఆడించి వెనక్కి వెళ్ళిపోయాడు. తర్వాత టీ తాగి అందరూ తోటలోకి వెళ్ళారు ... చీకటిపడ నారంభించింది. అతిథులు వెళ్ళిపోయారు.

అనుకున్నంతగా ఎలీనాకు ఇన్సరోవ్ నచ్చలేదు. అతని నిర్మోహ మాటమూ, నిగర్వమూ, చూపులూ ఆమెకి నచ్చాయి. ఇన్సరోవ్ ఎంత

పట్టుదలమనిషైనా, ఎంత అమాయకుడైనా మొత్తంమీద అతని ఆకారం, బెర్సెనీవ్ చెప్పినమాటలను బట్టి మనసులో చిత్రించుకున్న చిత్రంతో సరిపోలేదు. ఏమాత్రం అనుమానించకుండానే ఏదో దారుణం జరుగుతుందని ఆమె ఆశించింది. 'కాని యివాళ అతనెక్కువగా మాట్లాడలేదు. అదీ నాతప్పే. నేను ప్రశ్నలేం వెయ్యలేదు. సరే యింకోదఫా చేస్తాను. కాని అతని కళ్ళు భావగరిమను, నిజాయితీని వెలువరిస్తున్నాయి.' అనుకుంది కాని అతన్ని పూజించాలనుకోలేదు. స్నేహహస్తం చాచాలనుకుంది. ఈవిషయం ఆమెను కలవరపెట్టింది. ఇన్సరోవ్ వంటివారిని కాదు ఏలీనా ఊహించుకుంట. ఆమె ఊహించుకున్న నాయకుడు కాదుఇతను. 'నాయకుడు' అనే పదం షూబిన్‌ని జ్ఞప్తికితెచ్చింది. పక్కమీద పండుకుని కోపంతో యెర్ర బారిపోయింది.

తోవలో బెర్సెనీవ్ "నూత్నమిత్రు లెలావున్నారు?" అని ఇన్సరోవ్‌ని ప్రశ్నించాడు.

"బాగా నచ్చారు. ముఖ్యంగా వాళ్ల అమ్మాయి చక్కనిచుక్క. మంచి ఉద్రేకి. అయినా ఆమె ఉద్రేకమూ సవ్యమైందే" అని ఇన్సరోవ్ జవాబిచ్చాడు.

"నువు తరుచు వెళ్ళి వాళ్ళని చూస్తూవుండాలి."

"సరే." అని ఇన్సరోవ్ సమాధానమిచ్చాడు. ఇంటికి చేరుకునేవరకూ మరేం మాట్లాడలేదు. ఇంటికిచేరిన మరుక్షణంలో ఇన్సరోవ్ గదిలోకి వెళ్ళి తలుపులేసుకున్నాడు. అర్ధరాత్రి దాటినతర్వాత చాలాసేపటివరకూ కొవ్వొత్తి అలా గదిలో వెలుగుతూనేవుంది.

బెర్సెనీవ్ ఒక్కపేజీ అన్నా పూర్తిచేయకముందే కిటికీతలుపులమీద రాళ్ళు పడ్డాయి. టపీమని లేచి, కిటికీతెరిచి చూచేసరికి పాలిపోయిన ముఖంతో షూబిన్ కనిపించాడు.

"నీకేం అలుపుగిలుపూ లేనట్టుందే! చిమ్మటపురుగులా వున్నావు." అని అనబోతుండగా షూబిన్ అడ్డంవచ్చి 'ఇష్! యెవరికంటాబడకుండా వచ్చా. నీతో రహస్యంగా ఒక్కమాట మాట్లాడాలి.'

"అలాగయితే గదిలోకిరా."

“అబ్బే అవసరంలేదు.” అని జవాబిచ్చి కిటికీచట్రంమీద మోచేతు లానించి 'యిలాగైతేనే తమాషాగా, స్పానిష్ పద్ధతిలో వుంటుంది. యిక, అభినందనాలు! నీపంట పండింది. నీ బజాయిరోవ్, అపూర్వమానవుడు జయించలేకపోయాడు. అందుకు నాకీ హాని. ఈ విషయం నిరూపిస్తున్నా, విను. ఇన్సరోవ్‌ని గురించి యిదిగో నా సర్టిఫికేట్టు: ప్రజ్ఞ శూన్యం; కవిత్వం సున్నా; పనిశక్తి! అపరిమితం; జ్ఞాపకశక్తి విపరీతం; తెలివితేటలు పరిమితంగాని కుశాగ్రబుద్ధి; శతముండి; మంచిమనసు. తెలిసినవిషయంమీద చక్కగా మాటాడేశక్తివుంది. మనిద్దరిమధ్యా చెప్పాలంటే విసుగెత్తిస్తాడు. యేమిటి? నేనతనికేం అన్యాయంచేశానా? ఇంకోవిషయం: అతనితో యెన్నడూ, చనువుగావుండలేవు. యింతవరకు యెవరూ అతనితో చనువుగా మెలగలేదు. ఇక నేను: నేను శిల్పినికాదూ, అందుకని అతనికి నేనంటే అసహ్యం. పోనీ అందుకూ నేను గర్వపడుతున్నా. ముండి! శతముండి! మనందరినీ అణగద్రొక్కిపారేయగలడు: జన్మభూమితో ముడిపెట్టుకున్నాడు. సామాన్యప్రజలతో కలిసి తిరిగే మనబోటి చిల్లిపడవ కాదతను. అతనిపని సూటైంది, తేలికైంది. ఆ టర్కీవాళ్ళని తరిమేయడం, అంతకుమించి అతనికేంపనుంది! కాని యీ లక్షణాలనికాదు స్త్రీలు ప్రేమించేది. నీలాగా నాలాగా ఆకర్షణీయుడేంకాదు.”

“మధ్య నా సంగతి తేవడమెందుకు” అని బెర్సెనేవ్ గొణిగి అన్నాడు: “తక్కినవాటి విషయంలో నువ్వు తప్పు అభిప్రాయపడ్డావ్. నువ్వంటే అతనికేం అసహ్యంలేదు. వాళ్ళవాళ్ళతో అతను చాలా చనువుగా వుంటాడు, నాకు తెలుసు.”

“అది వేరే విషయం. వాళ్ళ దృష్టిలో అతను నాయకుడు కావచ్చు. నాయకుడైనవాడు యితనిలా వుండడనే నా వూహ. నాయకునికి యెలా మాట్లాడాలో తెలుసుకోనవసరంలేదు. యెద్దులా రంకె వేస్తాడు. కొమ్ములతో గుద్దితే చాలు గోడలు పడిపోతాయి. అలా యెందుకు చేయాలో తెలుసుకోనవసరంలేదు. అలా చేయాలి. అంతే. కాకపోతే యీ రోజుల్లో యింకో రకపు నాయకులు కావాలి కామాలు.”

"ఇన్సరోవ్ విషయం యెందుకు అంతగా పట్టించుకోవడం? అతని గుణగణాలను వర్ణించడానికేనా పరుగెత్తుకుంటూ యిక్కడికి వచ్చింది?" అని అడిగాడు బెర్సెనీవ్.

"యింటి దగ్గిర వుంటే మనసు కుంగిపోయింది. అందుకని యిలా వచ్చేశా."

"అదా సంగతి. మళ్ళీ యేడుపు మొదలు పెడతావాయేం!"

"సరే - నవ్వితే నవ్వు. నిరాశ, కోపం, అసూయ నా హృదయాన్ని కొరుక్కుతినేస్తున్నాయి. యిలావస్తే వాటిని తరిమివేయగలనేమోనని వచ్చా."

"అసూయ! యెవరంటే - అసూయ?"

"నువ్వంటే, అతనంటే. ప్రపంచకమంటే అసూయ. 'ఆమెను ఇదివరకే అర్థం చేసుకోగలిగివుంటే, యెలాగో తెలుసుకుని ముందడుగు వేసుంటే?' యీ ఆలోచనే నన్ను వేధిస్తున్నది... సరే, మాటలతో యేమిటి ప్రయోజనం! యెప్పుడూ నవ్వుతూ పేలుతూ చలోక్తులు విసరడం, ఆ తర్వాత వెళ్ళి వురేసికుని చావడం!"

"ఆ - అదేమిటి. నువ్వు వురేసుకు నేం చావవు" అన్నాడు బెర్సెనీవ్.

"యిలాంటి రాత్రి వురేసుకు నేం చావను. చలికాలం దాకా ఆగు. యేమైనా యిలాంటి రాత్రి యెవరైనా ఆనందంతోనే చస్తారు. ఆనందం! యీ రాత్రి రోడ్డుమీది చెట్లనీడలు 'ఆనందం యెక్కడుందో మాకు తెలుసు. చెప్పమా?' అని చెవుల్లో ఊదుతున్నట్టనిపిస్తోంది. షికారు వెడదాంరమ్మని నిన్ను పిలుద్దామనుకున్నా. కాని యిప్పుడు నువ్వు హుషారుగా లేనట్టున్నావు. నిద్రపో. గణితశాస్త్ర సాంకేతికాలు కలలోకి వస్తాయి. ఇక నా విషయం: నా హృదయం బ్రద్దలైపోతోంది. 'ఓ మేధావంతులారా! నవ్వుతూంటే చూస్తారు. చూసి హుషారుగా వున్నాడనుకుంటారు. అతను మహా విరుద్ధంగా ప్రవర్తిస్తున్నాడని ఋజువు చేస్తారు. అంటే అతను బాధపడటం లేదన్నమాట'... భగవానుడు నిను రక్షించుగాక!"

షూబిన్ చటుక్కున కిటికీ దగ్గిరనించి వెళ్ళిపోయాడు. 'అనుష్కా' అని బెర్సెనీవ్ అనబోయి మళ్ళీ తమాయించుకున్నాడు. షూబిన్ నిజంగా తలకిందులైనట్టే కనిపించాడు. ఒకటి రెండు నిమిషాల తర్వాత నిట్టూర్పు విడిచినట్టుంటే విని బెర్సెనీవ్ లేచి కిటికీ తెరిచాడు. కాని అంతా నిశ్శబ్దంగా ఉంది. ఎక్కడో దూరాన ఎవరో - బహుశా దారిపోయే ఓ రైతు గోపం గీతం పాడుతున్నాడు.



# ౧3

ఇన్సరోవ్, కంట్సేవో పరిసరాలలో నివసించడానికి వచ్చినతర్వాత మొదటి రెండువారాలలో నాలుగైదుసార్లుకంటె యెక్కువ స్టహోవ్ ఇంటికివెళ్లలేదు. కాని బెర్సెనీవ్ రోజు విడిచి రోజు వెడుతుండేవాడు. అతన్ని కలుసుకోవడమంటే ఎలీనాకు మహాసంతోషంగా ఉండేది. వారిద్దరూ కులాసాగా కబుర్లు చెప్పుకునేవారు. అయినా బెర్సెనీవ్ చిన్నబోయిన ముఖంతో ఇంటికి మరలేవాడు. అతి చురుకుగా తన శిల్పాలపని చూసుకుంటూ షూబిన్ కనిపించేవాడేకాదు. తలుపు వేసుకుని గదిలో కూర్చునేవాడు. ఎప్పుడైనా హఠాత్తుగా మట్టితో నిండిన చొక్కాతో కన్పించేవాడు. లేకపోతే మాస్కోలో తనకున్న స్టూడియోలో రోజులకు రోజులు గడిపేవాడు. అక్కడ ఇటాలియన్ శిల్పమిత్రులు అతన్ని సందర్శిస్తుండేవాళ్ళు. ఎలీనా తాననుకున్నట్లు ఒక్కమాటా ఇన్సరోవ్‌తో మాట్లాడలేదు. అతని పరోక్షంలో అనేకవిషయాలమీద ప్రశ్నలు సిద్ధంచేసుకునేది. కాని అతని సమక్షంలో తనసన్నాహానికి తానే సిగ్గుపడేది. ఇన్సరోవ్ శాంతస్వభావం ఆమెని కలవరపెట్టింది. అతనిచేత మనసువిప్పి చెప్పించేహక్కు తనకు లేదని అనుకుని తగుసమయంకోసం నిరీక్షించడానికి నిశ్చయించుకుంది. అయినప్పటికీ తమమధ్య కొద్దిమాటలే నడిచినా, ఆనాటికానాడు అతను తన్నాకర్షిస్తున్నాడని గుర్తించింది. ఎన్నడూ ఇన్సరోవ్‌తో ఒంటరిగా కాలంగడపలేదు. ఎవరిసంగతైనా బాగా తెలుసుకోవాలంటే అతనితో బాతాఖానీ వెయ్యాలి. బెర్సెనీవ్‌తో ఇన్సరోవ్ విషయం ఎక్కువగా మాట్లాడేది. ఇన్సరోవ్ మీద ఎలీనాకు సదభిప్రాయం కల్గిందనీ తనమిత్రుడు పరాజయం పొందలేదనీ బెర్సెనీవ్ గ్రహించాడు. అతన్నిగురించి తనకు తెలిసిందంతా అత్యుత్సాహంతో,

వివరాలతో చెప్పాడు. (నచ్చేట్టు మన మిత్రుల విషయం యితర్లకి చెప్పేటప్పుడు అతనిని పొగడుతాం. ఆ పొగడడంలో మనలను మనమే పొగడుకుంటున్నామని అనుమానించం) ఎలీనా చెంపలు ఎరుపెక్కినపుడు, కళ్ళు వికసించి కాంతులు రజిమ్మినపుడు ఇదివరలో తానను భవించిన విషాదం ఆతన్ని అణచివేస్తుండేది.

ఒకరోజున మామూలువేళ గాక ఉదయం పదిగంటలకు బెర్సెనీవ్ స్టహోవ్ ఇంటికి వెళ్ళాడు. ఎలీనా సోఫాలో కూర్చునిఉంది.

"యేమనుకుంటున్నావ్" అని ఆరంభించాడు చిరునవ్వు తెచ్చిపెట్టు కుంటూ. 'మన మిత్రుడు ఇన్సరోవ్ మాయమై చక్కాబోయాడు.'

"యేమిటీ? మాయమైపోవడమే?"

"మాయమైపోయాడు. నిన్నగాక మొన్న యెక్కడికో వెళ్ళి పోయాడు. యింతవరకు కనిపించలేదు."

"యెక్కడికి వెళ్ళుతున్నదీ చెప్పి మరీ వెళ్ళాడా?"

"లేదు."

ఎలీనా 'బహుశా మాస్కో వెళ్ళి వుండొచ్చు.' అంది ముభావంగా ఉన్నట్లు కన్పించాలని యత్నిస్తూ. ముభావంగా ఉండాలని యత్నించి నందుకు తనకుతానే ఆశ్చర్యపోయింది.

"నేనలా అనుకోను. వొంటరిగా యేం వెళ్ళలేదు."

"అయితే యెవరితో కలిసి వెళ్ళాడు?"

"మొన్న భోజనానంతరం యెవరో యిద్దరు అతన్ని చూస్తాని కొచ్చారు. బహుశా వాళ్ళదేశపు వాళ్ళయి వుండచ్చు."

"బల్గేరియన్లా? యెలా తెలిసింది?"

"నాకు తెలీని భాషలో వారు అతనితో మాట్లాడారు. తప్పకుండాఅది స్లావ్‌జాతివారిభాషై వుంటుంది. ఎలీనా! ఇన్సరోవ్ విషయంలో మాయా మర్మం యేమీలేదని అనేదానివి కదు, యింతకంటె మాయామర్మ మేముంటుంది! చూడు. గదిలోకి వెళ్ళారు. తర్వాత విపరీతంగా కేకలేసు కుంటూ, వాదించుకుంటూ వెళ్ళిపోయారు - ఇన్సరోవ్‌కూడా..."

"అతనుకూడానా?"

"అవును. అతనూవాళ్ళమీద కేకలేశాడు. ఒకర్నొకరునిందించుకున్నారు. ఆ ఆగంతకులని నువు చూడాల్సింది! యిద్దరూ నలభై దాటినవాళ్లు. వట్టి

మొద్దు మొఖాలు. చెంప యెముకలు కనిపిస్తున్నాయి. వంకర ముక్కులూ వాళ్లూ, బట్టలు మాసి చెమటకంపు కొడుతున్నాయి. కార్మికుల్లా కన్పించారు గాని వాళ్ళు కార్మికులూ గారూ, ఘరానా మనుషులూ కారూ. వాళ్ళెవళ్ళో దేవుడికే తెలియాలి."

"వాళ్ళతో కలిసి వెళ్ళాడా?"

"అవును. వాళ్లకి తిండిపెట్టి, వాళ్ళతో కలిసి వెళ్ళిపోయాడు. యజమానురాలు చెప్పింది: 'వో పెద్ద కుండెడు ముద్దపులుసు జుర్రేశారు. తోడేళ్లలాగా కుండమీద పడ్డారు.' అని."

ఎలీనా మందహాసం చేసింది — "చూడ్డుగానిగా చివరికి యీ వ్యవహారంలో పసేంలేదని తేలిపోతుంది."

"నువ్వు చెప్పిందే సరైంది కావచ్చు. కాని 'పస' లేదనడం తప్పు. షూబిన్ యెంత వాదించినా ఇన్సరోవ్‌లో పసలేకపోలేదు."

"షూబిన్" అని ఎలీనా బుజాలు ఎగరవేసింది.

"కాని ఆ యిద్దరూ ముద్దపులుసు గబగబా జుర్రేయడం..."

"*థెమిస్టొకిల్స్ కూడా సాలామిస్ యుద్ధంముందు అలా నేతిన్నాట్ట!" అన్నాడు బెర్సెనీవ్ చిరునవ్వు నవ్వుతూ.

"అవును. కాని ఆ మర్నాడు యుద్ధం జరిగింది. ఇన్సరోవ్ రాగానే నాకు తెలియజెయి." అని సంభాషణ విషయం మార్చాలని యత్నించింది. సంభాషణ మందకొడిగా సాగింది.

జోయా గదిలోకివచ్చి బొటనవేళ్ళమీద నడవడం మొదలెట్టింది. ఆ నడకకి అర్థం అన్నావాసిలెవ్నా ఇంకా నిద్రపోతోందని. బెర్సెనీవ్ శెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

ఆ సాయంకాలం ఎలీనాకు ఓ చీటీ బెర్సెనీవ్ పంపించాడు. ఆ చీటీలో "తిరిగి వచ్చాడు. యెండకు కమిలిపోయాడు. ఆపాదమస్తకం దుమ్ము కొట్టుకుంది. కాని యెక్కడికి వెళ్ళిందీ, యెందుకు వెళ్ళిందీ నాకు తెలియలేదు. నువ్వు తెలుసుకోగల్గుతావా?"

"నేను తెలుసుకోగల్గుతానా" అని సణుక్కుని "ఇన్సరోవ్ నాతో మహ మాట్లాడుతున్నట్టు!" అనుకుంది ఎలీనా.

---

* థెమిస్టొకిల్స్: ఏథెన్స్ రిపబ్లిక్ సేనాని. 514-449 బి. సి. సాలామిస్ అనే దీవివద్ద నావికాయుద్ధంలో పారసీకులను బి. సి. 480 లో పారదోలాడు.

## ౧౪

ఆ మర్నాడు, ఒంటిగంట దాటినాక, ఎలీనా తోటలో ఓ పెట్టి ముందు నిల్చునిఉంది. ఆమె పెంచుతున్న రెండు సంకరజాతి కుక్కపిల్లలు ఆ పెట్టిలో ఉన్నాయి. (తోటకంచె పక్కన ఎవరో వదిలేసి వెడితే తోటమాలి కుక్కపిల్లల్ని లోపలికి తెచ్చాడు. చాకల్ది ఎలీనాకు అడివి జంతువులన్నా పెంపుడుజంతువులన్నా మహాయిష్టమని తోటమాలికి చెప్పింది. తోటమాలి ఆశించినట్లు వాడికి పావురూబులు బహుమానమిచ్చింది ఎలీనా) కుక్కలు బతికి బాగావున్నాయని నమ్మకం కుదుర్చుకోటానికీ, పక్కా తాజాగడ్డితో వేశారో లేదో తెలుసుకోటానికీ పెట్టెలోకి తొంగిచూసింది. చూపి వెనుదిరిగి కెవ్వుమంది. ఇన్సరోవ్ ఒంటరిగా సరాసరి ఆమె దగ్గిరికే వస్తున్నాడు.

“గుడ్ మార్నింగ్” అన్నాడు ఆమెని సమీపించి టోపీతీసేసుకుంటూ. ఎండకు అతను కమిలిపోవడం ఎలీనా గమనించింది. “ఆంద్రీతో కలిసివద్దామనుకున్నాగాని ఆతని కేదో పనుండి వుండిపోయాడు. నేనొక్కణ్ణే బయలుదేరొచ్చా. యింటో యెవరూ కనిపించలేదు నిద్రపోతున్నారో, తోటలో షికారుచేస్తున్నారో అనుకుని తోటలోకి వచ్చా.”

“క్షమాపణ చెబుతున్నట్టు మాటాడతావేం? అదంతా అనవసరం. నిను కలుసుకోవడమంటే మా అందరికీ మహా సంతోషంగావుంటుంది. ఆ చెట్టునీడను కూర్చుందాం పద”

చెట్టుకిందకి వెళ్ళి ఆమె కూర్చున్నది. ఆమెపక్కనున్న ఆసనంమీద కూర్చున్నాడు ఇన్సరోవ్.

"ఈమధ్య నువు యింటిదగ్గిర లేవటే?" అని అడిగింది.

"అవును. పనుండి వెళ్ళా. ఆండ్రీ చెప్పాడా?"

ఇన్సరోవ్ ఆమెకేసి చూపి మందహాసంచేసి టోపీ ఆడించసాగాడు. మందహాసంచేస్తూ కళ్ళుమిణకరించి పెదిమెలు ముందుకు విరిచాడు. ఇలా చేయడంవల్ల అతనికి ఉత్సాహం కల్గింది.

"బహుశా - నేను యెవరో రాక్షసిముండావాళ్లతో వెళ్లానని ఆండ్రీ చెప్పాడనుకుంటా" అన్నాడు ఇంకా మందహాసం చేస్తూనే.

ఎలీనా నిర్ఘాంతపోయి ఇన్సరోవ్‌తో నిజంచెప్పడమే మంచిదని 'ఔను' అంది నిబ్బరంగా.

"అయితే ననుగురించి యేవనుకుంటున్నా?" అని హఠాత్తుగా అడిగాడు.

ఎలీనా అతనికేసి కన్నెత్తిచూసి 'చేసేదేమిటో బాగా తెలుసుకునే చేస్తావనీ, నువు చెడుచేయలేవనీ అనుకుంటున్నా" అంది.

"సరే - కృతజ్ఞుణ్ణి. చూడు, ఎలీనా!" ఆమెకు నమ్మకం కలిగించేందుకు ఆమెకేసిజరిగి ఇంకా ఇలా చెప్పాడు: 'యిక్కడ మా దేశస్తులం కొద్దిమందున్నాం. మాలోకొందరికి చదువురాదు. కాని మాఅందరిదీ వొకటే లక్ష్యం. దానికే మా జీవితాలర్పిస్తున్నాం. దురదృష్టవశాత్తు యెవో పోట్లాటలు వస్తూనేవుంటాయి. మావాళ్ళందరూ నన్నెరుగుదురు. నను నమ్ముతారు. అందుకనే వో వ్యవహారం పరిష్కరించడానికి నాకోసం మనుష్యుల్ని పంపారు. నే వెళ్లాను."

"చాలాదూరం వెళ్లావా?"

"ట్రాయిట్స్కికి 40 మైళ్ళు, అక్కడ మఠంలో మావాళ్ళు కొంత మందున్నారు. యేమైనా నాశ్రమ వృథాపోలేదు. ఆ వ్యవహారం పరిష్కరించివచ్చా!"

"ఆ వ్యవహారమంత చిక్కయిందా?"

"ఆ-వాళ్ళల్లో వొకడు మొండికేశాడు. అప్పు తీర్చలా."

"యేవిటీ? ఆ పోట్లాటంతా డబ్బుకోసమేనా?"

"ఆ-అదైనా పెద్దమొత్తమేంకాదు. యెంతుంటుందనుకున్నా?"

“ఆ కాస్త భాగ్యానికి 40 మైళ్ళు వెళ్ళావా? మూడు రోజులు వృథాపుచ్చావా?”

“మనవాళ్లకి సంబంధించినపుడు అదేం మహాభాగ్యంకాదు ఎలీనా? వాళ్ళని నిరాకరించడం మహాపరాధం. నువ్వెన్నావే-నువ్వు కుక్కపిల్లల కైనా సహాయం నిరాకరించవు కదూ! అందుకే నిన్ను మెచ్చుకుంటూంట. వృథాపుచ్చిన కాలమంటావా, పరవాలేదు. యేదో విధంగా కూడగట్టు కుంటూ - మనకాలం మన వొక్కరిదేం కాదు.”

“మరెవరిదీ?”

“మనతో అవసరమున్న వారందరిదీ యిదంతా హఠాత్తుగా యెందుకు వెళ్ళగక్కానో తెలుసా? నీ అభిప్రాయ మెంతో విలువైందని భావిస్తుం డడంవల్ల. ఆంగ్రేడీ నీకెంత ఆశ్చర్యం కల్గించాడో వూహించుకోగలను”

“నా అభిప్రాయం విలువైదంటావా? యెందుకనేం?” అంది ఎలీనా మెల్లిగా.

ఇన్సరోవ్ తిరిగీ మందహాసం చేశాడు.

“నువు మంచిదానివి. ఈ ఘరానావాళ్లలాగాకాక ... అంటే.” కొంచెంసేపు విరామానంతరం ఎలీనా అంది:

“డిమిట్రీ! నాతో మర్మంవిడిచి మాట్లాడడం యిదే ప్రథమ పర్యాయమని నీకు తెలుసా?”

“యేమిటి? నా మనసులో వుంది దాచుకోకుండా నీతో యెప్పుడూ చెబుతూనే వున్నాననుకుంటూ.”

“లేదు. యిదే ప్రథమ పర్యాయం. యిలా జరగడం నాకెంతో సంతోషంగా వుంది. నేనూ దాపరికంలేకుండా నీతో మాట్లాడదలచాను. మాట్లాడ వచ్చా?”

ఇన్సరోవ్ నవ్వి “ఆ - మాట్లాడవచ్చు.” అన్నాడు.

“ముందే చెబుతున్నా. నాకు జిజ్ఞాస జాస్తి.”

“సరే - కానీ”

“ఆంగ్రేడీ నీ జీవితం గురించీ, నీ బాల్యం గురించీ బోలెడంత చెప్పాడు. ఒక మహాఘోరం జరిగిందనీ చెప్పాడు ... తర్వాత నువ్వు నీ జన్మభూమికి

వెళ్ళావు ... సరే - అడగరాని ప్రశ్న అయితే జవాబియ్యొద్దు - కాని వొక్క ఆలోచన నన్ను వేధిస్తోంది. అతన్ని కలుసుకున్నావా?"

ఎలీనా నిట్టూర్చింది. ధైర్యంగా ప్రశ్నించినందుకు సిగ్గుపడింది, ఆశ్చర్యపడిపోయింది. కళ్ళు కుంచించి ఇన్సరోవ్ ఆమెకేసి తదేకదృష్టితో చూచాడు. గడ్డంమీద వేళ్ళు పెట్టుకుని 'ఎలీనా'-అతనిస్వరం మామూలుగా కంటే ప్రశాంతంగావుంది. ఆ ప్రశాంతతకు ఆమె హడిలిపోయింది-! "ఎలీనా! నువ్వెవరిని గురించి ఆలోచిస్తున్నావో నాకు తెలుసు. లేదు, అతన్ని కలుసుకోలేదు. అసలు అతనికోసం వెదకనేలేదు. అతన్ని చంపడం న్యాయమని తలచికాదు - ప్రశాంతంగా అతన్ని చంపెయ్యగలను. జాతి జాతే పగదీర్చుకోవాలని చూస్తున్నపుడు...పగ! అదికాదు సరైనపదం. జాతివిముక్తి! అలాంటప్పుడు వ్యక్తులపగకి స్థానంలేదు. యివి వొకదాని కొకటి అడ్డువస్తాయి. సమయంవచ్చినపుడు అదీ జరుగుతుంది.' అన్నాడు తలాడిస్తూ.

ఎలీనా అతనికేసి ఓరచూపు చూసింది.

"నీ మాతృదేశాన్ని మహా ప్రేమిస్తావనుకుంటా" అన్నది భయ పడుతూ భయపడుతూ.

"ఇంకా నాకేం తెలీదు. మాతృభూమికోసం మనిషి ప్రాణాలర్పించి నపుడు, అపుడు చెప్పొచ్చు అతను జన్మభూమిని ప్రేమిస్తున్నాడని."

"బల్గేరియాకు తిరిగివెళ్ళే అవకాశం కోల్పోతే రష్యాలో జీవితం నీకు మహాభారంగా వుంటుందనుకుంటా."

ఇన్సరోవ్ కిందికిచూస్తూ 'భరించగలనని అనుకోను.' అన్నాడు.

"బల్గేరియా భాష నేర్చుకోవడం కష్టమా చెప్పు?"

"ఉహూఁ-మరేం కష్టంకాదు. బల్గేరియాభాష తెలీని రష్యన్లు సిగ్గు పడాలి. రష్యన్లకు స్లావ్ భాషలన్నీ తెలుసుండాలి. బల్గేరియా భాషలో గ్రంథాలు తెచ్చిపెట్టనా? మాభాష యెంత తేలికో నీకే తెలుస్తుంది. మాభాషలో అద్భుతమైన పాటలున్నాయి. సెర్బియాభాషలో వున్నంత గొప్పవి. సరే-కాస్త ఆగు. ఓపాట తర్జుమాచేసి వినిపిస్తా. అది...మా చరిత్ర కాస్తంతైనా తెలుసా?

"ఉహూ-బొత్తిగా తెలీదు."

"సరే - నీకు పుస్తకం తెచ్చిస్తా. అది చదివితే ప్రధానహంశాలు తెలుసుకోవచ్చు. ఇక యీపాటవిను...వినిపించడంకంటే తర్జుమాచేసి రాసి తీసుకోస్తేనే నయం. మమ్మల్ని ప్రేమిస్తావనే నా దృఢవిశ్వాసం - పీడిత ప్రజలందర్నీ నువు ప్రేమిస్తావు—...మా దేశం యెంత సౌభాగ్యవంత మైందో తెలుసా! అయితేనేం మా దేశాన్ని అణగదొక్కి పారేస్తున్నారు. నరకయాతనలు పెడుతున్నారు." అన్నాడు అయాచితంగా చెయ్యి విదిల్చి. ముఖం కందగడ్డయింది.

"మా సర్వస్వం దోచుకున్నారు. మా చర్చీలు, మా హక్కులు, మా భూములు, సర్వం కొల్లగొట్టారు. జంతువుల్ని వేటాడినట్టు మమ్మల్ని వేటాడారు. చిత్రవధచేశారు. ఆ టర్కీ వెధవలు!"

"డిమిట్రీ!" అని అరిచింది ఎలీనా.

అతను ఆగి "క్షమించు. యీ విషయాలు ప్రశాంతంగా మాట్లాడలేను. యిప్పుడేగదా అడిగావు. 'నీ జన్మభూమిని ప్రేమిస్తున్నావా?' అని. ఈ విశాల ప్రపంచంలో ప్రేమించడానికి యింకేముంది? దేవుడితర్వాత - నిర్వికల్ప మైందీ, సకలసందేహాలకు అతీతమైందీ, విశ్వసనీయమైందీ, యింకేముంది? అటువంటి మాతృదేశానికి అవసరమైనప్పుడు...చూడు, బల్గేరియాలోని ప్రతిరైతూ, ప్రతి ముష్టివాడూ, నేనూ - అందరం వొకటే కోరుకునేది. అందరిలక్ష్యం వొకటే. యిది మాకెంత ఆత్మవిశ్వాసం, యెంతబలం చేకూరుస్తుందో గుర్తించాలి."

ఇన్సరోవ్ వొక్క నిమిషం ఆగి మళ్ళీ బల్గేరియానుగురించి మాట్లాడడం ప్రారంభించాడు. అతను చెప్పేదంతా అతిశ్రద్ధతో, నిదానంగా, విచారంతో వింది. ఇన్సరోవ్ ముగించింతర్వాత తిరిగీ అడిగింది.

"యేమైనాసరే నువు రష్యాలో వుండవన్నమాట!"

అతను వెళ్ళిపోయినాక అతనువెళ్ళినదిక్కే చాలాసేపు తేరిపార జూచింది. ఆ రోజున అతనూ ఆమెదృష్టిలో మారిపోయాడు. రెండుగంటల కితం తనదగ్గిర శెలవుపుచ్చుకున్న మనిషి కాదితను!

ఆనాటినించీ ఇన్సరోవ్ తరుచు ఎలీనాను చూడడానికి వెళ్లసాగాడు. బెర్సెనీవ్ రాక తగ్గింది. స్నేహితులిద్దరిమధ్యా యేదో తెలీని అనుభూతి పెంపొందసాగింది. ఇలా ఓనెల గడిచిపోయింది.

# ౧౫

అన్నావాసిలెవ్నాకు ఇంటి దగ్గిర ఉండడమే ఎక్కువ ఇష్టమని పాఠకులకు తెలిసిన విషయమే. కాని అప్పుడప్పుడు హఠాత్తుగా ఏదో అపూర్వమైన పని చేయాలనీ, వినోదయాత్రకు బయలుదేరాలనే కోరిక అణుచుకోలేనంత ప్రబలమయేది. ఈ వినోదయాత్రలో కష్టాలు ఎక్కువైన కొద్దీ, దీనికి కావలసిన సన్నాహాలు ఎక్కువైనకొద్దీ అన్నా అంత హడావిడ చేసేది. సంతోషించేది. ఈ చిత్తవృత్తి ఆమెని శీతాకాలంలో లోబర్చుకుంటే ఏ నాటకానికో టిక్కెట్లు ముందుగానే కొని స్నేహితులందరినీ పోగుచేసుకుని వెళ్ళేది. వేసవికాలంలో వినోదయాత్రకు ఎక్కడికన్నా-ఎంత దూరంగా వెడితే అంత సంతోషించేది. ఆ మర్నాడు తలనొప్పి వచ్చిందని మూలుగుతూ పడుకునేది. కాని మళ్ళీ ఏ రెండు నెల్లకో అసాధారణమైన పని ఏదో చేయాలనే కోరిక తిరిగీ రేకెత్తేది. అలాంటి కోరికే ఇపుడు రేకెత్తింది. ఆమెముందు ఎవరో జారిట్సినో సుందర దృశ్యాలను గురించి ప్రస్తావించారు. వెంటనే 'ఎల్లుండి' అక్కడకు ప్రయాణమై వెళ్లదలచానని చెప్పింది - దానిమీద ఇంటిల్లిపాదీ హడావిడి పడ్డారు. నికొలాయ్‌ని తీసుకురావటానికి ఒకడు మాస్కో ఉరుక్కుంటూ పరుగెత్తాడు. అతనితో వంటవాడుకూడా సారా, మాంసం, తదితర సామగ్రి కొనడానికి పరుగెత్తాడు. బగ్గీ ఒకటి అద్దెకు తీసుకొమ్మనీ, అంచెగుర్రాలు సిద్ధంగా ఉండే ఏర్పాటు చేయమనీ షూబిన్‌కి ఆదేశాలు వచ్చాయి. నౌకరు కుర్రాడు రెండుసార్లు బెర్సెనీవ్, ఇన్సరోవ్‌ల దగ్గిరికి జోయా రాసిన ఆహ్వాన పత్రికలు పట్టుకుని పరిగెత్తాడు. మొదటి పత్రిక రష్యన్ భాషలో,

రెండోది ఫ్రెంచి భాషలో జోయా రాసింది. ప్రయాణంలో యువతులు ధరించాలసిన దుస్తుల విషయమై అన్నా జాగ్రత్త తీసుకుంది.

ఇంతలో ఈ ఏర్పాట్లన్నీ వమ్మైపోయాయి. నికొలాయ్ మాస్కో నుంచి చికాకుతో, కోపంతో, నిస్పృహతో తిరిగి వచ్చాడు. (ఇంకా అవగస్టినా క్రిస్టియనోవ్నామీద చిరచిరలాడుతూనే ఉన్నాడు.) తిరిగివచ్చి హంగామా అంతా ఎందుకో తెలుసుకున్నాక తాను బయలుదేరనని ఖచ్చితంగా చెప్పేశాడు. కంట్సోవోనుంచి మాస్కోకు, మాస్కోనుంచి జారిట్సినోకు, తిరిగి జారిట్సినోనుంచి మాస్కోకు, మాస్కోనుంచి కంట్సువోకు రావడం హాస్యాస్పదంగా వుంటుందనీ, భూగోళంమీద ఒక చోట కంటె ఇంకోచోటు ఎక్కువ సంతోషప్రదంగా ఉంటుందని ఎవరైనాసరే నిరూపిస్తే బయలుదేరుతాననీ చెప్పాడు. ఎవరూ ఇది నిరూపించలేకపోయారు. తగినతోడులేదని అన్నా ప్రయాణం మానుకుందామనుకుంటున్న సమయంలో యువార్ ఇవనోవిచ్ జ్ఞాపకం వచ్చాడు. 'నీటమునిగేవాడికి గడ్డిపరకే మహావృక్షం' అని అన్నా యువార్ కోసం కబురంపింది. యువార్ నిద్రలేచి కిందికి దిగివచ్చి నోరు మెదపకుండా అన్నా చెప్పినదంతా విని వేళ్ళు ఆడించి ప్రయాణమవడానికి అంగీకరించాడు. అందరూ ఆశ్చర్యపోయారు. అన్నా అతనిని బుగ్గమీద ముద్దుకుంటుంది. నికొలాయ్ వికటంగా నవ్వి *'క్వాలీ బోర్డి' అన్నాడు. (ఫ్రెంచి నానుడులు సంభాషణలలో ఉపయోగించడమంటే అతనికి సర్దా).

మర్నాటి ఉదయం ఏడుగంటలకి బగ్గీ, బండీ స్టహోవ్ ఇంటి ఆవరణలోనుంచి బయలుదేరాయి. బండీలో ఆడవాళ్లూ, బెర్సెనీవ్, దాసీ కూర్చున్నారు. ఇన్సరోవ్ బండీ పెట్టిమీదకూర్చున్నాడు. షూబిన్ యువార్ బగ్గీలో ఎక్కాడు యువార్ షూబిన్‌ను తనపక్కన వచ్చి కూర్చోమని వేలుతో సైగజేశాడు. దారిపొడుగూతా షూబిన్ తన్ను వేపుకుతింటాడని అతనికి తెలుసు. కాని ఆ 'యశర్మరాజు' మధ్యా, ఆ యువశిల్పి మధ్యా విచిత్రమైె బంధనం, మనసులోవున్నది నిష్కపటంగా మొహంమీద అనుకునే ఒక సామ్యం, ఏర్పడింది. ఈతడవ షూబిన్ ఆ బొండాంను ఏడిపించలేదు. ప్రశాంతంగా, సౌమ్యంగా, పరధ్యానంగా కూర్చున్నాడు. జారిట్సినో

---

* కథ కంచి కెళ్ళింది.

జీర్ణదుర్గం చేరుకు నేసరికి చాలా పొద్దెక్కింది. ఆకాశం మేఘరహితంగా ఉంది. మిట్టమధ్యాహ్నమైనా జారిట్సినో జీర్ణదుర్గం అంధకారబంధురమై భీతిగొల్పుతోంది.

అంతా పచ్చికమీద దిగి వెంటనే బయలుదేరారు. ఎలీనా, జోయాలు ఇన్సరోవ్‌తో ముందు నడుస్తున్నారు. వెనుక అన్నావాసిలెవ్నా పరమానందంతో యువార్ బుజంమీద చెయ్యివేసి నడుస్తోంది. యువార్ రొప్పుతూ అతికష్టంమీద అడుగులువేస్తున్నాడు. కొత్త గడ్డిహాటు నుదురు మీదికి ఒరిగింది. అరికాళ్ళు మండుతున్నాయి. అయినా ఉల్లాసంగానే ఉన్నాడు. షూబిన్, బెర్సెనీవ్‌లు చివరఉన్నారు. "సరే - మనం మంచి అనుభవంగల సిపాయిల్లాగా చివరఘుందాం" అని బెర్సెనీవ్ చెవిలోఊదాడు షూబిన్. 'ఇక బల్గేరియా! అదిగో.అందరికన్నా ముందు నడుస్తోంది' అని తిరిగీ అన్నాడు షూబిన్ ఎలీనాకేసి తలాడిస్తూ.

వాతావరణం బహుపసందుగా ఉంది. ఆ ప్రదేశమంతటా పుష్పాలు వికసించాయి. పక్షులమధుర గానం,కీటకాల ఝుంకారం విన్పిస్తోంది.దూరాన సరోవరాలు తళుక్కుమంటున్నాయి. అందరికీ ఆరోజు ఓ పండగలాగా ఉంది. 'ఓ బలే! బలే!' అనసాగింది అన్నా. ఆమె ఇలా బలే, బలే అని పొగడుతూంటే అంగీకారసూచకంగా యువార్ తలాడించసాగాడు. ఒక్కమాటుమాత్రం "పొగడడానికి మాటలే దొరకడంలేదు." అని అనగలిగాడు. ఎలీనా ఇన్సరోవ్‌లు మధ్యమధ్య ఏదో మాటాడుకోసాగారు. జోయా రెండువేళ్ళతో హాటుఅంచు పట్టుకుని కులుకుతూ బూడిదరంగు బూటు కాళ్ళను పట్టుకుచ్చులలో నించి ముందుకు జాడించి నలువైపులా చూసింది. 'అహో!' అన్నాడు షూబిన్ హఠాత్తుగా మందస్వరంలో. "అదిగో జోయా చుట్టూచూస్తోంది. వెళ్ళి కలుసుకుంటా. ఎలీనా ఈమధ్య నన్ను అలక్ష్యంచేస్తూ నిను పూజిస్తోందిగా! సరే - వెడతా - యిదివరకైందిచాలు! ఇక నువ్వు - నువ్వు యీ అడవిపువ్వుల్ని పరిశీలించడం మంచిది. నీ పరిస్థితిలో యింతకన్న చేసేదేముంది! అదీగాక యీ పరిశీలన శాస్త్రదృష్ట్యా కూడా చాలా విలువైంది. శెలవు." అని తుర్రుమని వెళ్ళి జోయాకు చెయ్యి అందించి ముందుకు లాక్కుచక్కాబోయాడు. ఎలీనా ఆగి బెర్సెనీవ్‌ని పిలిచి చేయిపట్టుకుంది. కాని ఇన్సరోవ్‌తో సంభాషణ

కొనసాగిస్తూనే ఉంది. బల్గేరియాభాషలో ఉత్పలపుష్పాన్ని, సిందూర వృక్షాన్ని, గంగిరేణిని, నిమ్మచెట్టుని...ఏమంటారని అడిగింది. 'ఆ-బల్గేరియా!' అనుకున్నాడు అండ్రీ విచారంగా.

ముందునించి హఠాత్తుగా కేక వినిపించింది. అంతా ముందుకు చూసారు. జోయా షూబిన్ సిగరెట్టుకేసు తీసుకుని ఒక పొదలోకి విసిరి పారేసింది. 'సరే వుండు నీపనిపట్టిస్తా!' అని ఆ సిగరెట్టుకేసును పట్టుకో టానికి దానివెంటబడ్డాడు షూబిన్. సిగరెట్టుకేసు తీసుకుని తిరిగి ఆమెదగ్గిరకి వచ్చాడు.ఆమెను సమీపించాడో లేదో మళ్ళీ సిగరెట్టుకేసు దారివెంట గిర్రున తిరుగుతూ పరిగెట్టింది. ఇలా అయిదుసార్లు తమాషాజరిగింది. షూబిన్ నవ్వుతూ జోయాను బెదిరిస్తూనే ఉన్నాడు. జోయా కొంటెగా మందహాసం చేస్తూ పిల్లిపిల్లలా బుజాలు ఎగరవేస్తూ తనపని తాను చేస్తూనే ఉంది. చివరికి షూబిన్ ఆమె చేతివేళ్ళు పట్టుకుని గట్టిగా నలిపేశాడు. ఆమె కెవ్వుమని కేకేసింది. చాలాసేపటివరకు చేతిమీద ఊదుకుంటూ బాధపటు తున్నట్టు నటించింది. షూబిన్ అంతసేపూ ఆమె చెవిలో ఏవో తియ్యటి మాటలు చెప్పుతూనే ఉన్నాడు.

"అల్లరి పిల్లలు!" అంది అన్నా సంతోషంతో.

యువార్ చేతివేళ్ళు ఆడించాడు.

"జోయాను గురించి నువ్వేమనుకుంటున్నా?" అని ఎలీనాను అడిగాడు బెర్సెనీవ్.

"షూబిన్‌ను గురించి నువ్వేమనుకుంటా?" అని సమాధాన మిచ్చింది ఎలీనా.

ఇంతలో బృందమంతా వేసంగి గృహం సమీపించి జారిట్సినో సరోవర దృశ్యాలను అభివర్ణిస్తూ నిలబడిపోయారు. ఆ సరోవరాలు ఒకదాని వెనక ఒకటిగా అనేకం వ్యాపించి ఉన్నాయి. వాటి అవతల కీకారణ్యాలు. ప్రధాన సరోవరంవరకు కొండమై పున వ్యాపించిన పచ్చిక, నీటికి విపరీతమైన మరకతవర్ణం కలగజేసింది. ఒక్క కెరటమైనా కదలడంలేదు. నీటిఅంచున నురుగైనాలేదు. నీరు ఎక్కడా తొణికిసలాట్టమైనాలేదు. పెద్దగిన్నెలో గడ్డకట్టుకు పోయి తళతళలాడే పెద్ద గాజుముద్దలా ఉంది నీరు. ఆకాశం ఆ సరోవరం లోపలికి చొచ్చుకుపోయినట్టుంది. పచ్చటిచెట్లు స్వచ్ఛమైన

ఆ నీటిలో తమ నీడలు చూసుకుంటున్నాయి. చాలసేపు మౌనంగా నిలబడి అందరూ ఆ దృశ్యాన్ని మెచ్చుకోసాగారు. ఘూబిన్ మెదలలేదు. జోయా ఆలోచనలో పడింది. కొంతసేపటికి నౌకా విహారం చేయాలని అందరికీ ఒక్కమాటే ఉద్దేశం కలిగింది. ఘూబిన్, ఇన్సరోవ్, బెర్సెనీవ్ లు ఒకరికంటె ఒకరు ముందు వెళ్ళాలని ఉరుకుతూ దిగువకు వెళ్ళి రంగు వేసిన ఓ పడవనీ ఇద్దరు పడవవాళ్లనీ తీసుకొచ్చి తక్కినవారిని రమ్మని పిల్చారు. ఆడవాళ్లంతా దిగివెళ్ళారు. యువార్ వారివెనక అతిజాగ్రత్తగా అడుగులో అడుగువేసుకుంటూ బయలుదేరాడు. అతను పడవలో ఎక్కుతూంటే అంతా గొల్లుమని నవ్వారు. "మమ్మల్ని ముంచెయ్యకేం బాబూ" అన్నాడు సొట్టముక్కు పడవవాడు. 'యేమిటీ?' అన్నాడు యువార్. పడవ బయలుదేరింది. యువకులంతా తెడ్లు చేతబట్టారు. అంతా కలిసి రష్యన్ పాట పాడదామని ఘూబిన్ 'వోల్గానదీమ తల్లి దిగువను' అని ఎత్తుకుని పాడ నారంభించాడు. బెర్సెనీవ్, జోయా, అన్నాకూడా గొంతు కలిపారు. (ఇన్సరోవ్ పాడలేదు) కాని తొందర్లోనే లయ తప్పింది. మూడో చరణం మరీ తబ్బిబ్బయిపోయింది. ఒక్క బెర్సెనీవ్ మాత్రం ఆపకుండా మంద్ర స్వరంలో పాడుతున్నాడు: "కెరటాలలో కనిపించదేవీ..."

కాని తొందరలోనే అతనూ కంగారు పడ్డాడు. పడవవాళ్ళు కను సైగలు చేసుకుని మెదలకుండా ఇకిలించారు.

"మనకి సంగీతం వచ్చినట్టే కనిపించదు. కాదూ?" అన్నాడు ఘూబిన్ పడవవాళ్ళకేసి తిరిగి. సొట్టముక్కు పడవవాడు తలమాత్రం ఆడించి ఊరుకున్నాడు.

"కాస్త ఆగండి. పాడి చూపిస్తాం. జోయా! వో పాటపాడూ. తెడ్లు ఆపండోయ్!" అన్నాడు. తెడ్లు పక్షి రెక్కలలాగా గాలిలోకి లేచి కదలకుండా నిలబడ్డాయి. వాటినుంచి నీరు మధురగానం చేసు కుంటూ పారుతోంది. హంసలాగా పడవ కొంచెంసేపు తేలియాడి ఆగింది. తర్వాత కొద్దిగా ఒకవైపుకు ఒరిగింది. జోయా పాటపాడటం తన కిష్టం లేనట్టు నటించింది. కాని అన్నా ప్రోత్సాహం మీద వోటు తీసిపారేసి పాట మొదలుపెట్టింది.

ఆమె సన్ననిగొంతు నీటి ఆవలికికూడా వ్యాపించింది. దూరాన ఉన్న అడవుల్లో ప్రతిముక్కకూ ప్రతిధ్వని బయలుదేరింది. ఆ ప్రతిధ్వని స్పష్టంగా ఉండి ఏదేవకన్యో పాడుతున్నట్టు అందరికీ అనిపించింది. జోయా పాట ముగించేసరికి ఆ సరోవరం పక్కనవున్న ఓ వేసవి గృహంలోంచి 'భేష్!' అని బిగ్గరగా వినిపించింది. జారిట్సినోలో తాగి తందనాలాడుతున్న ఓజర్మన్ జట్టు పరుగెత్తుకుంటూ బయటికివచ్చింది. వారందరివీ కందగడ్డ మొహాలు. కొందరికి చొక్కాలులేవు. కొందరికి టై లేదు. కొందరికి వేస్టు కోటులేదు.

ఇలా పరుగెత్తుకుంటూ వచ్చి *'ఎన్ కోర్' అంటూగట్టిగా కేకలు వేశారు. అన్నా భయపడి అవతలివొడ్డుకు తొందరగా పడవ నడపమన్నది. కాని పడవ అవతలిఒడ్డుకు చేరేలోపల యువార్ కి మిత్రులందరికీ ఆశ్చర్యం కల్గించాలని బుద్ధిపుట్టింది. అడవుల్లో ప్రతిధ్వని స్పష్టంగా విన్పిస్తోందని గ్రహించి కోలంకిపిట్ట కూతను అనుకరించసాగాడు. మొట్టమొదట అంతా ఉలిక్కిపడ్డారు. తర్వాత యువార్ అతి సహజంగా కోలంకిపిట్ట అరుపును అనుకరించడం చూసి నిజంగా సంతోషించారు. అంతా సంతోషించినందుకు పొంగిపోయి యువార్ పిల్లి అరుపు మొదలుపెట్టాడు. పిల్లి అరుపు అంతసహజంగా అనుకరించలేక తిరిగీ ఇంకోసారి కోలంకిపిట్టను అనుకరించి ఆతర్వాత మౌనవ్రతం అవలంబించాడు. షూబిన్ అతనిమీదపడి ముద్దెట్టుకోబోయాడు గాని యువార్ అతన్ని తోసిపారేశాడు. సరిగ్గా ఆ సమయానికే పడవ ఒడ్డుచేరింది. అందరూ దిగారు.

ఈలోపున బండివాడు, నౌకరు, దాసి బండీలోంచి తట్టలతో భోజనం తెచ్చి ఓ నిమ్మచెట్టుకింద సిద్ధంచేశారు. పచ్చికమీద పరిచినగుడ్డ చుట్టూ అందరూ చేరి ఆరగించ నారంభించారు. అందరికీ దిట్టంగా ఆకలేస్తోంది. అన్నావాసిలెవ్నా ఇంకాస్త ఇంకాస్త తినమనీ పదార్థాలు రుచిగావున్నాయి, ఇంకాస్త తినండనీ చల్లగాలిలో తినడం మహామంచిదనీ అతిథులను ప్రోత్సహించింది. యువార్ ని కూడా ఇలానే ప్రోత్సహించింది. యువార్ నోటి నిండా ముద్దపెట్టుకుని 'నువేం బెంగెట్టుకోక' అన్నాడు. 'భగవంతుడు మనకీలాంటి సుదినం ప్రసాదించాడు!' అనసాగింది అన్నా. ఆమె పూర్తిగా

* వన్సుమోర్.

మారిపోయినట్టు ఇరవైయేళ్ళు చిన్నదైనట్టు కనిపించింది. బెర్సెనీవ్ ఆమెతో ఈముక్కే అన్నాడు. 'అవునవును. నేనూ ఒకప్పుడు అందగత్తె ననిపించుకున్నా. యెంతమందిలో వున్నా అందరిదృష్టీ నామీదే వుండేది' అంది. షూబిన్ జోయా పక్కనకూర్చుని ఆమెకిసారా అందియ్యబోయాడు. జోయా నిరాకరించింది. ఆ సారా తానుతాగేసి తిరిగి ఆమెకు సారా అందియ్యబోయాడు. ఆమె తొడమీద తలపెట్టుకుని పడుకుంటానన్నాడు. కాని అంతటి చనువు అతని కివ్వడానికి జోయా సుతరాం ఒప్పుకోలేదు. అందరిలో ఎలీనా ఒక్కతీ గంభీరంగా ఉంది. ఆమె హృదయంలో అమితప్రశాంతత - ఇటీవల తానెన్నడూ అనుభవించనంతటి ప్రశాంతత - తాండవిస్తోంది. ప్రతి ఒక్కరిమీదా అంతులేని సుహృద్భావం ఆమె హృదయంలో అలముకొన్నది. ఇన్సరోవ్‌నే కాదు, బెర్సెనీవ్‌నీ తనపక్క కూర్చోమని కోరింది...దీని అర్థం గ్రహించి ఆంద్రీ చాటుగా ఒక్క నిట్టూర్పు విడిచాడు.

గంటలకి గంటలు గడిచిపోయాయి. సాయంకాలం కావచ్చింది. అన్నావాసిలెవ్నా హఠాత్తుగా ఆదుర్దాపడి "అబ్బ! యెంత పొద్దుగడిచిపోయింది లెండి. లెండి. మనం తాగాం, తిన్నాం. యిక చేతులు కడుక్కుందాం" అంటూ హడావిడిగా లేచింది. అందరూ హడావిడిగా లేచి దుర్గంకేసి నడక సాగించారు. బండీ, బగ్గీ అక్కడ వీరికోసం వేచి ఉన్నాయి. సరోవరాల పక్కగా వెడుతూ ఇంకోమారు జారిట్సినో సుందర దృశ్యాలు చూడడానికి ఆగారు. సాయంకాలపు అరుణకాంతులు ఎల్లెడలా వెలిగిపోతున్నాయి. ఆకాశం ఎర్రబారింది. గాలికి ఆకులు అల్లల్లాడుతూ రకరకాల రంగులు విరజిమ్ముతున్నాయి. సరోవరాలలోని నీరు కరిగించిపోసిన బంగారంలా తొణికిసలాడుతోంది. వేసవిగృహాల బురుజుల ముదురు గోధుమవర్ణానికి, చెట్లచిక్కనిపచ్చరంగుకూ ఎక్కడా సామ్యం కన్పించడంలా. 'శెలవు. జారిట్సినో! ఈ రోజును యెన్నడూ మరిచేపోం' అన్నది అన్నా. సరిగ్గా ఆ సమయాన ఆమె ఆఖరి మాటలకు బలం చేకూర్చేందుకో అన్నట్లు ఒక విచిత్ర సంఘటన, మరచేపోదామన్నా మరపుకురాని సంఘటన జరిగింది.

ఏం జరిగిందంటే: జారిట్సినోను సంబోధించి రెండుముక్కలు అన్నా అన్న వెనువెంటనే ఆమెకి నాలుగడుగుల దూరంలో ఉన్న ఓ పొదరింటినించి నవ్వులు, చప్పట్లు గందరగోళంగా వినిపించాయి. అంతకు ముందు తప్పతాగి జోయా సంగీతాన్ని ఎంతో మెచ్చుకున్న జర్మన్లు ఇంకా ఒళ్లుతెలిని స్థితిలో దారికి అడ్డంగావచ్చి ఆడవాళ్లను చూడగానే ఆగిపోయారు. అందులో ఒకడు ఎద్దుమెడలాంటి మెడా, పత్తికాయల్లాంటి గుడ్లూ వాడూ. ముందుకువచ్చి వంగి వంగి నమస్కరిస్తూ ఊగుతూ అన్నా వాసిలెవ్నాను సమీపించాడు. అన్నా కొయ్యబొమ్మలా నిల్చుండి పోయింది.

"*'బాన్‌జోర్', మదాం, బాగున్నారా?" అన్నాడు జర్మన్ భాషలో. అన్నా వెనక్కి అడుగువేసింది. "వన్సుమోర్ అని మేమంతా కేకలేసి భేష్ భేష్ అని పొగడితే మళ్ళీ యెందుకు పాడలేదూ?" అని ప్రశ్నించాడు వచ్చీరాని రష్యన్ భాషలో.

"అవును. యెందుకు పాడలా?" అని తక్కిన జర్మన్లు తమ సహచరుని అనుకరిస్తూ కేకలు వేశారు.

ఇన్నరోవ్ ముందడుగు వేయబోయాడుగాని షూబిన్ అతన్ని ఆపి తానువెళ్ళి అన్నాముందు నిలబడ్డాడు రక్షకునిలా.

"సరే - మాటాడ నివ్వండి. మీ ప్రవర్తన మాకు అత్యాశ్చర్యం కలిగించింది. నేను వూహించకల్గినంతవరకు మీరు కకేసియన్ జాతిలో సాక్సను శాఖకు చెందిన వారనుకుంటా. అందుచేత మీకు సాధారణ మర్యాదలు తెలిసే వుంటాయి. అయినప్పటికీ నువ్వు పరిచయంలేని స్త్రీని పలకరించడం ప్రారంభించావు. యింకెప్పుడన్నా అయినట్లయితే శిల్పినైన నేను సంతోష పూర్వకంగా నీ పరిచయం యింకా యెక్కువగా చేసుకోవాలని తలచేవాణ్ణే. నీ కండరాల పొందిక బహు చక్కగా వుంది. నిన్ను ఆదర్శంగా పెట్టుకుని శిల్పాలు తయారుచేయడం మహానందంగా పరిగణించేవాణ్ణి. కాని ప్రస్తుతం దయయుంచి మా దోవను మమ్మల్ని పోనీ" అన్నాడు.

తల ఓ వైపుకువంచి, తుంటిమీద చేతులుపెట్టుకుని అసహ్యాభావంతో షూబిన్ చెప్పిందంతా విని ఆ జర్మను "నువు చెప్పిందేదిటో నాకేం అర్థం

---

* గుడ్ మార్నింగ్.

కాలా. నేనేం బూట్లు కుట్టేవాణ్ణనుకున్నావా? గడియారాలు బాగుచేసే వాణ్ణనుకున్నావా? నేను ఆఫీసర్ని, ఆఫీసర్ని! తెలిసిందా?" అన్నాడు.

"నాకేం సందేహంలేదు..." అనబోయాడు ఖూబిన్.

"అదేమిటో నే చెబుతానుండు." అని తోవ కడ్డంగాపడ్డ చిన్న కొమ్మను తీసిపారేసినట్టు అతను ఖూబిన్‌ను పక్కకు తోసేశాడు. 'మేం వన్సుమోర్ అంటె మళ్ళీ యెందుకు పాడలా? సరే - ఈ నిమిషంలో వెళ్ళిపోతా. కాని ఈ పిల్ల - యీవిడకాదు, కాదు ... యీ పిల్లన్నా, యీ పిల్లన్నా(ఎలీనా, జోయాలను చూపించి)వొక్క *'ఈనెన్‌కన్' యిచ్చి తీరాలి - వొక్క ముద్దు. మరేం పర్వాలేదు."

" 'ఈనెన్‌కన్' మరేం పర్వాలేదు-" అంటూ అతనిని అనుకరించారు తక్కిన జర్మన్లు.

జోయా ఇన్సరోవ్ చెయ్యి గట్టిగా పట్టుకుంది. కాని అతను విదిలించుకుని తిన్నగా వెళ్ళి ఆమోటు అహంకారి ముందు నిలబడి "దయ యుంచి వెళ్ళిపో" అన్నాడు మెల్లిగా. మెల్లిగా అన్నా అతని స్వరంలో తీవ్రత గోచరించింది.

ఆ జర్మను విరగబడి నవ్వి "వెళ్ళిపోవాలేం? నా కిదంతా సరదా. మేం మాత్రం షికారు చేయకూడదూ? వెళ్ళి పొమ్మంటంలో నీ అభిప్రాయ మేమిటి? యెందుకూ?"

"యెందుకా? స్త్రీని అపమానించినందుకు." అన్ని ఇన్సరోవ్ హఠాత్తుగా తెల్లబోయాడు. మళ్ళీ అన్నాడు: 'యెందుకా? - తప్పతాగి వున్నందుకు.'

"యేమిటి? నేను తప్పతాగానా? విన్నారా! నన్ను...ఆఫీసర్ని... నన్ను తప్పతాగానంటున్నాడు. వీడి కెన్ని గుండెలున్నయ్ ... నే నూరు కోను ... వొక్క చిన్నముద్దు యిస్తేనే..."

"యింకో అడుగు ముందుకువేశావో" అన్నాడు ఇన్సరోవ్.

"సరే-అడుగు ముందుకువేస్తే యేం జేస్తావేం!"

---

* చిన్నముద్దు.

"యేంజేస్తానా! నీళ్లల్లో పారేస్తాను."

"నీళ్ళల్లోనే: ఒహో! యింతేనా! సరేచూద్దాం. యేమాత్రం పారేస్తావో చూద్దాం."

'ఆఫీసరు' చెయ్యిఎత్తి ముందుకు ఒంగాడు. కాని సరిగ్గా ఆసమయానికి ఓ విచిత్రసంఘటన జరిగింది. ఆ ఆఫీసరు మూలిగాడు. 'అతని స్థూలకాయం ఊగిపోయింది. పైకిలేచింది. కాళ్ళు తన్నుకుంటున్నాయి. ఆడవాళ్ళు కెవ్వుమ నేలోపున, ఏం జరిగిందో తెలుసుకు నేలోపున, ఆ ఆఫీసరు స్థూలకాయం బుడుంగ్ మని పెద్దగా ధ్వనిచేస్తూ నీళ్ళలో మునిగి అదృశ్యమై పోయింది.

'ఓ' అని ఒక్కమాటు ఆడవాళ్లంతా కెవ్వుమని కేకేశారు.

*"మీన్ గాట్" అన్నారు తక్కినజర్మన్లంతా.

ఓ నిమిషం గడిచింది...గుండ్రటి తల నీళ్లల్లోంచి బయటికి కనిపించింది. వెండ్రుకలు తడిసి అంటుకుపోయాయి. బుడగలు ప్రవహిస్తున్నాయి. రెండుచేతులు వణుకుతూ నోటిని గట్టిగాపట్టుకున్నాయి.

"మునిగిపోతున్నాడు. రక్షించు రక్షించు" అని అన్నా కేకేసింది, పంగజాపి దీర్ఘంగా నిశ్వసించి ఒడ్డున నిల్చున్న ఇన్సరోవ్‌ని సంబోధించి.

"యీదుకుంటూ వాడే వస్తాడులే" అన్నాడు ఇన్సరోవ్ అసహ్యభావంతో, నిర్దయతో, ఉదాసీనతతో.

"యిక వెడదాం పదండి" అని అన్నా చెయ్యిపుచ్చుకుని 'రాండి, యువార్ ఇవనోవిచ్, ఎలీనా నికోలయెవ్నా!' అన్నాడు.

ఒడ్డున ఉన్న మొక్కలను ఎలాగైతేనేం పట్టుకుని 'హో' అని ఏడ్వసాగాడు ఆ ఆఫీసరు. ఇన్సరోవ్ వెనక అందరూ బయలుదేరారు. తోవలో ఆ జర్మన్ల జట్టును దాటివెళ్ళాలి. నాయకుని కోల్పోయిన ఆ జర్మన్లు దిగజారిపోయి ఒక్కమాటన్నా అనలేకపోయారు. అందరిలోకీ ధైర్యస్థుడొక్కడుమాత్రం 'సరే! భగవాన్...దేనికైనా హద్దంటూ వుండాలి' అన్నాడు ఇంకొకడు హాటుతీసేసుకున్నాడు. వాళ్లకంటికి ఇన్సరోవ్ అజేయుడుగా కన్పించాడు. అందుకు కారణం లేకపోలేదు.

* అరి దేవుడా!

అతనిమొహం భయంకరరూపం తాల్చింది. క్రూరత్వం తాండవిస్తోంది. జర్మన్లు తమసహచరుని బయటికి లాగడానికి పరుగెత్తారు. నేలమీద అడుగుపెట్టగానే ఆ ఆఫీసరు ఆ రష్యన్ 'పుండాకోర్లను' శాపనార్థాలు పెట్టి కైజరు చక్రవర్తితో స్వయంగా చెప్పి వాళ్లపనిపట్టిస్తానని కేకలేశాడు.

ఆ రష్యన్ 'పుండాకోర్లు' అతడి కేకలు లక్ష్యంపెట్టకుండా త్వరత్వరగా దుర్గంకేసి నడవసాగారు. దారిలో ఒక్కరూ మాట్లాటలేదు. అన్నా మాత్రం నెమ్మదిగా నిట్టూర్చింది. కాని బళ్ళదగ్గిరకి చేరుకోగానే ఆపుకోలేనంత నవ్వువచ్చి అంతా విరగబడి నవ్వసాగారు. ఖూబిన్ కీచుమని పిచ్చిగా నవ్వటంప్రారంభించాడు. తర్వాత బెర్సెనీవ్ దగ్గుతికతో కోడి కూతలాగా నవ్వాడు. జోయా కిలకిలా నవ్వింది. అన్నా నవ్వీనవ్వీ వణికిపోయింది. ఎలీనా మందహాసంచేసింది. చివరికి ఇన్సరోవ్ కూడా ఆపుకోలేక నవ్వేశాడు. కాని అతిపిచ్చిగా, అతిబిగ్గరగా, ఎక్కువసేపు నవ్వీందల్లా యువార్. కడుపుచెక్కలయ్యేలా నవ్వాడు. దగ్గాడు. తుమ్మాడు. 'నేననుకున్నా...' కన్నీళ్ళు కారాయి. కొంచెం శాంతపడి 'నేననుకున్నా... యేవిటా చప్పుడు - యేవిటి? అతను. అల్లా వెలికింతలా' ఆఖరిమాటలు వణుకుతూ అన్నాడో లేదో మళ్ళీ నవ్వు తెరవచ్చింది. జోయా అగ్నిలో సమిధలు వేసింది. 'పైన కాళ్ళు...' అంది. 'అవును. కాళ్ళు, కాళ్ళు, తర్వాత బుడింగ్, బుడింగ్'— 'అయితే యెలా తోసేసాడంటావ్, ఆజర్మనీ వాడు ఇన్సరోవ్ కంటె మూడింతలు లావున్నాడే?' 'నే చెబుతావిను. అంతా చూచా' అన్నాడు యువార్ కన్నీళ్ళు తుడుచుకుంటూ. 'నడుం పట్టుకుని పిల్లిమొగ్గ వేయించేశాడు...అబ్బ! బుడుంగ్! నే విన్నాను. యేవిటా అనుకున్నా. యింతాజేస్తే అతనూ...బుడుంగ్!'

బళ్ళు బయలుదేరాయి...దుర్గం కనుచూపుమేరలో కనిపించడంలేదు. అయినా యువార్‌కి ఇంకా నవ్వాగడంలేదు. చివరికి ఎట్లాగైతేనేం అతని పక్కనకూర్చున్న ఖూబిన్, అప్పటిదాకా పిచ్చిగా నవ్వుతున్నందుకు సిగ్గుపడేటట్లు చేశాడు.

కాని ఇన్సరోవ్ హృదయంబాధపడింది. బండిలో ఎలీనాకు ఎదురుగా మెదలకుండా కూర్చున్నాడు. (బెర్సెనీవ్ పెట్టి ఎక్కాడు) ఆమె కూడా ఏమీ మాట్లాడలేదు. అలా జరిగినందుకు ఎలీనా తన్ను నిందిస్తోందేమో

అనుకున్నాడు ఇన్సరోవ్. కాని ఆమె నిందించడంలేదు. మొదటి ఒకటి రెండు నిమిషాలు ఆమెకు భయంవేసింది, నిజమే. కాని అప్పటి అతనిముఖ కవళికకు ఆశ్చర్యపోయి ఆలోచించసాగింది. ఏమాలోచిస్తోందో ఆమెకే విస్పష్టంకాలేదు. ఆనాడు అనుభవించిన ఉద్వేగం సమసిపోయింది. ఆవిషయం ఆమె గుర్తించింది. కాని ఆ ఉద్వేగం స్థానంలో ఏదో, అర్థం కాని దేదో ప్రవేశించింది.

వినోదయాత్ర చాలాసేపు పట్టింది. ఎవరికీ తెలీకుండానే చీకటి పడింది. బళ్ళు పంటచేల పక్కగా సాగిపోయాయి. ధాన్యపు సువాసనతో గాలంతా బరువెక్కిపోయింది. తర్వాత మైదానాలమీదుగా ప్రయాణం చేశారు. ఆ మైదానాల కొంగ్రొత్తతనం కెరటాలు కెరటాలుగా వారిమీద విరుచుకుపడింది. దిఙ్మండలంలో ఆకాశం కరిగిపోయింది. లేత ఎరుపు చందమామ ఉదయించాడు. అన్నా కునుకుపాట్లు పడుతోంది. జోయా కిటికీలోకి ఒరిగి రోడ్డుకేసి చూడసాగింది. ఇన్సరోవ్‌తో మాట్లాడి గంటకు పైగా అయిందని ఎలీనాకు జ్ఞప్తికొచ్చింది. ఏదో అడిగింది. ఆదుర్దాగా తత్క్షణమే అతను జవాబిచ్చాడు. ఎక్కడో దూరాన అసంఖ్యాక జనుల గుసగుసలులాగా ఆ నిశావాయువులో అస్పష్టధ్వనులు తేలియాడుతున్నాయి. మాస్కో దగ్గిరదగ్గిరికి వచ్చేశారు. ముందు దీపాలు వెల్గుతున్నాయి. పోను పోను వాటిసంఖ్య పెరిగిపోతోంది. చివరికి బళ్ల చక్రాలు కంకరరోడ్డుమీద గలగల శబ్దంచేస్తూ పరుగెత్తాయి. అన్నాకు మెలకువ వచ్చింది. అందరూ మాటాడసాగారు. కాని రెండుబళ్ల పట పట ధ్వని మూలంగా, గుర్రాల డెక్కల చప్పుడు మూలంగా ఒకరిమాట ఒకరికి వినిపించడంలేదు. మాస్కో నించి కంట్సోవోకి ప్రయాణం విసిగెత్తించింది. తలోమూల తలకాయ లానించి కొందరు నిద్రపోయారు, కొందరు మౌనం వహించారు. ఎలీనా ఒక్కతెకుమాత్రం కళ్ళు మూతలు పడలేదు. చీకటిలో ఇన్సరోవ్ ఆకారం తదేదక దృష్టితో చూసింది. షూబిన్ విచారసాగరంలో మునిగి పోయాడు. చిరుగాలి అతని కళ్ళల్లోకి వీచింది. అతనికి కోపంవచ్చి మెడ చుట్టూ కోటుకాలరు ఎత్తి ఒక్క నిమిషం ఏడ్చాడు. యువార్ ఊగిపోతూ గురకపెట్టి నిద్రపోయాడు. ఎలాగైతేనేం బళ్ళు రెండూ ఆగాయి. ఇద్దరు నౌకర్లు అన్నాను బండీలోంచి దించారు. ఆమెకి వాళ్ళు తెలీటంలేదు.

అందరిదగ్గిరా శెలవు పుచ్చుకుంటూ 'కొనవూపిరితో వున్నా' అంది. అందరూ ఆమెకు కృతజ్ఞత తెల్పారు. జవాబుగా 'కొనవూపిరితో వున్నా' అని మాత్రమే అంది. మొట్టమొదటిసారిగా ఎలీనా ఇన్సరోవ్ తో కరచాలనం చేసి తన గదిలోకివెళ్ళి దుస్తులు మార్చుకుండానే చాలాసేపు కిటికీ దగ్గర కూర్చుంది. బెర్సెనీవ్ వెళ్ళిపోబోతుంటే షూబిన్ అవకాశం కల్పించుకుని చెవిలో అన్నాడు: "నేను చెప్పలా. అతను మహా రధిక, అతిరధిక శ్రేణిలో వాడు. తప్పతాగిన జర్మనీవాణ్ణి నీళ్ళల్లోకి తోసేశాడు."

"నువ్వు ఆమాత్రంకూడా యేడవలేకపోయావుగా" అని తిప్పికొట్టి ఇన్సరోవ్ తో కలిసి బెర్సెనీవ్ వెళ్ళిపోయాడు.

మిత్రులిద్దరూ వారి కుటీరానికి చేరుకునేసరికి భళ్ళున తెల్లారింది. సూర్యుడింకా ఉదయించలేదు కాని చలిగాలి వీస్తోంది. పచ్చికనంతా మంచు కప్పేసింది. సంధ్యవెలుగులో పక్షులు సంగీత మాలపిస్తున్నాయి. ఒంటికన్నులాగా ధృవతార తొంగి చూస్తోంది.

# ౧౬

ఇన్సరోవ్‌తో పరిచయం ఏర్పడినప్పటినించీ ఎలీనా డైరీ రాయడం ప్రారంభించింది. డైరీ రాయటానికి పూనుకోవడం ఇది అయిదోసారో ఆరోసారో. దాంటోనించి కొన్ని భాగాలు ఉటంకిస్తాను.

జూన్ ... ఆండ్రీపెట్రోవిచ్ పుస్తకాలు తెచ్చి నాకిస్తూనే ఉన్నాడు. కాని చదువలేకపోతున్నాను. ఈ విషయం అతనిముందు ఒప్పుకోటానికి సిగ్గేస్తోంది. కాని ఆ పుస్తకాలు చదివేసానని చెప్పి తిరిగి ఇచ్చివేయడానికి మనసొప్పుకోడంలేదు. అతనితో అబద్ధం ఆడలేను. అలా చెబితే అతను తలకిందులైపోతాడనుకుంటా. నా విషయంలో అతనెంతో ఆసక్తి తీసుకుంటున్నాడు. అతనికి నేనంటే ఎంతో ఇష్టమనే విశ్వసిస్తున్నాను. మంచివాడు...నిజానికి నాకు కావలసిందేవిటి? ఎందుకు నేనింతగా కుంగిపోతున్నాను? హృదయం బాధపడుతోం దెందుకు? ఆకాశంలో ఎగిరే పక్షులంటే నాకింత అసూయ ఎందుకు? వాటితోపాటు ఎగరాలని నేనూ కాంక్షిస్తున్నా-ఎక్కడికో నాకేం తెలీటంలేదు. కాని ఇక్కడినించి ఎంతో, ఎంతోదూరం...ఇలా భావించడం పాపంకాదూ? నాకు తల్లి ఉంది, తండ్రి ఉన్నాడు. కుటుంబంవుంది. నేను వీళ్ళందర్నీ ప్రేమించడంలేదా? లేదు. అనుకున్నంతగా నేను వీళ్ళని ప్రేమించడంలేదు. ఈ ముక్క ఒప్పుకోవడం మహాఘోరమే! అయితేనేం ఇదే సత్యం! బహుశా నేను మహాపాపిని. అందుకే నేనింతగా కుంగిపోతున్నా. అందుకనే శాంతిలేకుండా పోతోం దేమో! గోచరంకాని శక్తిఏదో నను స్వాధీనపర్చుకుని అణిచివేస్తోంది. నేను జైలులో ఉన్నట్టు జైలుగోడలు నామీద విరుచుకుపడబోతున్నట్టు అనిపిస్తోంది. అందరూ ఇలా భావించుకోరేం? నా కుటుంబంవారినే ప్రేమించ

లేకపోతే ఇంకెవరిని ప్రేమించగల్గుతాను? నేను కుక్కల్ని, పిల్లుల్ని మాత్రమే ప్రేమించగలనని నిందించే నాన్న మాటలే యదార్థమనిపిస్తున్నాయి. ఈ విషయంలో ఆలోచించాలి. ప్రార్థనలు చేయాలి. నేను ఎక్కువగా ప్రార్థన చేయడంలేదు....అయినా నేను ప్రేమించగలననే నా విశ్వాసం.

...ఇన్సరోవ్ అంటే నాకింకా సిగ్గేస్తోనే ఉంది. కారణమేమిటో తెలియడంలా. నేనేం పసిపిల్లనుకాను. అతను నిరాడంబరంగా, దయగా ఉంటాడు. కొన్నివేళల మహాగంభీరంగా ఉంటాడు. నాబోటివాళ్ళ విషయంకంటె ఆలోచించవలసిన విషయాలు అతనికెన్నో ఉండిఉంటాయి. ఈ సంగతి గ్రహించగల్గా. అందుకే అతని కాలం దుర్వినియోగం చేయడమంటే సిగ్గేస్తోంది. కాని ఆండ్రీ. విషయంవేరు. అవసరమైతే అతనితో రాజా రోజంతా మాట్లాడుతూ ఉండగలను. కాని అతనెప్పుడూ ఇన్సరోవ్‌ని గురించే మాట్లాడతాడు. ఆ మాట్లాడడంలో కూడా ఎన్ని వివరాలిస్తాడు! కిందటిరాత్రి నాకో కలవచ్చింది. ఆ కల్లో ఆండ్రీ కత్తి ఒకటి చేత్తోపట్టుకుని 'నిను చంపుతా? నినుచంపి నే పొడుచుకుచస్తా!' అన్నాడు. పిచ్చిపుల్లాయ్!

అహో! ఎవరైనా 'ఇదీ నువు చేయవల్సింది' అని చెబితే ఎంత బావుండును! మంచిగా ఉండటంమాత్రం చాలదు. మంచిపని చేయాలి... అవును. ఇదీ జీవితపరమార్థం. మంచిపనులు చేయడమెలా? ఓ-నను నేను అదుపులోపెట్టుకోగల్గితేనా! తరుచు ఇన్సరోవ్‌ని గురించి ఎందుకు ఆలోచిస్తున్నానో నాకే తెలీటంలేదు. అతను వచ్చి మా పక్కనకూర్చుని శ్రద్ధగా, ప్రశాంతంగా ఏ గొడవా చేయకుండా మా మాటలు వింటుంటే అతనికేసి చూడడం ముచ్చటగా ఉంటుంది. అంతే. కాని అతను వెళ్ళిపోయింతర్వాత అతను చెప్పిన విషయాలనుగురించి ఆలోచిస్తునే ఉంటా. నామీద నాకే కోపం వచ్చేస్తుంది. ఆందోళన బయలుదేరుతుంది. ఎందుకో నాకే తెలీటం లేదు. (అతను మాట్లాడే ఫ్రెంచి తప్పులతడక. అయినా సిగ్గుపడడు. అందుకే అతనంటే నాకింత ఇష్టం,) కొత్తగా పరిచయమైనవాళ్ళని గురించి నేనెంతగానో ఆలోచిస్తా...అతనితో మాట్లాడుతూంటే హఠాత్తుగా మా వంటవాడు వాసిలీ జ్ఞాపకంవచ్చాడు. వాసిలీ ఓమాటు తగలబడుతున్న ఓఇంట్లోనించి ఓ కుంటివాణ్ణి బయటకిలాక్కొచ్చాడు. అలా లాక్కురావడంలో

అతని ప్రాణానికే ముప్పంవచ్చింది. నాన్న అతన్ని మహాధైర్యస్తుడని పొగి డాడు. అమ్మ అయిదురూబుల్సు బహుమతీ ఇచ్చింది. కాని అతనిముందు మోకరిల్లాలని నాకు బుద్ధిపుట్టింది. అతను బహు నిరాడంబరి. వట్టి తెలివి తక్కువ ముద్దు. తర్వాత తాగుడుకు అలవాటుపడ్డాడు

... ఇవాళ ఓ ముష్టిమనిషికి ముష్టి పెట్టాను. 'విచారంగా ఉన్నారేం?' అని అడిగిం దాముష్టిమనిషి. నా మొహంలో విచారం కనిపిస్తోందా? నా కెన్నడూ అటువంటి అనుమానం వేయలేదే. ఒంటరిగా ఉండడమే అందుకు కారణమనుకుంటా. స్నేహ హస్తం చాచ దలచా. కాని నా దగ్గిరికి వచ్చేవాళ్లతో నా కవసరం కన్పించడంలేదు. నేను కాంక్షించేవాళ్ళు వైదొలగిపోతున్నారు. .

... ఇవాళ నన్నేమిటి ఆవహించిందో నాకే తెలీటంలేదు ... మనసు గందరగోళంగా ఉంది. మోకరిల్లి ప్రార్థించడానికి సిద్ధపడ్డా. నన్నెవరో, ఎందుకో హత్య చేస్తున్నట్టు అనిపించింది. హృదయం దుఃఖి స్తోంది. తిరగబడుతోంది. ఏడ్చేశాను. ఊరుకుండలేకపోయా. భగవాన్, భగవాన్! నాలోని ఈ ఉద్వేగాన్ని అణచివెయ్యి భగవాన్!...నువొకడవే ఆపని చెయ్యగలవు. ఇంకెవరికీ అంత శక్తిలేదు. నే చేసిన దానాలు, నా అనుభవాలు ... నన్నేం రక్షించలేవు. రక్షించలేవు. యదార్థానికి నేను ఎక్కడికైనా వెళ్ళిపోయి దాసిగా పనిచేస్తే బాగుండును. అప్పుడు నా హృదయం తేలికపడుతుంది.

... యవ్వనం ఎందుకు? నేను జీవించ ఉండడం ఎందుకు? నాకు ఆత్మ ఎందుకు? ఈ కష్టాలన్నీ నే నెందుకు అనుభవించాలి?...ఇన్సరోవ్ ని గురించే ఇంకా ఆలోచిస్తున్నా ... ఇన్సరోవ్ ... ఈమాట ఎలా రాయాలో నిజంగా నాకు తెలీదు. అతని మనసులో ఏముందో తెలుసుకోవాలని కుతూహలంగా ఉంది. అతనిలో దాపరికం కనిపించదు. అతన్ని చేరుకో వడం అతితేలిక అనిపిస్తుంది. కాని నాకేమీ గోచరించడంలేదు. ఒకొక్కప్పుడు నాకేసి పరిశోధనా దృష్టి పరుపుతాడు. నిజమా? లేకపోతే అదంతా నా ఊహా కల్పనా? పావెల్ నన్నింకా వేధిస్తూనే ఉన్నాడు. నాకు కోపం వస్తోంది. అతను ఆశిస్తోందేమిటి? అతను నన్ను ప్రేమిస్తు న్నాడు. నాకు అతని ప్రేమ అక్కర్లా. అతను జోయానుకూడా ప్రేమిస్తు

న్నాడు. పావెల్‌కి అన్యాయం చేశాను. 'సగం సగం అన్యాయం చేయలేవ'న్నాడు ... అదే నిజం. నాదే తప్పు.

... ఓ - మనిషికి సౌఖ్యం ఉండకూడదు. ధనం ఉండకూడదు. ఆరోగ్యం ఉండకూడదు. ఉంటే పొగరెక్కుతుంది. ... ఇవాళ ఆ ఇద్దరు బల్గేరియన్ల గురించి ఆంద్రీ నాతో ఎందుకు చెప్పాడు? ఏదో కారణం ఉండి ఉంటుంది. ఇన్సరోవ్‌తో నాకేం సంబంధం? ఆంద్రీమీద నాకు కోపం వచ్చింది.

... కలం పట్టాను. ఏం రాయాలో తోచలా. ఇవాళ తోటలో నాతో అతను సంభాషణ ప్రారంభించడం నా కెంతో ఆశ్చర్యం గొల్పింది. ఎంతో దయతో, ఎంతో నమ్మకంతో ప్రవర్తించాడు. మేము ఎంతో పాతస్నేహితులమైనట్టు, అప్పుడే ఒకరొన్నొకరం గుర్తించుకున్నట్టు - ఇదంతా ఒక్క క్షణంలో జరిగిపోయింది. ఇంతకుపూర్వం అతన్నెందుకు అర్థం చేసుకోలేకపోయాను? నాకు ఎంత సన్నిహితుడైనాడు! ఇదీ మరీ ఆశ్చర్యం కొల్పింది. ఇప్పుడు నా మనసు ప్రశాంతంగా ఉంది. నిన్న ఆంద్రీమీదా, ఇన్సరోవ్‌మీదా కోపం వచ్చింది. 'ఏమండీ' అనికూడా సంబంధించా. ఇక ఇవాళ! ఇదంతా ఎంత పరిహాసాస్పదంగా ఉంది! — సరే - ఇదుగో, మంచి నిజాయితీ పరుడు. ఇతనిమీద ఆధారపడవచ్చు. ఎప్పుడూ నిజమే చెబుతున్నాడు. అబద్ధమాడనివాణ్ణి ఇతనొక్కణ్ణే చూచా. తక్కినవాళ్లంతా అబద్ధాలాడేవాళ్ళే. ఆంద్రీ! ఈ ముక్క అని నిను ఎలా అవమానపర్చ గలను! ... అయితే నేం, ఆంద్రీ! నువ్వతనికన్న ఎక్కువ చదువుకున్న వాడివికావచ్చు, తెలివిగల వాడివికావచ్చు. కాని అతనిముందు నువ్వు పిట్టలాగా ఉంటావు ఇన్సరోవ్ తన మాతృభూమిని గురించి మాట్లాడుతూంటే మనిషి పెరిగిపోతున్నట్లనిపిస్తుంది. ముఖం ఇంకా చక్కగా ఉంటుంది. గొంతు కంచుమోత మోగుతుంది. అప్పుడు ప్రపంచంలో ఎవరికళ్లలోకైనా సరే సూటిగా చూడగలుగుతాడనే నా నమ్మకం. అతను వట్టి మాటలపోగుకాడు. ఎన్నో పనులుచేశాడు. ఇంకెన్నో చేస్తాడు. ఇంకేం చేయదలిచాడో అడగాలి ... చటుక్కున నాకేసి తిరిగి ఎలా చిరునవ్వు నవ్వాడనుకున్నా! సోదరు లొక్కళ్లే అలా చిరునవ్వు నవ్వగలరు. ఓ - నాకెంతో సంతృప్తికల్గింది! మొదటిసారిగా అతన్ని కలుసుకున్నప్పుడు

మేము ఇంత త్వరగా సన్నిహితుల మవుతామనుకోలేదు. అప్పుడు నేను ఉదాసీనంగా ప్రవర్తించినందుకు ఇప్పుడు సంతోషిస్తున్నా. ఉదాసీనం! నిజానికి ఇప్పుడుమాత్రం ఉదాసీనంగా లేనూ?

... అంతరంగంలో ఇంత ప్రశాంతత అనుభవించి ఎంతో కాలమైంది. నా హృదయం నిర్మలంగా ఉంది. రాయడానికేం కనిపించడంలా. తరుచు అతను కనిపిస్తోనే ఉన్నాడు — అంతే. ఇంతకన్న చెప్పేదేముంది?

... పావెల్ తలుపులు బిడాయించుకుని గదిలో కూర్చున్నాడు. అంద్రీ తరుచుగా రావడంలేదు. పాపం! ... నేననుకుంటా: 'అతను నన్ను...' ఊహు - అదేంకాదు. అంద్రీతో మాట్లాడడమంటే నాకెంతో ఇష్టం. తన్ను గురించి ఒక్కమాటన్నా మాట్లాడడు. అతను మాట్లాడే విషయాలు ఎంతో అర్థయుక్తంగా ఉంటాయి. ఎంతో విలువయినవి. షూబిన్ అల్లాకాదు. సీతాకోకచిలుకలా ఆడంబరం జాస్తి. ఆ ఆడంబరం చూచుకుని గర్వపడతాడుకూడా. షూబిన్, అంద్రీలిద్దరూ ... ఊఁ. సరే. నాకు తెలుసు.

... మమ్మల్ని చూడడానికి రావడం అతనికిష్టమే. నేను ఘంటాపథంగా చెప్పగలను. అయితే ఎందుకు వస్తున్నాడు? నాలో ఏం గొప్పదనం కనిపెట్టాడు? మా ఇద్దరి అభిరుచులూ ఒకటే. మా ఇద్దరికీ కవిత్వమంటే ఆసక్తిలేదు. మాకు కళ అర్థంకాదు. ఇదంతా నిజమే. కాని నాకంటె అతను ఎంతో ఉత్తముడు. అతను ప్రశాంతంగా ఉంటాడు. ఇక నేనో? నాలో ఎప్పుడూ తుపాను రేగుతూనే ఉంటుంది. అతనికి మార్గం స్పష్టంగా గోచరించింది. అతనికి ఓ లక్ష్యముంటూ ఉంది ఇక నేను ఎక్కడికి వెడుతున్నాను? నాకెక్కడ విశ్రాంతి లభిస్తుంది? అవును. అతను ప్రశాంతంగా ఉంటాడు. కాని అతని మనసు ఎక్కడో బహుదూరంలో ఉంది. శాశ్వతంగా మమ్మందర్నీ పరిత్యజించి స్వజాతి సోదరులదగ్గిరికి సముద్రాలుదాటి వెళ్ళిపోయే రోజు ఎప్పుడో వస్తుంది. సరే, అతనికి విజయం చేకూరుగాక! అయినప్పటికీ అత నిక్కడుండగా అతని పరిచయం కలిగినందుకు సంతోషిస్తున్నా.

... అతను రష్యను ఎందుకై ఉండకూడదు? ఊహుఁ - అతనెన్నటికీ రష్యన్ కాజాలడు.

... అమ్మకి కూడా అతనంటే ఇష్టమే. మంచి యోగ్యుడంటుంది. పాపం! అమ్మ అతన్ని అర్థంచేసుకోలేదు. పావెల్ గొడవచేయడంలేదు. ఇవనోవ్ విషయమై అతని సూచనలు నాకు నచ్చలేదని ఊహించి అసూయ పడుతున్నాడు. వట్టి చుప్పనాతి! అసూయపడడానికి అతనికేం హక్కుంది? నేనెప్పుడైనా ... ఏమిటీ పిచ్చి ఆలోచనలు! ఇవన్నీ నా బుర్రలోకి ఎందుకురావాలి?

... ఇరవై ఏళ్ళు వచ్చి ఇంతవరకు ఎవర్నీ ప్రేమించకపోవడం చిత్రంగాలేదూ? డి. (నాకు డిమిట్రీ అనేపేరు బాగా నచ్చింది. ఇకనించీ అతన్ని డి. అనే అంటాను) డి. అంత ప్రశాంతంగా ఉంటానికి కారణం పనిలో, ఆదర్శాలలో పూర్తిగా నిమగ్నుడై ఉండడమే ననుకుంటా. అతనికి దిగులేముంది? దేనిలోనైనా పూర్తిగా-పూర్తిగా నిమగ్నుడైనవాడు దేనికీ ఉత్తరవాదికాడు. అందుకే అతనికి దిగులుండదు. అప్పుడు అతనికి ప్రధానం ఇచ్ఛకాదు, ఆశయసిద్ధికోసం కార్యాచరణ.

... మా ఇద్దరికీ ఒకే రకమైన పువ్వులంటే ఇష్టమని సందర్భవశాత్తూ కనిపెట్టా. ఇవాళ ఓ గులాబీపువ్వు కోశాను. ఒక రేకు ఊడి కింద పడిపోయింది. అతను ఆ రేకును నేలమీదనించి తీశాడు. ఆ గులాబీపువ్వును అతనికిచ్చివేశా.

... డి. తరుచు మా ఇంటికి వస్తున్నాడు. నిన్న సాయంత్రమంతా ఇక్కడే ఉండిపోయాడు. నాకు బల్గేరియాభాష నేర్పాలని అతని అభిలాష. అతనిదగ్గర ఉంటే ఇంట్లోకంటేకూడా నాకెంతో హాయిగా ఉంటుంది.

... రోజులకి రోజులు ఎగిరిపోతున్నాయి ... సుఖంగా ఉన్నా. కాని ఎందుకో కొంచెం భయమేస్తోంది. భగవంతుడికి మొదట కృతజ్ఞత తెలుపుదామనుకున్నా. తర్వాత విలపిద్దామనుకున్నా. ఒహో! రోజులు ఎంత పసందుగా ఉన్నాయి.

... మనసు ఇంకా తేలిగ్గానే ఉంది. ఎప్పుడైనా - ఏదో ఎప్పుడైనా కొంచెం విచారంవేస్తుంది. నేను సుఖంగా ఉన్నాను. సుఖంగా ఉన్నానా? అని మళ్ళీ సందేహం!

... నిన్నటి వినోదయాత్ర మర్చిపోటానికి చాలాకాలం పడుతుంది. విచిత్రమైన, భయంకరమైన అనుభవాలు! ఆ బ్రహ్మాండమైన మనిషిని ఎత్తి, రాయిపడేసినట్టు నీళ్ళల్లో పడేశాడు. లేదు. ఆచర్యం నన్నేం భయపెట్ట లేదు. భయపెట్టిందల్లా అతనూ. ఆ తర్వాత అతని ముఖంలో ఎంత క్రౌర్యం కన్పించింది! 'వాడే యీదుకువస్తాడులే' అన్నమాటలు ఉచ్చరించిన విధానం నను తారుమారుచేసింది. అతన్ని అర్థంచేసుకోలేక పోయానని స్పష్టమైంది. తర్వాత అంతా నవ్వుతూంటే నేనూ నవ్వుతూ అతనికోసం ఎంత విచార పడ్డాను! అతనికి సిగ్గేసింది. నాముందు సిగ్గేసింది. తెలుసుకోగల్గా. చీకటి పడ్డతర్వాత బండిలో భయపడుతూ భయపడుతూ అతనిచేత చెప్పించాలని యత్నించినపుడు తనకు సిగ్గేసిందని చెప్పాడు. అవును. అతనితో ఆషామాషీ ఆటలు పనికిరావు. ఇతర్లకి అండగా ఎలా నిలబడాలో అతనికి తెలుసు.

కాని ఎందుకంత క్రౌర్యం? పెదవులలా వణుకుతాయేం? కళ్ళు నిప్పులు చెరుగుతాయేం? బహుశా ఇంకోవిధం అసంభవమేమో? మనిషిగా బతికి పోరాటంలోకి ఉరికేటప్పుడు నెమ్మది, శాంతం వహించడం సాధ్య మేనా? మొన్న అన్నాడు:

"జీవితం అంటే వట్టిమోటువ్యవహారం" అని. ఈమాటలే ఆంద్రీతో అన్నా. డి. అభిప్రాయంతో ఆంద్రీ ఏకీభవించలా. వీళ్ళిద్దరిలో ఎవరి వాదన సరైంది?

...తర్వాత ఈరోజు ఎంత అద్భుతంగా మొదలైంది? మాట్లాడుకో పోయినా అతని పక్కన నడుస్తుంటే ఎంతబావుంది... ఇలా జరిగినందుకు ఎంతో సంతోషించాను. ఇలా జరగవలసి ఉందనే నాకు అనిపించింది.

...మళ్ళీ ఆందోళన ప్రారంభమైంది... మనసేం బావుండలా.

... ఇన్నిరోజులనించీ ఈ పుస్తకంలో ఏమీ రాయలా. రాయాలని బుద్ధిపుట్టలా. నా మనసులో ఉన్నది మాటల్లో పెట్టలేనని అనిపించింది. మరి నామనసులో ఏముంది? అతనితో చాలాసేపు మాట్లాడాను. అనేక విషయాలు విశదమయాయి. అతని భావికార్యక్రమం అంతా నాతో చెప్పాడు. (సందర్భ వశాత్తూ మెడమీద మచ్చ ఎందుకు పడిందో తెలిసింది – భగవాన్! మృత్యు గహ్వరంలో చిక్కుకుని ఎలానో తప్పించుకోవడం, గాయపట్టం, ఆలో చించినకొద్దీ...) యుద్ధం వస్తుందని తలుస్తున్నాడు. సంతోషిస్తున్నాడు

కూడా. అయితేనేం అంత విచారంగా ఉండగా అతన్ని నే నెన్నడూ చూడలా. ఎందుకు విచారం? నాన్న పట్నంనించి తిరిగొచ్చాడు. మేమిద్దరం ఒంటరిగా ఉండగా చిత్రంగా మాకేసి చూచాడు. ఆంద్రీ కూడా వచ్చాడు — పాపం! చిక్కిపోయి, పాలిపోయాడు. షూబిన్‌తో అతిముఖభావంగా ఉంటున్నందుకు నను నిందించాడు. పావెల్‌ని నేను పూర్తిగా మర్చేపోయా. ఈతడవ కనిపించినపుడు తప్పుదిద్దుకోవాలి. అతనితో మాట్లాడటానికి — మరెవరితో మాట్లాడటానికైనా నాకు వ్యవధి లేదు. ఆంద్రీ నాతో ఎంతో కనికరంగా మాట్లాడాడు. దీనికంతటికీ అర్థమేమిటి? నాచుట్టూ నాలో ఎందుకు ఇంత అంధకారం అలముకుంది? నాలోపలా నాచుట్టూ అవాఙ్మానస గోచరమైందేదో సంభవిస్తోంది. ఏదో! ఏదో! దాన్ని తెలిపే సరియైన పదాన్ని అన్వేషించాలి.

క్రిందటిరాత్రి నాకు నిద్రపట్టలా. తలకాయ నొప్పిగావుంది. రాసి ఏం ప్రయోజనం? ఇవాళ అతను తొందరగా వెళ్ళిపోయాడు. అతనితో మాట్లాడదామనుకున్నా. నన్నుతప్పించుకోవాలని అతను జూస్తున్నట్టుంది. అవును నన్ను తప్పించుకు తిరుగుతున్నాడు!

ఆ పదం — మెరుపులా నాకు తట్టింది. భగవాన్? నేను అతన్ని ప్రేమిస్తున్నా!



# ౧౭

ఎలీనా డైరీలో ఆ ఆఖరిమాటలు రాసిన రోజునే ఇన్సరోవ్ బెర్సెనీవ్ గదిలో కూర్చుని ఉన్నాడు. బెర్సెనీవ్ అతనికి ఎదురుగా నిలబడ్డాడు. ఆ మర్నాడే మాస్కోకు తిరిగి వెళ్ళిపోదలచానని ఇన్సరోవ్ తెలియజేయడంతో బెర్సెనీవ్ కలవరపడసాగాడు.

"కాని, నిజానికి మంచి పసందైన రోజులు రాబోతున్నాయి. మాస్కో వెళ్ళి యేం చేస్తావు? హఠాత్తుగా యిలాంటి నిర్ణయానికి వచ్చావేం? లేకపోతే యేదైనా వార్త అందిందా?"

"అబ్బే! వార్తలేం అందలా. వొక్క వుపకారం చెయ్యి, నన్నాట్టే వొత్తిడిపెట్టకు. నినువదిలి వెళ్ళిపోవడమంటే నాకు చాలా విచారంగానే వుంది. కాని గత్యంతరంలేదు."

బెర్సెనీవ్ అతన్ని పరికించిచూసి "నువ్వు మనసు మార్చుకునేటట్టు చేయడం యెవరితరమూ గాదని నాకు తెలుసు. సరే-వెళ్ళిపోవడం నిశ్చయమే నన్నమాట!" అన్నాడు.

"యేం సందేహంలేదు." అని చెప్పి లేచి బయటికి ఇన్సరోవ్ వెళ్ళిపోయాడు.

బెర్సెనీవ్ గదిలో అటు యిటూ పచారుచేసి, హాటుతీసుకుని స్టహోవ్‌ల ఇంటికి బయలుదేరి వెళ్ళాడు.

ఒంటరిగా ఉంటానికి అవకాశం చిక్కగానే ఎలీనా అంది:

"యేదో చెప్పదలుచుకున్నట్టున్నావు?"

"ఔను. యెలా వూహించావు ?"

"అదంతా యెందుకులే. చెప్పదలిచిందేదిటో చెప్పు."

ఇన్సరోవ్ చేసుకున్న నిర్ణయాన్ని ఆమెకి బెర్సెనీవ్ తెలియజేశాడు. ఆమె తెల్లబోయి "దీని అర్థమేమిటి ?" అని ఎలాగో అనగల్గింది.

"ఇన్సరోవ్ తను చేసేపనులకు కారణం చెప్పడం యిచ్ఛగించడని నీకు తెలిసిందేగా ! కాని - కూర్చుందాంపట్టు. ఏలీనా - అదేమిటి? అలా వున్నావేం - యిలా హఠాత్తుగా బయలుదేరి తలచడానికి కారణం వూహించ గలను" అన్నాడు బెర్సెనీవ్.

"యేమిటా కారణం ? యేమిటి ?" అని అడిగింది అప్రయత్నంగా బెర్సెనీవ్ చెయ్యి పట్టుకుని నొక్కుతూ.

"చూడు." అని ప్రారంభించాడు బెర్సెనీవ్ చింతాకులిత మంద హాసంతో. "యెలా నీకు విప్పిచెప్పగలను ? గత వసంతకాలంలో, ఇన్సరోవ్‌తో పరిచయం యెక్కువవుతున్న రోజుల్లో మా బంధువు వొకా యన యింటో ఇన్సరోవ్‌ని కలుసుకున్నాను. మా బంధువుకు చక్కటి చుక్కలాంటి కూతురు వుంది. ఇన్సరోవ్ ఆ పిల్లను ప్రేమిస్తున్నట్టు నాకని పించి ఆ ముక్క ఇన్సరోవ్ అనేశా. దానిమీద అతను పకున నవ్వి నేను పొరబడుతున్నాననీ తన హృదయం యెవరి అధీనం కాలేదనీ, కర్మం చాలక అలాంటిదే సంభవిస్తే అక్కడినించి వెళ్ళిపోతాననీ చెప్పాడు. 'వ్యక్తిగత ఆనందంకోసం కార్యనిర్వహణను బలిపెట్టలేను. నేను బల్గేరియావాణ్ణి. రష్యన్ దేశస్థురాలి ప్రేమ నాకవసరంలేదు.' యివీ అతను అన్నమాటలు.

"సరే-అయితే యిపుడు యేమనుకుంటున్నా" అని చెవిలో అడిగింది ఏలీనా ... ఏదో దెబ్బ తగులుతుందని పక్కకు తప్పుకున్నట్టు తల పక్కకు పెట్టింది. బెర్సెనీవ్ చేతిని యింకా గట్టిగా పట్టుకునే ఉంది.

"నాకు అప్పుడు కలిగిన అనుమానం తప్పయినా యిపుడు ఆ అను మానం నిజమైనదన్నమాట."

"అంటే...నీ వుద్దేశం...ఓ - నన్ను చంపకుతినక" అని అనేసింది ఏలీనా.

బెర్సెనీవ్ వెంటనే అందుకని "ఇన్సరోవ్ ఓ రష్యన్ అమ్మాయిని ప్రేమిస్తున్నాడన్నమాట. ఆనాడన్న మాట ప్రకారం పారిపోతున్నాడు." అని అన్నాడు.

ఎలీనా అతని చెయ్యి యింకా గట్టిగా పట్టుకుని ముఖంలో, మెడ మీదా, పొంగిన సిగ్గు దొంతరులు దాచుకోటానికా అన్నట్లు తలవంచుకుంది.

"ఆంద్రీ పెట్రోవిచ్! నువు మహా దయగలవాడివి. అయితే మాతో చెప్పి వెళ్లడానికి వస్తాడంటావా ?"

"ఆ - తప్పకుండా వస్తాడు. నీతో చెప్పకుండా..."

"అయితే అతనితో చెప్పు..."

దురదృష్టవంతురాలు ఇక తట్టుకోలేకపోయింది. కన్నీరు కాలువలు కట్టాయి. గదిలోంచి పారిపోయింది.

"అబ్బ! యింతగా అతన్ని ప్రేమిస్తోందన్నమాట" అనుకున్నాడు బెర్సెనీవ్ యింటికి తిరిగి వెడుతూ.

"యిలా జరుగుతుందనుకోలా. ప్రేమ యింత ముదురుతుందని యెన్నడూ అనుమానించలా. 'మహా దయగలవాడివి' అంది." అతని ఆలోచనలు ఇంకా ఇలా సాగాయి: "యిదంతా ఆమెతో చెప్పమని యే భావాలు, యే వుద్దేశాలు నను ప్రేరేపించాయో యెవరికి తెలుసు? దయదలిచి కాదు. కాదు. నా అనుమానం నిజమా కాదా తెలుసుకుందామనే కాంక్షే నన్నలా చెప్పమని ప్రేరేపించి వుండచ్చు. వారు ప్రేమించుకున్నారు. నే నందుకు సాయబడ్డాను, అనుకుని తృప్తిపడాలిసిందే. 'శాస్త్రానికీ, రష్యన్ ప్రజలకు అనుసంధాన కర్త' అన్నాడు షూబిన్ నన్ను. నేను పుట్టిందే అనుసంధానానికి అనుకుంటా. నే ననుకొన్నది పొరపాటయితే... ఉహుం-పొరపాటుకాదు."

అతని మనసు కలతచెందింది. ఆ సాయంకాలం చదువుమీద బుద్ధి కేంద్రీకరించలేకపోయాడు.

మర్నాడు రెండుగంటలకి ఇన్సరోవ్ స్టహోవ్‌ల ఇంటికి వెళ్ళాడు. ఆ సమయంలో కచేరీ సావిడిలో అన్నాతో ఇంకో ఆవిడ ఉంది. ఆమె పొరుగునఉన్న పూజారి భార్య. చాలా మంచిది. గౌరవించదగింది - కాని

ఈమధ్య పోలీసుల మూలంగా కొంచెం చిక్కుల్లో పడింది. (ఒక ప్రముఖ సేనాని వెళ్ళే రోడ్డుపక్క కొలనిలో స్నానంచేయాలని ఆమెకి ఓనాడు బుద్ధిపుట్టి స్నానం చేసింది. అదీ పోలీసులతో వచ్చిన చిక్కు.)

ఇన్సరోవ్ అడుగులచప్పుడు వినేసరికి ఎలీనా కొయ్యబారిపోయింది. కొత్తమనిషి అక్కడ ఉన్నందుకు మొదట సంతోషించింది. కాని తనతో చాటుగా ఒక్క మాటన్నా మాట్లాడకుండా వెళ్ళిపోతాడేమోనని అనుకునే సరికి ఆమె మనసు కుంగిపోయింది. ఇక అతను:. అతనూ ఏదో మహదాందో ళనలో ఉన్నట్టు, ఎలీనా దృష్టిని తప్పించుకో జూస్తున్నట్టు కనిపించాడు. "వెళ్ళిపోతున్నానని యిపుడే చెప్పేస్తాడా యేవిటి?" అనుకుంది ఎలీనా. నిజానికి అతను అన్నాను సంబోధించబోతున్నాడు. ఎలీనా దిగ్గునలేచి కిటికీ దగ్గరకు రమ్మని పిల్చింది. ఆ ఆగంతకురాలు వారి ప్రవర్తనకు ఆశ్చర్య పడి వారికేసి చూడాలని యత్నించింది. కాని లేసుతో గట్టిగా బిగించిన ఆమె దుస్తులు కదిలినపుడల్లా గరగరలాట్టం మొదలెట్టాయి. అందుకని కదలకుండా కూర్చుంది.

"విను" అంది ఎలీనా గబగబా "నువు యెందుకు వచ్చావో నాకు తెలుసు. నువేం చేయదలుచుకుందీ ఆంద్రీ పెట్రోవిచ్ నాతో చెప్పాడు. విను ప్రార్థిస్తున్నా. యివాళ ఆ విషయం యెత్తద్దు. రేపు ఉదయం సాధ్యమైనంత తొందరగా, యే పదకొండుగంటలకో రా. నీతో వో నిమిషం మాట్లాడాలి" అంది ఎలీనా.

ఇన్సరోవ్ అంగీకారసూచకంగా తల వంచాడుగాని మరేం మాట్లాడలేదు.

"సరే-యిక వెళ్లొచ్చు...తప్పకుండా రేపు వస్తావుకదూ."

ఇన్సరోవ్ తిరిగీ తలవంచాడుగాని మాట్లాడలేదు.

"ఎలీనా, యిలారా. యీావిడ తెచ్చిన చేతిసంచీ చూడు, యెంత అందంగావుందో" అంది తల్లి.

"నేనే స్వయంగా అల్లా" అన్నది పూజారిభార్య. ఎలీనా కిటికీ దగ్గరనించి వెళ్ళిపోయింది. ఇన్సరోవ్ పావుగంటకంటె ఎక్కువ అక్కడ ఉండలేదు. ఎలీనా చాటుగా ఉండి అతన్ని కనిపెట్టిచూసింది.

అతను దిక్కులుచూసి ఎవర్ని పలకరించాలో తోచక లేచి చక్కా బోయాడు. అతను అమాంతం మాయమైపోయినట్టనిపించింది.

ఎలీనాకు ఆరోజు చాలా మందకొడిగా గడిచింది. అంతుపొంతూ లేనట్టున్న రాత్రి ఇంకా మందకొడిగా గడుస్తోంది. మోకాళ్లకు చేతులు చుట్టేసుకుని, వాటిమీద తల ఆనించి పక్కమీద కూర్చునేది. కిటికీదగ్గిరికి వెళ్ళి ఉడికిపోతున్న నుదురు చల్లటి కిటికీ అద్దంమీద వేసినొక్కుకుంటూ అలసిపోయేదాకా ఆలోచించేది, ఆలోచించేది. ఒకటే ఆలోచన. ఆమెకు హృదయమున్నదనే జ్ఞానమే నశించింది. హృదయం రాయి అయిపోయిందో మాయమైపోయిందో! కాని తలమాత్రం బద్దలైపోతోంది. జుట్టు మండిపోతున్నట్టుంది. పెదవులు తడారిపోయాయి. "ఆ-వసాడు. అమ్మతో వెళ్ళిపోతున్నానని చెప్పలా. నన్ను మోసగించడు...ఆంద్రీ చెప్పింది నిజమేనా? సాధ్యమా? కాని తప్పకుండా వస్తానని మాటయివ్వలేదే! నన్ను వదిలి శాశ్వతంగా వెళ్ళిపోవడం నిజమేనా?" ఇవీ ఆమెను వదలని ఆలోచనలు. అక్షరాలా వదలని ఆలోచనలు. ఈ ఆలోచనలు రావడం, పోవడం, మళ్లీ రావడం పోవడం అంటూలేదు. పొగమంచులాగా ఆమెని ఆక్రమించాయి.

"నన్ను ప్రేమిస్తున్నాడు." ఈ ముక్కలు ఆమె తనువంతటిలో తళుక్కుమన్నాయి. చీకటికేసి తదేకదృష్టితో చూసింది. కాని ఆమె పెదవులమీద తాండవిస్తున్న చిరునవ్వును చూడడానికి అక్కడ ఎవరూలేరు. హఠాత్తుగా తలూచి, మెడవెనుక చేతులు ముడుచుకుంది. మళ్ళీ అవే ఆలోచనలు పొగమంచులావచ్చి పడ్డాయి. ఉదయం అయేముందు పడుకుందిగాని నిద్రపట్టలా. అరుణకాంతులు గదిలో ప్రవేశించాయి...

సూర్యరశ్మి మీద పడుతున్నా సిగ్గుచెందకు డా చేతులుముందుకు చాచి "ఓ - అతను నన్ను ప్రేమిస్తేనా!" అంది బిగ్గరగా.

లేచి దుస్తులు వేసుకుని కిందికి వెళ్ళింది. ఇంటో ఇంకా ఎవరూ నిద్రలేవలా. తోటలోకి వెళ్ళింది. అక్కడి కొంగ్రొత్తదనం, ప్రశాంతత, పక్షుల కలరవం, వికసితపుష్పాలు చూసేసరికి ఎదో తెలీని భయంవేసింది. 'అదేనిజమైతే నాకంటే అదృష్టవంతురాలు యీప్రపంచంలో యెక్కడుంది?' 'కాని అది నిజమేనా?' అనుకుని తిరిగి తనగదికి వెళ్ళింది. ఎదోవిధగా పొద్దు పుచ్చాలని దుస్తులు మార్చుకోడం మొదలెట్టింది. కాని చేతుల్లోనించి జారి

పోయాయి. అద్దంముందు అలా అర్ధనగ్నంగా కూర్చునేసింది. ఇంతలో పలహారానికి పిలుపువచ్చింది కిందికి వెళ్ళింది ముఖం పాలిపోయి ఉండడం తల్లి కనిపెట్టి అంది: "ఇవాళెంత ముద్దొస్తున్నావ్!" మళ్ళీ ఎగాదిగా చూసి 'ఈ బట్టలు సరిగ్గా నీకు తగినట్టున్నాయి. యెవరిమెప్పన్నాపొందాలంటే యివే వేసుకుంటూ వుండు'అంది. ఎలీనా జవాబుచెప్పకుండా ఓమూలకూర్చుంది. తొమ్మిదికొట్టింది. పదకొండింటికి ఇంకా రెండుగంటలుంది. ఎలీనా ఓపుస్తకంతీసుకుని చూసింది. పుస్తకం మూసేసి అల్లిక మొదలెట్టింది. అదీ ఆపేసి మళ్ళీపుస్తకం తీసింది. చివరికి ఇంటిముందు వందసార్లు పచార్లుచెయ్యాలని నిశ్చయించుకుని పచార్లు ప్రారంభించింది. అన్నావాసిలెవ్నా ఒక్కతే పేకాడుతోంది. చాలాసేపు గడిచింది. ఎలీనా గడియారంకేసి చూసింది. ఇంకా పదే కాలేదు. ఘూబిన్ వచ్చాడు. అతనితో మాట్లాడదామనుకుంది. కాని క్షమాపణకోరింది. ఎందుకు కోరిందో ఆమెకే తెలీదు. క్షమాపణ కోరడానికి పడ్డ శ్రమకి కాకుండా అన్న ప్రతిమాటా ఆమెకి ఆశ్చర్యం కలిగించింది. ఘూబిన్ ఆమెకేసి వంగాడు. వెక్కిరిస్తాడనుకొని తలపైకెత్తి చూసింది. కాని విచారంగా, స్నేహపాత్రంగా ఉంది అతనిముఖం. చిరునవ్వు నవ్వింది. అతనూ చిరునవ్వు నవ్వి మాట్లాడకుండా చక్కాబోయాడు. అపుదామనుకుంది కాని ఏమని ఆపాలా తోచలా ఎలాగ్గైతేనేం పదకొండు కొట్టింది! నిరీక్షించింది! నిరీక్షించింది! ఇంకేమీ చేయలేకపోయింది. ఆలోచించడమే మానేసింది. హృదయం గబగబా, గబగబా కొట్టుకోసాగింది. కాలం గబగబా గబగబా పరుగెత్తుతోంది. పావుగంట, అర్ధగంట, ముప్పావుగంట గడిచింది. ...ఉలిక్కిపడి గంటలువింది. గడియారం పన్నెండుకొట్టలా, ఒంటి గంట కొట్టింది. 'రాడు చెప్పకుండానే వెళ్ళిపోతాడు!' అనుకుంది. ఈ భావం చర్రున తలకెక్కింది. ఈ భావంతోపాటు రక్తంకూడా చర్రున తలకెక్కింది. ఉక్కిరిబిక్కిరై నిట్టూర్పు విడవాలనుకుంది...గదిలోకి పరిగెత్తు కెళ్ళి ముఖం మీద చేతులుపెట్టుకొని పక్కమీద పడిపోయింది.

అరగంటవరకూ ఎక్కడా చలనంలేకుండా పడుకుంది. కన్నీళ్ళు వేళ్ళసందుల్లోనించి తలగడమీదికి ప్రవహించాయి. చట్టున లేచికూర్చుంది. ఆమెలో ఏదో విచిత్రం జరిగింది! ముఖకవళిక మారిపోయింది. కన్నీళ్ళు వాటంతట అవే ఇంకిపోయాయి. కళ్ళు వెలిగిపోతున్నాయి. కనుబొమలు ముడిచి పెదవులు నొక్కుకుంది. ఇంకో అరగంట గడిచింది. ఆఖరిసారి విందీ. ఆమెకు చిరపరిచయమైన స్వరమేనా అది?...లేచి హాటుపెట్టుకుని బుజాన జుబ్బావేసుకుని ఎవరికంటా బడకుండా ఇంట్లోనించి చల్లగా బయట పడి పెద్దపెద్ద అంగలువేసుకుంటూ బెర్సనీవ్ ఇంటిదారినే బయలుదేరింది.

# ౧౮

తలవంచుకుని ముందువైపే సూటిగా దృష్టి సారిస్తూ ఎలీనా నడుస్తోంది. ఆమె భయపళ్ళేదు. తాను చేస్తున్న పని వివేకవంతమైందా కాదా అని ఆలోచించలేదు. ఇంకోమారు ఇన్సరోవ్‌ని చూడడమే ఆమె వాంఛ. కారుమేఘాలు సూర్యుని కప్పివేశాయి. గాలి బొంయిమని వీస్తోంది. దుమ్ములు గాలికి అటు ఇటూ ఎగురుతున్నాయి. దుమ్ము హఠాత్తుగా లేచి ఇనప స్తంభంలాగా రోడ్డువెంట పరుగెడుతోంది – కాని ఇవేమీ ఆమె గమనించలేదు ... పెద్ద పెద్ద వానచినుకులు పడ్డాయి. వాటినీ గమనించ లేదు. తర్వాత తర్వాత చినుకులు క్రమంగా ఇంకా పెద్దవైనాయి. మెరిసింది. ఉరిమింది. ఎలీనా ఆగి నలువంకలా చూసింది. అదృష్టవశాత్తూ దగ్గరలోనే ఓ పాడుపడ్డ బావిమీద పడిపోయిన పాతగుడి కనిపించింది. గుళ్ళోకి పరుగెత్తి వసారాలో కూర్చుంది. కుండపోతగా వర్షం కురుస్తోంది. ఆకాశం ఎక్కడా కనిపించడంలా. నిస్పృహతో వత్తుగాపడుతున్న వానచిను కులకేసి చూసింది. ఇన్సరోవ్‌ని చూడగల్గుతాననే ఆశాంకురం అంతరించింది. ఓ ముసలిముష్టిది గుళ్ళోకివచ్చి వణుకుతూ నమస్కరించింది. మూలుగుతూ, మెలికృతూ బావిపక్కన చప్టామీద కూర్చుంది. ఎలీనా జేబులో చెయ్యి పెట్టుకుంది. అలా ఎలీనా జేబులో చెయ్యిపెట్టుకోవడం ముసలిది చూసింది. ఇప్పుడు ముడతలుపడి పాలిపోయున్నా ఒకొప్పుడు చాలా అందంగా ఉన్న ఆ ముసిల్దాని మొహం వికసించింది. 'దండం, అమ్మా దండం' అని ప్రారం భించింది. కాని ఎలీనా పర్సు జేబులోలేదు. ముసలిది చెయ్యిచాచింది.

"నా దగ్గిరేం డబ్బులేదు. యిదిగో యిది తీసుకో. యెందుకైనా పనికొస్తుంది." అని జేబురుమాలా ఇచ్చింది ఎలీనా.

"యీ జేబురుమాలా నేనేం జేసుకోనమ్మా. సరే - పోనీ మా మనవ రాలికి పెళ్ళినాడు చదివిస్తాను. నువు చల్లగా వర్ధిల్లాలి" అంది ముసిల్ది.

మళ్ళీ పెద్దగా ఉరిమింది.

"క్రీస్తుదేవుడు మనల్ని రక్షించుకాక" అని గొణిగి ముమ్మారు నమస్కరించి కొంచెం ఆగి అన్నది: "నిన్నిదివరకు చూసాననుకుంటానమ్మా, చర్చిలో నాకు ముష్టిపెట్టింది నువు కాదూ?"

ఎలీనా ఆమెని పరీక్షగా చూసి గుర్తుపట్టింది.

"ఆ - నేనే. 'విచారంగా వున్నావేం?' అని అప్పుడు నను అడిగావు గదూ!"

"ఔను. అడిగానమ్మా, అడిగా. నిన్ను బాగా యెరుగుదును. యిప్పడూ విచారంగా వున్నట్టే కనిపిస్తున్నావు. నీ రుమాలు కన్నీళ్ళతో తడిసిపోయింది కూడా. ఓ - పడుచు పిల్లలకి యెపుడూ యిలాంటి విచారాలే. విచారాలే."

"యేవిటా విచారం, అవ్వా?"

"యేవిటా? నాబోటి ముసలిముండ మాటల్లో మీకు నమ్మక ముంటుందా తల్లీ! నీ కెందుకు విచారంగా వుందో నాకు తెలుసు. నువ్వొక్క దానివే గాదు యిలా విచారపడుతోంది! నా పడుచుతనంలో నేనూ యిలాంటి అవస్థలేపడ్డా. ఔను. నామీద దయజూపినందుకుగాను వొక్క మాట చెబుతా విను. యెవరైనా మంచివాడూ, నిలకడైనవాడూ దొరికితే వాణ్ణి అంటిపెట్టుకుని వుండు. ఘట్టిగా అంటిపెట్టుకొని వుండు. ఆ-అలా జరిగితేసరే మంచిదే. అలా జరక్కపోతే భగవంతుడియిచ్ఛ అలావుందన్న మాట...యెందుకూ ఆశ్చర్యపోతూ చూస్తావు? నేను సోదిచెప్పేదాన్నే. నీ విచారాన్నంతా దిగదీసేయమంటావా? తీసేస్తాను. యిక నీకు విచార మంటూ వుండదు. చూడు, వాన యేవంతజోరుగా పడుతున్నట్టు లేదు. నువ్వింకా కాసేపు ఆగు. నేనుమాత్రం వెళ్ళిపోతా. వాన్లోతడవడం నాకిదేం మొదటిసారా? దుఃఖాలువస్తాయి, పోతాయి. కాని వాటి చాయలేం మిగలవ్. ఈ ముక్కలుమాత్రం మర్చిపోకు. భగవంతుడు నిన్నురక్షిస్తాడులే అమ్మా!"

ముసిలిది లేచి గుడిబయటికి వెళ్లి తూలుతూ తన దోవను తాను పోయింది. ఎలీనా ఆమెని అబ్బురంగా చూసి "యేమిటి దీని అర్థం" అని గొణుక్కుంది అనాలోచితంగా.

వాన క్రమేపీ తగ్గిపోసాగింది. ఒక క్షణం సూర్యుడు గోచరించాడు. ఎలీనా గుళ్లోంచి వెళ్ళిపోదామనుకుంటోంది......హఠాత్తుగా గుడికి నాలు గడుగుల దూరంలో ఇన్సరోవ్ కనిపించాడు. కుడితిని దగ్గరగాలాక్కుని ఆమె వచ్చినబాటవెంట వెడుతున్నాడు. ఇంటికి తొందరగా చేరుకోవాలనట్టుగా ఉంది అతనివైఖరి. పడిపోకుండా మెట్లపక్క ఉన్న చువ్వలు పట్టుకుని అతన్ని పిలవాలని చూసింది. కాని మాటపెగిలి పైటికిరాలేదు.

...ఇన్సరోవ్ తలెత్తకుండానే వెళ్ళిపోయాడు.

"డిమిట్రీ నికనరోవిచ్!" అని ఎట్లాగయితేనేం అనగల్గింది. ఇన్సరోవ్ టపీమనిఆగిపోయి, చుట్టూచూశాడు. ముదట ఆమెని గుర్తుపట్టలా. వెంటనే దగ్గిరికివెళ్ళి "నువ్వా! నువ్వా! యిక్కడా?" అన్నాడు బిగ్గరగా.

మాట్లాడకుండా ఆమె గుళ్ళోకి వెళ్ళింది. అతను ఆమెవెనకాలే వెళ్ళాడు.

"నువ్వా! యిక్కడా!" అని మళ్లీ అడిగాడు.

అప్పటికీ ఆమె మాట్లాడలేదు. అతనికేసి తదేకదృష్టితో, కాంక్షతో చూసింది. అతను కిందకుచూశాడు.

"మాయింటిదగ్గిర్నించేనా రావడం?" అని అడిగింది.

"ఉహుం-మీ యింటిదగ్గిర్నించికాదు."

"కాదూ?" అని చిరునవ్వు నవ్వాలని ప్రయత్నించింది.

"ఒహో - యీవిధంగానే చేసిన వాగ్దానాలు నిలబెట్టుకుంటావన్న మాట! నీకోసం పొద్దున్నంతా కాచుక్కూచున్నా."

"ఎలీనా నికొలయెవ్నా. అటువంటి వాగ్దానం నిన్న నేనేం చేయలేదే!"

ఎలీనా చిరునవ్వు నవ్వాలని యత్నించి మొహం తుడుచుకుంది. ఆమె మొహం, చెయ్యీ, రెండూ పాలిపోయున్నాయి.

"సరే-మాతో చెప్పకుండానే వెళ్ళిపోదామనుకున్నావు కదా!"

"ఆ–" అన్నాడు ఇన్నరోవ్ ఖచ్చితంగా. స్వరం కర్కశంగావుంది.

"యేమిటి? మనిద్దరం కలిసి మాట్లాడుకున్నమాటలు, మన స్నేహం అంతా మరచేపోయి యిక్కడ నిన్ను కలుసుకోకపోతే" స్వగతం చిం. ఒకనిమిషం ఆగి అంది. 'అలానే వెళ్ళిపోయేవాడివి కదూ! ఆఖరికి కనికసించ చేయకుండానే. నీ మనసుకేం కష్టంవేసేదికాదుకదూ!"

ఇన్నరోవ్ ముఖం తిప్పుకుని "ఎలీనా! అలా అనకు. నేనేం సంతోషంగా వస్తున్నాననుకున్నావా? నామాట నమ్ము. యీ నిర్ణయం తీసుకోవడానికి యెంతో ప్రయాసపడవలసివచ్చింది. నేనెందుకు యిలా నిర్ణయించుకున్నానో నీకు తెలిస్తేనా!" అన్నాడు.

"నువ్వెందుకు వెళ్ళిపోతున్నావో తెలుసుకోవాలని నాకేంలేదు." అని అడ్డంవచ్చింది, భయపడుతూ భయపడుతూ. "యిలా జరగవలసివుంది. మనం విడిపోవాలి. వూరికే నువ్వు స్నేహితుల్ని నొప్పించవు. కాని స్నేహితులు యిలానే విడిపోతారా? మనం స్నేహితులం. కామా?"

"మనమేం స్నేహితులం కాం."

"యేమన్నావూ?" ఆమె చెక్కిళ్ళు ఎర్రబారాయి.

"మనం స్నేహితులం కాకపోవడంవల్ల కాదు, నేను వెళ్ళిపోతున్నది. చెప్పదలచుకోనిమాటలు వెళ్ళగక్కించకు."

"నువు దాపరికంలేకుండా నాతో మాట్లాడేవాడివే! జ్ఞాపకముందా?" అని సౌమ్యంగా అధిక్షేపించింది.

"అవును. అప్పుడు దాపరికంలేకుండా మాట్లాడేవాణ్ణి. అప్పుడు దాయడానికేంలేదు. కాని యిప్పుడు..."

"కాని యిప్పుడు యేం వచ్చిందేం?" అని అడిగింది ఎలీనా.

"కాని యిప్పుడు...కాని యిప్పుడు నేను వెళ్ళిపోవాలి శెలవు."

ఇన్నరోవ్ గనక ఆ సమయంలో ఎలీనాకేసి చూసి ఉన్నట్టయితే తన మొహం విచారగ్రస్తమై నల్లబడ్డకొద్దీ ఆమెమొహం వికసిస్తోందని గమనించేవాడు. కాని అతను నేలకేసి దృష్టినిలిపాడు.

"సరే–శెలవు. డిమిట్రీనికనరోవిచ్! యెలానో కలుసుకున్నాంగా. చెయ్యనన్నా యిలాయియ్యి" అంది.

ఇన్సరోవ్ చెయ్యి జాపాడు.

"ఉహుఁ-అదీ యియ్యలేను" అని మళ్ళీ మొహం తిప్పుకున్నాడు.

"యియ్యలేవా ?"

"ఉహుఁ-శెలవు"

గుమ్మంకేసి బయలుదేరాడు.

"ఒక్క-నిమిషంఆగు. నేనంటే నీకుభయమల్లేవుందే?...నీకంటె నాకే ధైర్యంయెక్కువ" అంది. ఆమెశరీరమంతా వణికిపోయింది. "నేనిక్కడ యెందుకున్నానో చెప్పనా? చెప్పనా? నేను యెక్కడికి వెళుతున్నానో నీకు తెలుసా ?" అంది.

అతను ఆశ్చర్యంతో ఆమెకేసి చూశాడు.

"నినుచూడడానికి వెళుతున్నా."

"నన్నా ?"

ఎలీనా ముఖం చేతుల్లో కప్పుకుంది.

"నిన్ను ప్రేమిస్తున్నాననేమాట నానోటంట వెళ్ళగక్కించ దల చావా? ఊఁ-చెప్పేశా!" అంది మెలమెల్లగా.

"ఎలీనా!" అని బిగ్గరగా అన్నాడు. ఇన్సరోవ్.

మొహంమీదనించి చేతులుతీసేసుకుని తేరిపారజూచి అతని వక్షః స్థల మీద వాలిపోయింది.

ఏమీ మాట్లాడకుండా ఆమెను దగ్గిరగా తీసుకున్నాడు ఇన్సరోవ్. ఆమెను ప్రేమిస్తున్నానని చెప్పడం అవసరమనిపించలా. 'ఎలీనా'అన్న ఆ అరుపూ.అమాంతంగా అతనితనువంతటిలోకలిగినమార్పూ, ఎంతోవిశ్వాసంతో ఆమెఆనుకున్న వక్షఃస్థలం ఉబుకుతబుకులూ, ఆమెజుట్టును తాకిన చేతివేళ్ళ కొనలూ - ఇవన్నీ అతనిప్రేమను వెల్లడించాయి. అతనేమీ మాట్లాడలేదు. ఆమెకూడా పలకరించలేదు. 'యిక్కడేవున్నాడు. నన్ను ప్రేమిస్తున్నాడు. యింకేంకావాలి?' అనుకుంది. పరమానందంలోని ప్రశాంతతా, నిశ్చల ఆశ్రయంలోని ప్రశాంతతా, లక్ష్యసిద్ధిలోని ప్రశాంతతా, మృత్యుదేవతకు కూడా అర్థం, సౌందర్యం గోచరింపజేసే పవిత్ర ప్రశాంతత ఆమెను ముంచెత్తివేశాయి. ఆమెకి కావలసిందంతా లభించింది. అందుకే ఏమీ

కోరలేదు. 'సోదరా, మిత్రమా, ప్రియతమా!' అని చెవిలో అన్నది. తన వక్షంలో కొట్టుకుంటూ, ఎంతో మధురంగా కరిగిపోతున్న హృదయం అతనిదో తనదో ఆమెకే గ్రాహ్యంకాలేదు.

జీవితాన్నంతటినీ తనకు సమర్పించిన ఆ యువతిని తన బలీయ బాహువులతో పట్టుకుని కదలకుండా మెదలకుండా అలానా నిల్చున్నాడు ఇన్నోవ్. తన వక్షంమీద ఓ కొంగ్రొత్త మధురిమ, అపార మధురిమ ఉందనే చైతన్యం కల్గింది. కృపా, మాటలకందని కృతజ్ఞతా అతని కటిక గుండెను ఛేదించివేశాయి. ఎన్నడూ కన్నీళ్ళెరగని వాడికి కన్నీళ్ళు ప్రవహించాయి.

కాని ఎలీనా ఏడవలేదు. 'సోదరా, మిత్రమా, ప్రియతమా!" అని మాత్రం పదేపదేఅంది.

పావుగంట అయినాక ఆమెను వదలకుండానే

"నేను వెళ్ళినచోటికల్లా నాతో వస్తావా?" అని అడిగాడు

"యెక్కడికైనాసరే-భూమి చివరకైనాసరే వస్తాను. నువ్వెక్కడవుంటే నేనూ అక్కడే వుంటాను."

"భ్రమ పట్టంలేదుగదా! మీ తలిదండ్రులు మన వివాహానికి వొప్పుకోరు. తెలుసా?"

"నేనేం భ్రమపట్టంలేదు. మా తలిదండ్రులు వొప్పుకోరనీ తెలుసు."

"నేను బీదవాణ్ణి, చిల్లిగవ్వయినా నాదగ్గిరలేదు. తెలుసా?"

"ఆ - తెలుసు."

"నేను రష్యన్‌నుకాను. నా జీవితపరమావధి అంతా రష్యాకైటనే. నీ దేశంతో, నీ వారితో, బంధనాలు తెంచేసుకోవాల్సింది వుంటుంది. తెలుసా?

"తెలుసు. తెలుసు!"

"నేను ఓ మహత్కార్యానికి - క్లిష్ట, కృతజ్ఞతారహిత మహత్కార్యానికి - నా జీవితం అంకితంచేశాను. నువు అపాయాలను యెదుర్కోవాలసి రావడమేకాదు, అవమానాలకూ, కష్టాలకూ గురికావలసివస్తుంది. తెలుసా."

"ఆ-నాకు అంతాతెలుసు...నిను ప్రేమిస్తున్నా. అంతే."

"పాత అలవాట్లన్నీ వదులుకోవాల్సి వుంటుంది. అక్కడ, కొత్తవారి మధ్య వొంటరిగా కష్టపడి పనిచేయాల్సి వుంటుంది."

అతని నోటిమీద ఆమె చెయ్యివేసి అంది:

"నిను ప్రేమిస్తున్నా, ప్రియతమా!"

ఎర్రబారిన ఆమె సున్నితహస్తాన్ని ఆప్యాయంగా అతను ముద్దెట్టుకున్నాడు. ఆమె చేతిని వెనక్కి లాక్కోలేదు. అతను ఎలా ముద్దులవర్షం కురిపిస్తున్నాడో పసిపిల్లలా, ఉల్లాసంతో, జిజ్ఞాసతో కనిపెట్టి చూసింది.

హఠాత్తుగా సిగ్గుపడి అతనివక్షంలో మొహం దాచుకుంది.

మృదువుగా ఆమె తలయెత్తి కళ్ళల్లోకి తదేకదృష్టితో చూస్తూ అన్నాడు:

"నా భార్యవి, పెద్దలసాక్షిగా, దైవసాక్షిగా నా భార్యవి..."



# ౧౯

ఓ గంట తర్వాత ఎలీనా ఓ చేత్తో హాటూ, ఓ చేత్తో జుబ్బా పట్టుకుని కచేరీ బిల్డింగ్‌లోకి చప్పుడు కాకుండా ప్రవేశించింది. జుట్టు కొంచెం చిందర వందరగా ఉంది. చెక్కిళ్ళు కొద్దిగా ఎర్రబారున్నాయి. పెదవులమీద మందహాసం ఇంకా తాండవిస్తూనే ఉంది. సగం మూసుకున్న కళ్ళు కూడా మందహాసం చేస్తున్నాయి. బాగా అలిసిపోయి ఆమె కదలలేకపోతోంది. ఆ అలసటా ఆమెకి సమ్మోదంగానే ఉంది. ఆ అలసటే గాదు ప్రతీదీ ఆమెకి సమ్మోదంగానే ఉంది. ప్రతివారూ కరుణాశీలురుగా ప్రేమపాత్రులుగా ఆమెకి కనిపించసాగారు. యువాక్ ఇవనోవిచ్ కిటికీదగ్గిర కూర్చుని ఉన్నాడు. అతని దగ్గిరికి వెళ్ళి భుజంమీద చెయ్యేసి ఆవలించి వొళ్ళు విరుచుకుంది. ఎందుకో గాని నవ్వాపుకోలేకపోయింది.

"ఎందుకు నవ్వుతున్నావు?" అని యువాక్ అడిగాడు ఆశ్చర్యంగా చూస్తూ.

ఏం చెప్పాలో ఆమెకి తోచలా. యువార్‌ని ముద్దుపెట్టుకోవాలనిపించింది.

"బుఝంగ్" అన్నది ఎలాగైతేనేం.

యువాక్ కనుబొమలు కాసంతైనా ఎత్తకుండా ఆమెకేసి ఆశ్చర్యంతో చూడసాగాడు. హాటు, జుబ్బా అతనిమీద పడేట్టు ఎలీనా వదలేసింది.

"యువాక్ ఇవనోవిచ్! అలిసిపోయాను. నిద్ర ముంచుకొస్తోంది." అని అతనిపక్కన ఉన్న పడకకుర్చీలో పడుకుని తిరిగి నవ్వనారంభించింది.

"హుం" చేతివేళ్లు ఆడిస్తూ విచారంతో మూలిగి యువార్ అన్నాడు:

"ఆ-యేమిటంటే...ఆ..."

ఎలీనా చుట్టూచూసి అనుకుంది: "తొందరలోనే వీటన్నిటినీ వదిలి పెట్టి కదిలిపోవాలిసివస్తుంది. చిత్రం! నాకేం భయంవేయడంలేదు. అనుమానం వేయడంలేదు. పశ్చాత్తాపం కలగడంలేదు. కాని పాపం! అమ్మని తలుచుకుంటే జాలేస్తుంది."

ఆమె మనోవీధిలో ఇందాకటి గుడి ప్రత్యక్షమైంది. అతని గొంతు విన్పించింది. అతని బాహుబంధంలో చిక్కుకున్నట్లనిపించింది. హృదయం ఆనందిస్తున్నట్లూ, ఆ ఆనందంతో అలిసిపోయినట్లూ, ఉంది. గుళ్ళో కనిపించిన ముసిలిది జ్ఞప్తికివచ్చి "నా దుఃఖాన్ని తీసివేసివెళ్లుంది" అనుకుంది. "ఓహో, యేమానందం! యే మానందం! యింత ఆనందానికి తగినదాన్ని కాకపోయినా, యే మానందం! హఠాత్తుగా యిదంతా యెలా జరిగి పోయింది." ఇంకా కొంచెం ఆలోచించి ఉంటే మధురమధుర కన్నీటి ధారకు లోనైయ్యేదే. నవ్వు మూలంగా కన్నీళ్ళు ఆపుర్లో గిరింది. ఆ పడక కుర్చీలో ఎలా పడుకున్నా సహాయంగానే ఉన్నట్లు, ఉయ్యాలలో పడుకుని ఊగుతున్నట్లు భావించింది. ప్రతి కదలికలో మాంద్యం, సౌమ్యం ఉట్టిపడుతున్నాయి. పూర్వపు తత్తరపాటూ, తొందర ఏమైపోయినాయో! జోయా గదిలోకివచ్చింది. అంత అందమైన సుహాన్ని ఎన్నడూ తాను చూడలేదని అనుకుంది ఎలీనా. అన్నా కూడా వచ్చింది. ఎలీనా మహావేదన పొందింది. అయితేనేం తల్లి నుదిటిమీద, నెరసిపోయిన ముంగురులకింద ఎంతో అప్యాయంగా ముద్దుపెట్టుకుని తనగదికి వెళ్ళిపోయింది. ఆ గదిలో ప్రతివస్తువు ఆమెని చూసి మందహాసం చేస్తున్నట్టనిపించింది. విజయ, విశ్రమతాభావాలతో పక్కమీద కూర్చుంది. ఆ పక్కమీదే మూడుగంటలకితం ఎంత బాధపడింది!

"అయినా అతను నన్ను ప్రేమిస్తున్నాడని అప్పటికే నాకు తెలుసు. ఆ – అంతకుముందుకూడా ... ఉహుం – పాపిష్టి ఆలోచన!... నీవు నా భార్యవు!" అని గొణుక్కుని ముహంచేతులతో కప్పుకొని మోకాళ్ళ మీద వాలింది.

సాయంకాలానికి ఆమె భావాలు ఇంకా తీవ్రరూపం తాల్చాయి. తొందరలో ఇన్సరోవ్‌ను చూడడం పడదనేభావం ఆమెని కుంగదీసింది.

బెర్సెనీవ్‌కి అనుమానంకలగకుండా అతనితోకలిసి ఉంటూ మెలగడం సాధ్యంకాదు. అందుకని ఈ కింది ఏర్పాట్లుచేసుకున్నారు: ఇన్సరోవ్ మాస్కో వెళ్ళిపోయి శరత్కాలంలోగా రెండుమూడుసార్లు వారినిచూట్టానికి రావడం; ఇక ఎలీనా తరుచు ఉత్తరాలు రాస్తుఉండేట్టు, వీలైతే కంట్సోవో సమీపంలో రహస్యంగా కలుసుకుంటూ ఉండేట్టు. ఇదీవారి ఏర్పాటు. టీకి కచేరీ సావిడిలోకి ఎలీనా వచ్చింది. కుటుంబంలో వారంతా అక్కడ కనిపించారు. షూబిన్‌కూడా అక్కడే ఉన్నాడు. ఆమె వచ్చీరావడంతో షూబిన్ పరిశోధనా దృక్కులు పరిపాడు. పూర్వం మాదిరిగానే స్నేహంగా అతనితో మాట్లాడుదామనుకుందిగాని అతని లోచూపులకు, అవి తనలో రేపే ప్రతిక్రియకు భయపడిపోయింది. రెండువారాల పైచిలుకునించీ తనజోలికి షూబిన్ రాకపోవడానికి కారణ మేదో ఉందని ఊహించింది. అంతలో బెర్సెనీవ్‌వచ్చి చెప్పకుండా వెళ్ళిపోయినందుకు క్షమాపణ చెప్పుకుంటూ ఇన్సరోవ్ పంపిన అభివందనాలు అన్నాకు వినిపించాడు. ఆ రోజున ఇన్సరోవ్ పేరు ఎలీనా వినడం అదే మొదటిసారి. ఆమెకు సిగ్గేసింది. అంత మంచి స్నేహితుడు హఠాత్తుగా వెళ్ళిపోయినందుకు విచారం తెలుపుదామనుకుందిగాని మోసపుమాటలు మాట్లాడడం ఆమెకి చేతగాలా. కదలకుండా మెదలకుండా కూర్చుంది. అన్నామాత్రం నిట్టూర్చింది, విచార పడింది. ఎలీనా బెర్సెనీవ్ పక్కన అట్టే ఉండాలని యత్నించింది. బెర్సెనీవ్‌కి వాళ్ళ రహస్యం కొంతవరకు తెలుసు. అయినా అతనంటే ఆమెకి భయంవేయలా. పరిశోధనా దృష్టులు ఇంకా పరుపుతున్న షూబిన్‌నించి తప్పించుకుంటానికి బెర్సెనీవ్‌ని ఆశ్రయం చేసుకుంది. సాయంకాలమైన కొద్దీ బెర్సెనీవ్‌కూడా ఆందోళన చెందసాగాడు. ఎలీనా ఇంకా కుంగి పోతుందని భావించాడు. కాని అలా జరగలేదు. ఇంతలో అదృష్టవశాత్తూ లలితకళలమీద షూబిన్ బెర్సెనీవ్‌లు చర్చ ప్రారంభించారు. ఎలీనా దూరంగా కూచుని కలలో వింటున్నట్టు వారి మాటలు వింటోంది. క్రమేపీ వారేకాదూ— ఆ గదీ, ఆ గదిలోని సమస్తమూ కరిగిపోయి ఆ కలలో కలిసి పోతున్నట్టు ఆమెకు అనిపించింది. బల్లమీది టీపాయి, యువార్ ఇవనోవిచ్ పొట్టివేస్టుకోటూ, జోయా గోళ్ళూ, గోడమీది కొన్‌స్టాంటిన్ పావ్లొవిచ్ ప్రభువు చిత్రపటం, అవన్నీ ఆమెనించి దూరదూరంగాపోయి, మసక

మనకై చివరకు అంతర్థానమయాయి. వాటిమీద ఎలీనాకు జాలేసింది. అంతే "వీరంతా యెందుకూ జీవించడం" అనుకుంది.

"నిద్ర వొస్తోందా, లెనోచ్కా" అని అడిగింది తల్లి. కాని తల్లి ప్రశ్న ఎలీనాకు వినపడనేలేదు.

"కొంతవరకు సమర్థనీయమైన సూచన..." అన్న షూబిన్ మాటలు హఠాత్తుగా ఎలీనాను ఆకర్షించాయి. "అటువంటి సూచనే యింపుగా వుంటుంది. సమర్థనీయమైన సూచన నిరాశ గొల్పుతుంది. అది క్రైస్తవమత విరుద్ధం. సమర్థనీయంకాని సూచన ఉదాసీనత కల్గిస్తుంది. వట్టి చీఁ పితనంగా వుంటుంది. కొంతవరకు సమర్థనీయమైన సూచన - నీకు కోపం కల్గిస్తుంది. వొళ్ళు మరచేటట్టు చేస్తుంది. చూడు, మనలో వొకర్ని ఎలీనా ప్రేమిస్తోందని అన్నాననుకో, యిది యేవిధమైన సూచన?"

"ఆ - మాన్షియర్ పాల్! నీ మాటలవల్ల నాకెంత కోపం వస్తుందో చూపించాలని వుంది. కాని చూపించలేను. పూర్తిగా అలిసిపోయా." అంది ఎలీనా.

"అలాగయితే వెళ్ళి పడుకో" అన్నది అన్నా.

సాయంకాలంపూట కాసేపు కునుకుదీయడం ఆమెకి అలవాటు. అందుకని ఇతర్లనికూడా నిద్ర పొమ్మని ప్రోత్సహించడం ఆవిడకి ఆహ్లాదంగా ఉంటుంది.

"రా, ముద్దిచ్చి వెళ్ళిపడుకో. ఆంద్రీపెట్రోవిచ్ నిను క్షమిస్తాడులే."

ఎలీనా తల్లిని ముద్దెట్టుకుని, అందరికి వంగి నమస్కరించి గదివిడిచి వెళ్ళింది. షూబిన్ గుమ్మందాకా ఆమెని అనుసరించి గుమ్మంలో "ఎలీనా నికొలయెవ్నా, నువు మాన్షియర్ పాల్ని కాళ్లకింద నిర్దాక్షిణ్యంగా తొక్కేయగలవు. అయినా మాన్షియర్ నిను ఆశీర్వదిస్తున్నాడు. నీ చిన్నిపాదాలను, అవి ధరించే పాదరక్షల మడమలను ఆశీర్వదిస్తున్నాడు" అన్నాడు.

ఎలీనా బుజాలు ఎగరవేసి ఇష్టంలేకపోయినా చేతిని - ఇన్సరోవ్ ముద్దిడుకున్న చేతిని మాత్రంకాదు - అందిచ్చింది. తర్వాత తన గదికివెళ్ళి దుస్తులు తీసేసి పండుకుని చంటిపిల్లలుకూడా ఎరగనంతటి గాఢనిద్ర పోయింది. జబ్బుచేసి కోలుకొన్నాక పక్కన తల్లి కూర్చుని తేరిపారజూస్తూ సక్రమ ఉచ్ఛ్వాసనిశ్వాసాలు వింటూంటే, నిద్రపోయే పసిపిల్లలాగా ఎలీనా నిద్రపోయింది.

# ౨౦

"ఓక్షణం నా గదిలోకిరా" అన్నాడు షూబిన్, అన్నా వాసిలెవ్నా దగ్గిర బెర్సెనీవ్ శెలవుతీసుకోగానే. 'నీకు చూపించాలిసిందివుంది.'

బెర్సెనీవ్ అతనితో గదిలోకివెళ్ళాడు. అక్కడ చిన్నచిన్న విగ్రహాలు, అర్ధాకృతి విగ్రహాలు, పూర్తిగాని విగ్రహాలు తడిగుడ్డల్లో చుట్టబడి గది నాలుగుమూలలా ఉండడం చూచి చకితుడై,

"ఉం-బోలెడెంత పనిచేశావన్నమాట." అని వ్యాఖ్యానించాడు.

"యేదోవొక పనిచేయాలిగా!" అని జవాబిచ్చాడు షూబిన్. "వొకవిషయంలో అదృష్టం పట్టకపోతే, యింకోదానితో చూసుకోవాలిగదా! పైగా నేను కార్నికన్‌లాంటివాణ్ణి. నాకు శుద్ధకళలమీద మీదకంటే ప్రతీకారంమీదే ఆసక్తి యెక్కువ."

"నీ మాటలు నాకేం అర్థంకావడంలా" అన్నాడు బెర్సెనీవ్.

"కాస్త ఆగు, నువ్వే చూస్తావుగాని యిదిగో చూడు! నా ఉత్తమ మిత్రుడు! మహోపకారి! ప్రతీకారం నెం 1."

షూబిన్ ఒక పొట్లం ఊడదీసాడు. ఇన్సరోవ్ అర్ధాకృతి విగ్రహం కన్పించింది. ఆ విగ్రహం అద్భుతంగా, అచ్చంగా ఇన్సరోవ్‌లానే ఉంది. సూక్ష్మ సూక్ష్మ వివరాలతో ఆకృతిని షూబిన్ బాగాపట్టుకొచ్చాడు.

ఆ మొహంలో ఠీవి, నిష్కాపట్యం, ఉదారతా, ధైర్యస్థైర్యాలు ప్రస్ఫుటమవుతున్నాయి. బెర్సెనీవ్ సంతోషంతో పొంగిపోయాడు.

"బలే పసందుగావుంది! అభివందనాలు. ప్రదర్శనానికి పంపడానికి బహుయోగ్యంగా వుంది. యింత గొప్పవిగ్రహాన్ని ప్రతీకారం అంటా వేమిటి?"

"యెందుకంటే, యీ గొప్పవిగ్రహాన్ని ఎలీనాకు పుట్టినరోజు పండగ నాడు బహూకరిద్దామనుకుంటున్నా. దీంటోవున్న వ్యంగ్యం అర్థమైందా?... మనమేం గుడ్డివాళ్ళంగాం. మనచుట్టూ యేం జరుగుతోందో కనిపెట్టగలం. కాని మనం పెద్దమనుషులం. పెద్దమనుషులం లాగానే పగతీర్చుకుంటాం."

"చూడు" అన్నాడు మళ్ళీ ఖూబిన్ ఇంకో పొట్లం విప్పుతూ, "శిల్పకి అనునాతన రసవాదం ప్రకారం అన్నివిధాలైన పశులక్షణా లుంటాయనీ యీ పశులక్షణాల్ని యెదో గొప్పశిల్పంలో వెలువరిస్తాడనీ గమనిస్తే, యిదిగో, విగ్రహం నెం 2. మేం యీ నెం 2 విగ్రహంని తయారుచేసే పెద్దమనిషిలా కాకుండా కొంటె కోణంగిలాగా పగతీర్చుకున్నాం"

నీటుగా గుడ్డతీసిపారేసి *డాంటేశైలిలో నిర్మించిన ఇస్సరోవ్ విగ్రహాన్ని బెస్సనోవ్‌కి చూపించాడు. ఇంతకంటే ద్వేషాన్ని ఎగతాళిగా వెలిగక్కే విగ్రహాన్ని ఊహించడమే కష్టం. ఆ బర్రేరీగా యువకుని ఒక గొర్రెపొట్టేలుగా చిత్రించాడు. ఆ పొట్టేలు వెనకకాళ్ళు రెండూ పైకెత్తి కొమ్ములుకిందకి పెట్టి పొడవడానికి సిద్ధంగావున్నట్టుంది. ఆ గొర్రెపొట్టేలు మొహంలో గర్వం, పొగరుమోతనం, మొండిపట్టుదల, అల్పబుద్ధి గోచరిస్తున్నాయి. ఒక ఇస్సరోవ్ పోలిక విపరీతంగా ఉంది. బెర్సెనేవ్ నవ్వు ఆపుకోలేకపోయాడు.

"సరే-పసందుగా వుందా? నాయకుణ్ణి గుర్తించావా? యిదికూడా ప్రదర్శనానికి పంపనా? దీన్ని నా పుట్టినరోజున నాకు నేనే బహూకరించుకుందామని వుంది. ప్రభూ! వొక్క-తమాషా చూపిస్తా, చూడు."

ఖూబిన్ కాలమడమలతో వీపుమీద కొట్టుకుంటూ ఎగిరాడు. బెర్సెనేవ్ కిందపడ్డ గుడ్డతీసి విగ్రహం మీద కప్పాడు.

---

* డాంటే: (1265-1321) ఇటాలియన్ మహాకవి. ఇతని కవిత్వంతో ప్రపంచకవిత్వంలో నూతన అధ్యాయం ప్రారంభమైందని విమర్శకుల అభిప్రాయం. గొప్ప కవితాశిల్పి.

"ఓ విశాలహృదయా!" అంటూ ప్రారంభించాడు ఖూబిన్.

"విశాల హృదయానికి పేరుపడ్డ కీర్తికాయుడెవ్వడూ? పరవా లేదులే" అని మళ్ళీ ప్రారంభించాడు ఖూబిన్. గంభీరంగా, విషాదాంత నాటక నాయకుడిలా.

"నీ స్నేహితుని వినయం, సూక్ష్మబుద్ధి ప్రదర్శితమయే యింకోటి చూడబోతున్నావ్. శుద్ధకళాకారుడనైన నేను చెంపలు వాయించుకునే అవసరాన్ని గుర్తించానని దీంతో నమ్ముతావు."

గుడ్డ తీసేశాడు. జంటగా మొలిచినవా అన్నంత సమీపంగా ఉన్న రెండు తలకాయలు కనిపించాయి. మొట్టమొదట బెర్సనీవ్ వాటిని గుర్తించలేకపోయాడుగాని జాగ్రత్తగాపరిశీలించిన తర్వాత ఒకటి అనుష్ఠాతల అనీ, రెండోది ఖూబిన్ తలఅనీ గుర్తుపట్టాడు. అవి విగ్రహాలలాగాలేవు. వ్యంగ్యశిల్పాలలా ఉన్నాయి. చిన్ననుదురు, బుంగమొహంలో లోతుకళ్ళు, బాగా పైకి వంపుతిరిగిన ముక్కుగల నెరజాణగా అనుష్కా చిత్రించబడింది. అహంకారంతో బండపెదిమలు బిగించుకున్నట్లుంది. మొహంలో కామం, అమితసాహసం ప్రస్ఫుటమవుతున్నాయి. అయితే యీ లక్షణాల్లో దుష్టస్వభావంమాత్రం గోచరించడంలేదు. తొస్సుబుగ్గలు, బక్కచిక్కిన శరీరం, అట్టలుకట్టి నిర్జీవంగా వేలాడే జుట్టు, యెక్కడా జీవంలేని కళ్ళు, పీనుగముక్కులాగా కొనతేలిన ముక్కు. ఇవీ ఖూబిన్ శిలాకృతి లక్షణాలు.

బెర్సనీవ్ అసహ్యాభావంతో మొహం తిప్పుకున్నాడు.

"బలే జోడు — దీనికి తగిన పేరు నువ్వే పెతకాలి. మొదటి రెంటికి పేర్లు నేను ఆలోచించి వుంచా. అర్ధాకృతి విగ్రహంకింద 'మాతృదేశ రక్షణకు కంకణం కట్టిన నాయకుడు' అని రాస్తా. రెండోదానికింద 'మాంసాహారులారా! బహుపరాక్' అని రాస్తా. యిక దీనికింద–'శిల్పి పావెల్ యాకోవ్లెవిచ్ గమ్యస్థానం' అని రాస్తా. బాగుంటుందా యీ పేరు?"

"ఆగు" అన్నాడు బెర్సనీవ్. "వృథాగా కాలం యిలాంటి..." సరైనమాట దొరకలా. "చెత్త! అదేనా నీ వుద్దేశం? ఊహూఁ — ప్రదర్శనానికి పంపటమంటూ వస్తే దీన్నే పంపుతా." అన్నాడు ఖూబిన్.

"చెత్త! అదే సరైన పదం. కాని యేమిటీ వెధవ గొడవ? యిప్పటి వరకు దురదృష్టవశాత్తు మన కళాకారులకి యిలాంటి వెధవలక్షణాలు అబ్బినా

నీలో యిలాంటివేం యింతవరకు వృద్ధిపొందలేదే! యిప్పుడు నిన్ను నువ్వే అపకీర్తిపాలు చేసుకుంటున్నావు. తెలిసిందా?

"అలాగా?" అన్నాడు ఖూబిన్ విచారంగా.

"యింతవరకు అలాంటి లక్షణాలు తప్పించుకుని యికముందు వాటికి లోబడిపోయానంటే దానికంతటికీ బాధ్యత వొకానొకవ్యక్తిది. నాకు తాగుడు అలవాటయిందని నీకు తెలుసా" అని ముఖం చిట్లించుకున్నాడు.

"ఆ-నిజంగానే?"

"అవును నిజం." అని జవాబిచ్చి ఖూబిన్ పళ్ళు కొరుక్కున్నాడు. మొహం కొంచెం తేటపడింది.

"మద్యం నాకేంనచ్చలా. తాగుకూంటే గొంతులో పట్టుకుంటుంది. తర్వాత నాతిల పెద్ద ఢంకాలాగా అయిపోతుంది. ఆ మహానుభావు డున్నాడే లుస్పిషిన్-మాస్కోలో ఆయన్ని మించిన తాగుబోతు లేడులే-అసలు రష్యాలోనే అంతటి తాగుబోతు లేడని కొందరంటారు - ఆయన అన్నాడు: 'తాగుడులో నువ్వేం, గొప్పవాడివి కాలేవులే' అని. ఆయన చెప్పిందాన్నిబట్టి 'బుడ్డి మనకి పలకదు'."

ఒళ్ళుమండించే ఆ విగ్రహాన్ని బెర్సెనీవ్ బద్దలుకొట్టేయాలను కున్నాడుగాని ఖూబిన్ ఆపేసి 'ఉహు-దాన్ని అలా పడుండనీ. అది దిష్టిబొమ్మ కిందపనికొస్తుందిలే' అన్నాడు. బెర్సెనీవ్ నవ్వి అన్నాడు:

"అయితే-సరే-నీ దిష్టిబొమ్మ జోలికి పోనులే, శుద్ధ, అమరకళకు జే!"

"కళకు! మంచికి మెరుగుపెట్టి, చెడులోని దోషాన్ని తీసిపారేసే కళకు జై" అన్నాడు ఖూబిన్.

మిత్రునిదగ్గిర శెలవుతీసుకుని బెర్సెనీవ్ వెళ్ళిపోయాడు.

## ౨౧

నిద్రలేవగానే ఎలీనాను సంతోషం, భయంగా పెనవేసుకున్నాయి. "నిజ గానే, నిజంగానే!" అని తనుతాను ప్రశ్నించుకుంది. సంతోషంతో గుండె నెమ్మదిగా కొట్టుకోసాగింది. కిందటి రోజున జరిగిన ఘటనల స్మృతి ఆమెపై వెల్లువలా ప్రవహించి ముంచెత్తివేసింది. కాని మహదానందం వల్లకలిగే శాంతి ఆమె నావరించింది. పొద్దెక్కినకొద్దీ ఆందోళన హెచ్చింది. తర్వాత కొన్నిరోజుల దాకా ఉదాసీనతా, నిరుత్సాహం ఆమెని వదల్లేదు. కావలసిందేమిటో ఇప్పుడు ఆమెకి బాగా తెలుసు. కాని ఆ తెలియడంవల్ల ఆమె మార్గం సుగమమం కాలేదు. మరపురాని ఆ సమావేశం ఆమె జీవిత పంథానే మార్చివేసింది. పూర్వపు జీవితం ఆమెకి దూరమైపోయినట్లని పించింది. మార్పేమీ లేనట్టు అంతా యథాప్రకారం సవ్యంగా జరిగిపోతోంది. పూర్వంలానే ఎలీనా నిత్య వ్యవహారాలలో పాత్ర వహించాలి, సహక రించాలి. ఇన్సరోవ్‌కి ఉత్తరం రాయాలని ఉద్యమించింది. కాని రాయలేక పోయింది. కాగితంమీద మాటలు నిర్జీవంగానో, అసత్యంగానో కనిపించాయి. డైరీ రాయడం పూర్తయిపోయింది. ఆఖరి పంక్తికింద గీత గీసేసింది. ఇప్పుడు ఆమె ఆలోచనలు, భావాలు భవితవ్యానికి సంబంధించినవి. ఆమెకి మహా కష్టకాలం దాపరించింది. ఏమాత్రం అనుమానించని తల్లి దగ్గిర కూర్చోటం, ఆమె మాటలు వినడం, ఆమెతో మాట్లాడడం మహాపరాధంగా ఆమెకి తోచింది. తనలో ఏదో కల్మషం ఉందనుకుంది. సిగ్గుపడాలసిందేమీ లేకపోయినా ఆమెపై ఆమే తిరగబడింది. ఏం జరిగినా సరే ఏమీ దాయకుండా అంతా చెప్పేసెయ్యాలనే కోరిక అణచుకోలేనంతగా కలిగింది. "గుడినించి డిమిత్రీ తాను వెళ్లదలచిన

చోటికివన్నా అలాగా తీసుకెడితే బాగుండిపోయేది. 'దైవసాక్షిగా నాభార్యవి' అన్నాడుగా - యిక్కడ యెందుకున్నాను" అనుకుంది. అందర్నీ — వెళ్లూ ఆడిస్తూ పూర్వంకన్న ఎక్కువ తబ్బిబ్బుపడుతున్న యువార్ నికూడా- తప్పించుకు తిరగసాగింది. ఆమె చుట్టుఉన్న వస్తువులూ, మనుషులూ పూర్వంలా దయగా, ప్రేమగా ఉన్నట్లు ఆమెకి తోచలేదు. కలలుగనే లక్షణంకూడా ఆమెలో మాయమైపోయింది. భయంకరస్వప్నంలా అందరూ మహాభారంగా తోచారు. అందరూ ఆమెను నిందిస్తున్నట్లు, ఆమెని అర్థం చేసుకోటానికి నిరాకరిస్తున్నట్లు, 'నువ్వింకా మాదానివే' అంటున్నట్లు ఆమెకి అనిపించింది. ఆమె పెంచినపక్షులు, జంతువులు ఆమెవేపే - ఆమెకట్లా అనిపించింది -అనుమానంతో చూస్తున్నట్లు ఆమెభావాలకి సిగ్గుపడుతున్నట్లు గోచరించాయి.

"అదివిటి, యిది నాయిల్లు, నా కుటుంబం, యిది నా దేశం" అనుకుంది. ఇంకోస్వరం 'ఊహూ - యిది యిక నీకుటుంబంకాదు. నీదేశం కాదు.' అని పదేపదే హెచ్చరించింది. ఆమెకు భయంవేసింది. ఆమె పిరికితనానికి ఆమెకే కోపం వచ్చింది. ... ఆవిడ కష్టాలు అప్పుడే ప్రారంభమయాయి. అంతలోనే సహనం కోల్పోయింది. ఇదేనా అతనికి చేసిన వాగ్దానం?

త్వరగా తిరిగి స్థైర్యం చిక్కబట్టుకోలేకపోయింది. కాని రోజులు గడిచినకొద్దీ కొంచెం కొంచెం శాంతపడి నూత్న పరిస్థితికి అలవాటుపడసాగింది. ఇన్సరోవ్‌కు రెండుచీట్లు రాసి స్వయంగా పోస్టాఫీసుకు తీసుకువెళ్ళింది. బిడియంమూలంగా గర్వం మూలంగా ఈపని దాసీదానికి అప్పగించలేకపోయింది. ఇన్సరోవ్ వస్తాడని ఆశించింది - కాని ఇన్సరోవ్ బదులు ఒకనాటి ఉదయం నికొలాయ్ ఆర్టియోమెవిచ్ చక్కా వచ్చాడు.

# ౨౨

ఆరోజున పించను పుచ్చుకున్న రక్షణదళసేనాని (నికొలాయ్) అంతచిరాకుగా, అంత ఆత్మవిశ్వాసంతో, అంత పెద్దరికం ప్రదర్శిస్తూండగా ఆతని కుటుంబంలో వాళ్ళెవ్వరూ ఎన్నడూ చూడలేదు. పంగజాపి మెల్లిగా నడుస్తూ, బూట్ల మడమలు టకటకలాడిస్తూ కోటూ హాటూ తీసేయకుండానే కచేరీపావిడిలో ప్రవేశించాడు. పెదవి కొరుక్కుని, ప్రశాంతంగా గంభీరంగా తల ఆడిస్తూ అద్దంలోచూసుకున్నాడు. అన్నావాసిలెవ్నా ఉద్వేగంతో సంతోషంతో భర్తను కలుసుకుంది. (భర్తను కలుసుకున్నపుడు ఎపుడూ ఇంతే) నికోలాయ్ ఆమెని పలకరించలేదు. ఎలీనా ముద్దెట్టుకోటానికి మెత్తటి తోలు తొడుగు తొడిగిన చేతిని అందించాడు. ఆరోగ్యం ఎలా ఉందని అన్నావాసిలెవ్నా ప్రశ్నించింది. కాని అతనుజవాబియ్యలేదు. యువార్ ఇవనోవిచ్ లోపలికివచ్చి అతనికేసి తేరిపారజూచి 'బా' అన్నాడు. పిసరైన స్టహోవ్ రక్తం యువార్‌లో ప్రవహిస్తుందని గుర్తించినా మొదటనించీ నికొలాయ్ అతన్ని ఉదాసీనదృష్టితో సంరక్షకదృష్టితో చూచేవాడు. రష్యాలో చాలా కుటుంబాలు కొన్ని ప్రత్యేకలక్షణాలం తమ వంగడంలో ఉన్నాయని విశ్వసిస్తుంటాయి. తరుచు తమలో తాము 'అలాంటి ముక్కు!' 'అలాంటి మెడ' తమ ప్రత్యేకలక్షణాలుగా చెప్పుకుంటారు. జోయా వచ్చి నికొలాయ్‌కి నమస్కరించింది. అతను మూలిగి, పడకకుర్చీలో కూర్చుని కాఫీ తెమ్మనిచెప్పి అప్పుడు హాటుతీసేసుకున్నాడు. కాఫీ తెచ్చారు. ఓ కప్పుతాగి వరసగా అందరికేసీ ఓసారి చూచి 'అంతా బయటికివెళ్ళండి' అని కోపంతో అరిచాడు. ఒక్క అన్నావాసిలెవ్నాను మాత్రం ఉండమన్నాడు.

అన్నావాసిలెవ్నా తప్ప తక్కినవారంతా బైటికి వెళ్ళిపోయారు. అన్నా ఆవేశంతో వణికిపోయింది. నికొలాయ్ గంభీర వైఖరి ఆమెకెంతో నచ్చింది. ఏదో అసాధారణవిషయం వినబోతున్నానని ఆశించింది.

"యేవిటి విషయం ?" అని ప్రశ్నించింది, తలుపులు మూత పడగానే.

అతను ముభావంగా ఆమెకేసి చూసి "మరేం పెద్ద విశేషంలేదు. బలి అయిపోతున్నదాని వైఖరి నీకెలావచ్చింది ?" ఈ మాటలు అంటున్నపుడు నిష్కారణంగా మూతి మూలలు అటూ యిటూ కదపసాగాడు.

"ఇవాళ భోజనానికి ఒకరు వస్తారని చెప్పదలచా. అంతే" అన్నాడు.

"యెవరావచ్చేది ?"

"యెవరా ? కర్నటోవస్కీ. యెగార్ ఆండ్రీవిచ్ కర్నటోవస్కీ నువు యెరగవ్ ? సెనేటులో ప్రధాన కార్యదర్శి."

"భోజనానికి ఇవాళ వస్తున్నాడా ?"

"ఆ"

"ఈముక్క నాకు చెప్పటానికేనా అందర్నీ బైటికి పంపించేసింది?"

నికొలాయ్ భార్యకేసి అవహేళనగా చూసి "నీకేం ఆశ్చర్యంగా వుందా ? అసలు ఆశ్చర్య విషయంకోసం ఒక్క నిమిషం ఆగాలి." అని అన్నాడు.

అన్నా ఓక్షణం మౌనం వహించింది.

"నీకు..." అని ప్రారంభించింది.

"నాకు నీతీ జాతీ లేదని నువ్వనుకుంటున్నావని నాకు తెలుసు." అన్నాడు నికొలాయ్ హఠాత్తుగా.

"నేనా ?" అన్నది అన్నా ఆశ్చర్యపోతూ.

"నీ అభిప్రాయం సరైందేకావచ్చు. ఓమాటు నీకు అసంతృప్తి కలిగించానని ఒప్పుకుంటా. ('నా బూడిదరంగు గుర్రాలు' అనేభావం ఆమె మనసులో తళుక్కుమన్నది.) నీ ఆరోగ్యం సరిగాలేనప్పుడు...నీకు తెలిసిందేగా !"

"అందుకు నీమీదేం నిష్ఠూరం వెయ్యడంలేదే? "

"కావచ్చు. అయినా నను నే సమరించుకో చూచుకోవడంలేదు. నా విద్యుక్తసర్మాన్ని నేను మరిచేపోలేదనీ, నాకుటుంబ శ్రేయస్సును రక్షించుకోవడమెలానో నాకు తెలుసనీ నీకు తెలియజేయాలనుకుంటున్నా."

"యేవిటా గొడవంతా ?" అనుకుందో అన్నా.

(ఆ కిందటి సాయంత్రం ఇంగ్లీషు క్లబ్బులో ఓమూల నలుగురికీ నచ్చేటట్లు ఉపన్యసించడం రష్యన్లకు చేతగాదనే విషయంమీద చర్చ జరిగింది. "అసలు మాట్లాట్టం సునలో యెవరికి తెలిసేడ్చు ! యెవరన్నా వుంటే, చెప్పండి" అన్నా డొకాయన. పక్కనే నిల్చునివున్న నికోలాయ్‌ని చూపిస్తూ "ఇడుగో స్టహోవ్ !" అన్నాడు ఇంకొకతను. నికోలాయ్ సంతోషంతో ఉబ్బిపోయాడు. ఈ విషయా లేవీ అన్నా వాసిలెవ్నాకు తెలీవు.)

"చూడు, మన అమ్మాయి ఎలీనా వుందా, యిక పెళ్ళి గొడవల్లోకి దిగి యెదోవొక నిర్ణయం చేసుకునే సమయం వచ్చింది కదూ. యీ వేదాంతం, యీ దాతృత్వం అంతా కొంతవరకు, కొంత వయసు వచ్చేవరకు బాగానే వుంటాయి. గాలిమేడలు కట్టుకోవడం, యీ కళాకారులతో, పండితులతో, యీ మడ్డిమృగాలతో స్నేహం యిక కట్టేసి నలుగురితోబాటు నడుచుకోవడం మంచిది."

"అంటే దీని అర్థం యేవిటి ?"

"అంటే – విను." అని జవాబిచ్చాడు నికోలాయ్, ఇంకా మూతి మూలలు తిప్పతూనే.

"డొంకతిరుగుడుగా కాకుండా సూటిగా చెబుతా విను. యీ కర్నటోవస్కీతో నాకు పరిచయం కలిగింది. అతను అల్లుడు కావాలనే ఆశతోనే అతనితో స్నేహం మొదలెట్టా. అతన్ని చూసిం తర్వాత నేను పక్షపాతం వహించాననిగానీ, నా నిర్ణయం సరైందికాదనిగానీ అనలేవు. (ఇలా మాట్లాడుతూ తన వాగ్ధోరణిని తానే మెచ్చుకున్నాడు.) అతను లాయరు. బాగా చదువుకున్నవాడు. మంచి మర్యాదస్తుడు. వయసు 3:. ప్రధాన కార్యదర్శి. కౌన్సిలరు. స్టానిస్లావ్ పతకం బహుమతి పుచ్చు

కున్నాడు. మనిషి ఉద్యోగంచూసి ఉబ్బిపోయేరకంవాణ్ణేంకాను. ఎలీనాకి వివేకవంతులు, మంచి నడవడికగలవాళ్లూ అంటే యిష్టమని నువ్వే చెప్పావుగా. కర్నటోవస్కీ మంచి వ్యాపారస్తుడు. మన అమ్మాయికి దయాధర్మాలంటే యిష్టంకదూ. చూడు. యితను సంపాదనపరుడు అయీ అవటంతోనే తండ్రి యిచ్చే అలవెన్సు తమ్ముళ్లకు యిచ్చేశాడు."

"అతని తండ్రి యెవరూ?" అని అడిగింది అన్నా.

"అతని తండ్రా? అతనూ మాంచి పేరు ప్రఖ్యాతులు గడించినవాడే. గొప్ప నియమాలున్నవాడు. మేజరు పనిచేసి పించను పుచ్చుకున్నాడను కుంటా – ఆ జమీందార్ల ఎస్టేట్లు అతనే చూసిపెడుతున్నాడు."

"ఒహో" అంది అన్నా.

"ఒహో యేమిటి? ఒహో! నీకూ పక్షపాతం వుందన్నమాట!" అన్నాడు నికొలాయ్.

"కాని నేను ఒక్కముక్కన్నా అనలేదే..." అని ప్రారంభించ బోయింది అన్నా.

"కాని ఒహో అన్నావుగా. అయినప్పటికీ, నా ఆలోచనలు నీకు తెలియజేయాలనుకుంటున్నా. కర్నటోవస్కీకి మీరు ప్రేమపూర్వకంగా స్వాగతమిస్తారనే ఆశిస్తున్నా. యితనేం 'మద్దిమృగం లాంటివాడే' కాదుకదా."

"అలానే వంటవాడ్ని పిలిచి యెదన్నా విశేషం చెయ్యమని చెపుతా."

"ఆగోడవంతా నాకెందుకులే!" అని లేచి హాటుపెట్టుకుని తోటలో షికారుచేయడానికి యీల వేసుకుంటూ నికొలాయ్ బయలుదేరాడు. (గ్రామీణ గృహంలోనూ స్వాశిక్షణ పాఠశాలలోనూ యీల వేయవచ్చని ఎవరో అతనితో చెప్పారు.)

నాల్గింటికి పది నిమిషాలున్నదనగా స్టహోవ్ ఇంటిముందు ఓ బగ్గీ ఆగింది. చక్కని యువకుడొకతను నిరాడంబరంగా సొగసుగా దుస్తులు ధరించి ఆ బగ్గీలోనించి దిగి తనరాక తెలియజేశాడు. ఆ యువకుడే యెగార్ అండ్రీవిచ్ కర్నటోవస్కీ!

ఆ మర్నాడు ఎలీనా ఇన్సరోవ్‌కి ఇంకా కొన్నివిషయాలతోపాటు ఈ కింది విషయాలు రాసింది:

"ప్రియతమా! డిమిట్రీ! నన్ను అభినందించాలి. పెళ్ళిచూపులకి ఒకాయన దిగాడు. నిన్న భోజనానికి వచ్చాడు. మా నాన్నకి అతనితో ఇంగ్లీషుక్లబ్బులో పరిచయమైనట్టుంది. భోజనానికి పిలిచాడు. తన ఆశయాన్ని మానాన్న అమ్మకు రహస్యంగా చెప్పివుంటాడు. మా అమ్మ అతనెందుకు వచ్చాడో నాకు చెప్పింది. అతనిపేరు యెగార్ ఆండ్రీవిచ్ కర్నటోవస్కీ. అతను సెనేటుకి ప్రధానకార్యదర్శి. అతనెలా ఉంటాడో ముందు చెబుతా విను. అంత పొడగరికాదు. నీకన్న పొట్టి. పొందికైన శరీరం. చక్కటి ఆకృతి. జుట్టు ఒత్తుగా కత్తిరించుకున్నాడు. పొడుగాటి చెంపమీసాలున్నాయి. గోధుమరంగు కళ్ళు, నీ కళ్ళల్లాగా చిన్నవి. అతని పెదవుల మీద అధికారం వెలువరించే మందహాసం నిరంతరం 'డ్యూటీ'లో ఉన్నట్టు నెలకొని ఉంది. నిరాడంబరంగా, తెచ్చిపెట్టుకున్నట్టనిపించకుండా ప్రవర్తిస్తాడు. మాటలు తూచి తూచి మాట్లాడతాడు. అతని వ్యవహారమంతా ఇంతే. నవ్వడం, తినడం, ఇవన్నీ వ్యాపారసరళికిందే అతనికి జమ. ఎంతగా అతన్ని పరిశీలించింది అనుకుంటున్నావుగదూ! ఎందుకు ఇంతగా పరిశీలించా? నీకు వర్ణించిచెప్పడానికి. ఇంతేకాదు. పెళ్ళిచూపులుకు వచ్చిన పెద్దమనిషిని ఆమాత్రం పరిశీలించొద్దూ! అతను స్థిరచిత్తుడు. అయితేనేం మందకొడి. సరుకేంలేదు. నిజాయితీపరుడులా కనిపిస్తాడు. అతను చాలా నిజాయితీపరుడంటారు. నీదీ స్థిరచిత్తమే. అయితేనేం నీదారే వేరు. భోజనాలవేళ నాపక్కన కూర్చున్నాడు. మొదట సంభాషణ వ్యాపారవిషయాలమీద నడిచింది. అతనికి ఈ విషయాలు బాగాతెలుసట. పెద్ద ఫ్యాక్టరీకి యాజమాన్యం వహించడానికి ఉద్యోగంకూడా వదులుకోడానికి ఓమాటు సిద్ధమయాడట! పాపం! ఉద్యోగం వదులుకుంటేనే బాగుండేది. తర్వాత షూబిన్ నాటకాలవిషయం ఎత్తాడు. కర్నటోవస్కీ భేషజానికి పోకుండా తనకు కళలవిషయం ఏమీ తెలీదని చెప్పేశాడు. అపుడు నువ్వు జ్ఞాపకం వచ్చావు. కాని నేననుకున్నా! డిమిట్రీకీ నాకూ కళలు అర్థంకానివిధమే వేరు. కర్నటోవస్కీ ఉద్దేశమేమంటే 'నాకు కళలు అర్థంకావు. సవ్యంగా జరిగే పాలనలో వాటిని మననీయవచ్చుగాని అసలు వాటితో అవసరమేమిటి?' ఇదీ అతని ధోరణి. పీటర్సుబర్గ్ జీవితం, మర్యాదస్తులనుకునేవారితో

సాంగత్యం అతనికి నచ్చలేదట. ఒకమాటు తాను 'ప్రొలెటేరియట్'ని అని కూడా అనేశాడు.

"మేం కష్టజీవులం" అన్నాడు. నా డిమిత్రీయే ఈముక్క అంటే నాకు నచ్చేదికాదు అనుకున్నా. సరే-ఏగో వాగుతుంటాడు పోనీ. నాతో చాలా మర్యాదగానే ప్రవర్తించాడు. కాని మాట్లాడినంతసేపూ తానేదో నాకన్న అధికుడిలాగా, నామీదేమో అనుగ్రహం చూపుతున్నవాడిలాగా మాట్లాడాడు. ఎవరికైనా పొగడదల్చుకుంటే 'ఫలానావాడికి నియమాలున్నాయి' అంటాడు. అదే అతను అభిమానించేమాట. అతనికి ఆత్మవిశ్వాసం ఉంది. కష్టపడి పనిచేస్తాడు. స్వార్థత్యాగం చేయగల సమర్థత ఉంది. (చూడు, నేనెంత నిష్పక్షపాతంగా చెబుతున్నానో) అయితేనేం పట్టి నిరంకుశుడు అతనిచేతిలో ఎవతె పడుతుందో పాపం! జాలేస్తుంది. భోజనాలవేళ లంచగొండితనంమీద చర్చ ప్రారంభమైంది.

"చాలా సందర్భాలల్లో లంచం పుచ్చుకున్న వ్యక్తి అపరాధికాడనే విషయం మెచ్చుకుంటా. లంచం పుచ్చుకోకుండా గత్యంతరం లేకపోవచ్చు. అయినప్పటికీ పట్టుబడితే శిక్షించాలసిందే" అన్నాడు కర్నటోవస్కీ.

"నిరపరాధిని శిక్షించడమా ?" అన్నాను నేను.

"అవును. సిద్ధాంత రీత్యా శిక్షించవలసిందే."

"యేదిటా సిద్ధాంతం ?" అని అడిగాడు షూబిన్.

కర్నటోవస్కీ హడిలిపోయి అన్నాడు: "దాన్ని వివరించే అవసరంలేదు."

కర్నటోవస్కీ గొప్పవాడని ఎంచే మా నాన్న వివరీకరించ నవసరం లేదని సంభాషణ ఆపించేశాడు. నాకు చాలా కష్టంవేసింది. సాయంత్రం బెర్సెనీవ్ వచ్చి కర్నటోవస్కీతో తీవ్రంగా వాదన వేసుకున్నాడు. మన అంద్రీపెట్రోవిచ్ అంత ఉద్రేకంతో ఉండగా నే నెన్నడూ చూడలా. కర్నటోవస్కీ విజ్ఞానశాస్త్రాలు విశ్వవిద్యాలయాలు వగైరా విలువగలవి కావని అనలేకపోయాడు... కాని బెర్సెనీవ్‌కి ఎందుకింత కోపం వచ్చిందో అర్థం చేసుకోగలను. విజ్ఞానమంతా ఓ విధమైన సర్కసు అని కర్నటోవస్కీ ఉద్దేశం. భోజనాలయాక షూబిన్ వచ్చి నాతో అన్నాడు: "యితన్ని

మన మెరుగున్న యిగోరితో పోల్చిచూడు (నీ పేరు ఎత్తలేకపోయాను. యిద్దరూ కార్యశూరులే. కాని యిద్దరికీ యెంత భేదముందో చూడు: ఒకళ్ళకి జీవితం ప్రేరేపించిన సజీవ ఆశయాలున్నాయి. ఆ ఆశయాల్లో నిజాయితీవుంది. యితనిలో విద్యుక్తధర్మభావం కూడాలేదు. పైగా యితని నిజాయితీ తెచ్చిపెట్టుకున్నది. కార్యశూరత్వం కూడా పైపై మెరుగె...” షూబిన్ తెలివైనవాడు. నీకు రాయాలనే ఉద్దేశంతోనే అతనిమాటలు జ్ఞాపకం పెట్టుకున్నా. నాకుమాత్రం మీ యిద్దరికీ పోలికే కనిపించదు. నీకు విశ్వాసం ఉంది. అతనికిలేదు. విశ్వాసం అంటే ఆత్మవిశ్వాసమొక్కటే కాదుగదా !

అతను చాలాసేపుండి వెళ్ళిపోయాడు. మా అమ్మ అతనికి నేను నచ్చానని చెప్పింది. నాన్న ఆనందానికి అంతేలేదు...నాకు నియమాలున్నా యని నా తలిదండ్రులతో అతను చెప్పాడేమో కొంపదీసి! 'నాకు భర్త యిదివరకే ఉన్నాడు. ఏంచేయను నేను?' అని అమ్మతో అనబోయా. (నాన్నకు నవ్వాటే సరిపడదేంకర్మం ! అమ్మని ఎదోవిధంగా ఒప్పించొచ్చు.

ప్రియతమా ! ఈ పెద్దమనిషిని యింత వివరంగా వర్ణించడం నాకోరికలు అణచుకోటానికే. నీవు దగ్గరలేకపోతే బతకనేమో ననిపిస్తోంది. నీరూపం నాకళ్ళకు కట్టినట్టుంటోంది. నీ గొంతు వినిపిస్తున్నట్టుంటోంది ... నీకోసం నిరీక్షిస్తున్నా. నువ్వు సూచించినట్టు ఇక్కడ ఈ ఇంట్లోకాదు ... ఇక్కడ ఎంతో చిక్కగా అసహ్యంగా ఉంటుంది... ఆలోచించు. ఉత్తరంలో రాశాగదూ ఆ అడివిలో...నీకు తెలుసుగా ... ప్రియతమా! నిన్నెంతగా ప్రేమిస్తున్నాననుకున్నావు !

# ౨3

మూడువారాల తర్వాత అన్నా వాసిలెవ్నా మాస్కోలోని తన సొంతఇంటికి బయలుదేరివెళ్ళింది. ఎలీనాకి మహదానందం కల్గింది. మాస్కోలోని ఆ ఇల్లు రెండతస్తుల పెద్ద కొయ్యఇల్లు. కిటికీలమీద గచ్చుతో వీణబొమ్మలు, పూలమాలికలు చెక్కారు. ఇంటిముందు చిన్నితోట ఉంది. ఒత్తుగా గడ్డిపెరిగిన ఆవరణ దానిచుట్టూ చిన్నఇళ్లూ ఉన్నాయి. మున్న్యవ బావి, బావిప్రక్కన కుక్కలకొట్టాం ఉంది. అన్నావాసిలెవ్నా పల్లెపట్టును అంత తొందరలో ఎన్నడూ వదిలి వెళ్ళలేదు. ఈ ఏడు చలిగాలి ప్రారంభంకాగానే ఆమెకు పళ్ళతీపు విపరీతమైపోయింది. నికొలాయ్ మూడుపుచ్చుకోటం పూర్తయింది. భార్యకోసం అదుర్దాగా ఎదురు చూస్తున్నాడు. అవగస్టీనా క్రిస్టియనోవ్నా తన చుట్టాలింటికి రెవాల్ వెళ్ళిపోవడంతో ఆదుర్దా మరీ ఎక్కువైంది. ఇంతలో ఒ విదేశీయ కుటుంబం మాస్కోవచ్చి సిమెంటు విగ్రహాలు ప్రదర్శించసాగారు. ఈ ప్రదర్శనా లనుగురించి మాస్కో జర్నల్‌లో చదివినమీదట అన్నా కౌతుకం మరీ వృద్ధిఅయింది. అందువల్ల గ్రామసీమలో ఎక్కువకాలం ఉండ లేకపోయింది. నికొలాయ్ ఎత్తుగడకి దంతా సరిగ్గా సరిపోయింది. అఖరి రెండువారాలు ఎలీనాకు ఒక యోగం అనిపించింది. కర్నటోవస్కీ రెండు సార్లు ఆగివారాలనాడు వారింటికి వెళ్ళాడు. ఆదివారాలే అతనికి తీరుబడి. తతిమ్మారోజుల్లో అతనికి వ్యవధి ఉండదు. అతను నిజానికి ఎలీనాను చూట్టానికే వెళ్ళాడు. కాని జోయాతో ఎక్కువగా మాట్లాడేవాడు. అతను అంటే జోయాకి ఇష్టం ఏర్పడింది. 'యితనూ పురుషుడంటే' అనుకునేది అతని ముఖంచూస్తూ, ఆత్మవిశ్వాసంతో అనుగ్రహభావంతో అతను మాట్లాడే

మాటలు వింటూ. అతని కంఠస్వర మంత చక్కనిస్వరం ఎవరికీ లేదనీ 'అవును', 'బలేబాగుంది' 'తప్పకుండా' లాంటిపదాలు అత నంత చక్కగా ఎవరూ ఉచ్చరించలేరనీ అనుకుంది. ఇన్సరోవ్ ఆ చాయలకే రాలేదు. కాని మాస్కోనదిపక్కన ఓ సాంకేతికస్థలంలో ఎలీనా రహస్యంగా అతన్ని కలుసుకుంది. అప్పుడైనా నాల్గుమాటలుకంటె వారు ఎక్కువ మాట్లాడుకో లేదు. అన్నాకాసిలెవ్నాతోబాటే సూచనకూడా మాస్కోవెళ్ళాడు. బెర్సెనీవ్ కొద్దిరోజులతర్వాత వెళ్ళాడు.

వీరంతా మాస్కోచేరుకున్న కొద్దిరోజులతర్వాత ఓనాడు ఇన్సరోవ్ తన గదిలో కూర్చొనిఉన్నాడు బల్గేరియానించి ప్రత్యేకంగా మనిషిద్వారా వచ్చిన ఉత్తరాలు అప్పటికి మూడుమార్లు చదివాడు. ఆ రోజుల్లో ఉత్తరాలు పోస్టుద్వారా సురక్షితంగా చేరడంలేదు. ఆ ఉత్తరాలవల్ల అతను చాలా కలతచెందాడు. బాల్కన్ రాష్ట్రాలలో పరిస్థితులు నానాటికీ తీవ్రరూపం తాలుస్తున్నాయి. రష్యన్ సైన్యాలు ముఖ్యపట్టణాలను అక్ర మించుకోవటంతో గందరగోళం బయలుదేరింది. తుపాను చెలరేగుతోంది. యుద్ధవాతావరణం పూర్తిగా వ్యాపించింది. దేశమంతా అట్టుడికిపోయినట్లు ఉడికిపోతోంది. ఏమి జరగబోతుందో ఎవరికీ అంతుపట్టడంలేదు. పాత కక్షలు, చిరకాలంగా పాదుకున్న ఆశలు తిరిగీతలెత్తాయి. దేశమంతటా కదలిక ప్రారంభమైంది. ఇన్సరోవ్ హృదయంకూడా కదలబారింది. అతని ఆశలూ నెరవేరే సూచనలు కన్పిస్తున్నాయి. "ఇదంతా పదునుకు రాకుం డానే జరగడంలేదూ? ఇదంతా వ్యర్థమైపోదూ?" అనుకున్నాడు గుప్పిడి బిగించి "మేమింకా తయారుకాలేదు కాని యేంచేస్తాం నేను వెళ్ళితీరాలి."

ద్వారం దగ్గిర అలికిడి అయింది. తొందరగా తలుపు తెరుచుకుని ఎలీనా ప్రవేశించింది.

ఇన్సరోవ్ వణికిపోయి ముందుకు దూకి ఆమెముందు మోకాళ్ళమీద వాలాడు. ఆమె నడుము చేతుల్తో చుట్టేసి తల ఆమెమీద వేసి నొక్కాడు.

"నే వస్తాననుకోలేదుగదూ" అంది రొప్పుతూ, (మేడ మెట్లమీద పరుగెత్తుకొంటూ వచ్చింది) "ప్రియతమా! ప్రియతమా!" అతని తల మీద రెండుచేతులూ ఆనించి చుట్టూ చూసింది. "సరే - యిక్కడా నువ్వు వుంటోన్నది. అట్టే కష్టపడకుండానే నిన్ను కలుసుకున్నాను. నీ యింటి

యజమాని కూతురు నన్ను యిక్కడికి తీసుకొచ్చింది. మేం వచ్చి మూడు రోజులైంది. ... నీకు ఉత్తరం రాద్దామనుకున్నాగాని స్వయంగా రావడమే ఉత్తమ మనుకున్నా. పావుగంట సేపుకంటె ఎక్కువ యిక్కడ వుండటానికి వీలుపడదు. లేచి తలుపుగడియవెయ్యి"

ఇన్సరోవ్ లేచి తలుపు గొళ్ళెంపెట్టి తిరిగివచ్చి ఆమెచేతులు పట్టుకున్నాడు. సంతోషంతో అతనికి మాటలు పెగలలేదు. చిరునవ్వు నవ్వుతూ ఆమె అతని కళ్ళల్లోకి చూసింది....ఆ కళ్ళల్లో మహదానందం వెలిగిపోతోంది...హఠాత్తుగా ఆమె కంగారు పడింది.

"బ్రా సఆగు" అంది మెల్లగా చేతులు లాక్కుంటూ "హాటు తీసుకోనియ్" హాటు రిబ్బన్ను వూడదీసి ప్రక్కకు విసిరేసింది. బుజంమీద నించి జుబ్బా తీసేసి జుట్టు సవరించుకుని సోఫామీద కూర్చుంది. ఇన్సరోవ్ ముగ్ధుడిలా ఆమెని కనిపెట్టి చూచాడు. అతనికేసి చూడకుండా తనపక్కన చోటు చూపిస్తూ "నువ్వూ కూర్చో" అంది.

ఇన్సరోవ్ సోఫామీద కూర్చోకుండా కింద నేలమీద కూర్చున్నాడు.

"నాచేతి తొడుగులు వూడదియ్యి" అంది వణుకుతూ. ఆమె కెందుకో భయంవేసింది.

ఒకచేతి తొడుగు సగం ఊడదీసి మహా కాంక్షతో ఆ సున్నిత హస్తాన్ని ముద్దుకున్నాడు. ఆమె మరీ వణికిపోయి రెండోచేత్తో అతన్ని వారిద్దామనుకుంది. కాని అతను రెండోచేతినీ ముద్దుకోసాగాడు. చేతిని వెనక్కి లాక్కుంది. అతను తల వెనక్కి వాల్చాడు. ఆమె అతని ముఖంలోకి చూసి ముందుకు వంగింది. ఇద్దరి పెదిమలూ కలుసుకున్నాయి....

ఒక్క క్షణం అలా గడిచిపోయింది. ఆమె విదిలించుకుని లేచి నిలబడి "వద్దు, వద్దు" అంది మెలమెల్లగా. అని బల్ల దగ్గిరికి త్వరగా వెళ్ళిపోయింది.

"యీ యింటికి యజమానురాల్ని నేను. నా దగ్గిర రహస్యాలేం పనికిరావు" అంది. మళ్ళీ తనకేమీ పట్టనట్టు వెనుదిరిగి "అబ్బా! యెన్ని కాగితాలు! యివన్నీ ఉత్తరాలే!" అంది.

ఇన్సరోవ్ ముఖం ముడుచుకున్నాడు. నేలమీదనించి లేస్తూ "ఆ ఉత్తరాలు నువు చదవచ్చు" అన్నాడు

ఎలీనా వాటిని చేతుల్తో అటూ యిటూ తిప్పి "వుత్తరాలా చాలా వున్నాయి. అక్షరాలా బహు చిన్నవి. నేనో నిమిషంలో వెళ్ళిపోవాలి... యీ గొడవ నా కెందుకు...యింకెవరన్నా అమ్మాయి రాసినవి కాదు గదా!...అయినా రష్యన్ భాషలో లేవు" అంది చేతివేళ్లతో వాటినితాకుతూ.

ఇన్సరోవ్ ఆమె దగ్గిరకి వెళ్ళి చల్లగా ఆమె నడుంమీద చెయ్యి వేశాడు. అతనికేసి టపీమని తిరిగి మహా సంతోషంతో మందహాసంచేసి అతని భుజంమీద ఆమె వాలింది.

"బల్గేరియానించి స్నేహితులు నను రమ్మని రాసిన ఉత్తరాలు అవి. ఎలీనా!"

"ఇప్పుడు బల్గేరియా వెళ్లాలా?"

"అవును. యిప్పుడే వ్యవధి, అవకాశాలు వుండగానే వెళ్ళాలి." హఠాత్తుగా ఆమె చేతుల్తో అతని మెడను చుట్టివేసింది.

"నన్నూ తీసుకువెడతావు గదూ? తీసుకువెడతావు గదూ" అంది. ఆమెని దగ్గిరికి తీసుకుని "ప్రియతమా! జేవీ! యెంత ధైర్యంగా ఆ ముక్క అన్నావ్. నాకు కొంప లేదాయె, కుటుంబం లేదాయె. అటు వంటప్పుడు నాతో నిన్ను తీసికెళ్లడం దారుణం కదూ, పిచ్చికదూ? అక్కి యెక్కడికో తెలుసా ..." అతని నోటిమీద ఆమె చెయ్యివేసి మాట్లాడ కుండా ఆపేసి "వూరుకో ...నాకు కోపం వస్తుంది కోపంవచ్చిందా యిక మళ్ళీనిను చూట్టానికి గాను. అంతా నిశ్చయం అయిపోలా? నేను నీ భార్యను కానూ? భార్య ఎక్కడన్నా భర్తను విడిచిపెట్టి వుంటుందా?"

"భార్య యుద్ధానికి బయలుదేరదు" అన్నాడు వెక్కిరింతగా మందహాసంచేస్తూ.

"వుండిపోడానికి వీల్లైతేను. కాని నేనిక్కడ యెలా వుండగలను?"

"ఎలీనా! నువు దేవకన్యవి!... అయినా చూడు. నేను పదిహేను రోజుల్లో మాస్కో వదిలి వెళ్ళిపోవాలసి వుంటుంది. ఇక చదువుసంస్థలు పనిపాటలు అడ్డంరావు."

"నువ్వింత తొందరగా వెళ్ళిపోవాలనివుంటే, యిక వాటిజోలెం దుకు? నువ్వు వుండిపొమ్మంటే యిక్కడ యీపాళంగానే వుండిపోతా. యిక శాశ్వతంగా నీదగ్గిర వుండిపోతా. ఇక యింటిమొహం చూడను. యిప్పుడే వెళ్ళిపోదామా?"

ఇన్సారోవ్ ఉట్టింపుకాంక్షతో ఆమెని కౌగిలించుకున్నాడు. "నే నేమన్నా తప్పుచేస్తే భగవానుడు నను శిక్షించుగాక! యివాళనించే శాశ్వతంగా నాకు నువ్వు, నీకు నేను."

"వుండిపోనా?"

"ఊహుఁ నా ప్రాణమా! నా రత్నాలరాశి! యివాళటికి యింటికి వెళ్ళు. కాని ప్రయాణానికి సిద్ధంగా వుండు. అది నిమిషాలమీద నిర్ణయించే విషయంకాదు చాలా జాగ్రత్తగా ఆలోచించాలి. మనకి డబ్బుకావాలి. రహదారిచీటీ కావాలి."

"నా దగ్గిర డబ్బుంది. యెనభై రూబిళ్ళు." అంది ఎలీనా "అదేం పెద్దమొత్తంకాదుగానీ అయినా అదీ అవసరమే." "నే నింకా తేగలను. అప్పుచేస్తా. అమ్మని అడుగుతా. ఊహుఁ అమ్మని అడగను. నా గడియారం అమ్మేస్తా. నాకు మద్దులజత వుంది. గాజులున్నాయి, లేసువుంది."

"డబ్బుగొడవేంగాదు ఎలీనా! రహదారిచీటీ నీకు రహదారిచీటీ సంపాదించడం యెలాగా"

"అవును సంపాదించడంయెలా? రహదారిచీటీతప్పకుండావుండాలా?"

"ఆ తప్పకుండా వుండాలి."

ఎలీనా చిరునవ్వునవ్వి "నాకు సంగతి జ్ఞాపకంవచ్చింది డిమిత్రీ! నా చిన్నప్పుడు పనిమనిషికటి వుండేది. వొకనాడు చెప్పకుండా పారిపోయింది. ఆమెని వెదికి పట్టుకున్నారు. తప్పు క్షమించారు. తర్వాతచాలా కాలం మాయింట్లోనేవుంది. కాని ఎప్పుడామెని "పారుబోతు" అంటూవుండే వారు. నేనూ ఆమెలాగానే వొకనాడు పారిపోతానని యెన్నడూ అనుకోలా!"

"ఎలీనా! నీకు అలా అంటానికి సిగ్గయ్యడంలేదూ!"

"సిగ్గెందుకేం? రహదారి చీటి సంపాదించుకుని వెడితే మంచిదే. లేక పోయినా"

"అదంతా తర్వాత చూచుకుందాం. కాస్త పోపికపట్టు పరిస్థితులు చూచి ఆలోచించను. తర్వాత యీ విషయాలన్నీ బాగా చర్చించుకుందాం. యిక డబ్బు నాదగ్గరా కొద్దిగా వుంది."

అతని నుదుటిమీదపడ్డ వెంట్రుకలు ప్రక్కకుత్రోసి ఎలీనా అంది: 'డిమిట్రీ! మనిద్దరం కలిసి ప్రయాణం చేయడం దివ్యంగా వుండదూ?"

"ఆ దివ్యంగానే వుంటుంది. కాని అక్కడికి చేరుకున్నాక..."

"సరే - యేమిటీ? మనిద్దరంకలిసి చచ్చిపోవడంకూడా దివ్యంగానే వుండదూ! కాని మనం చావడమెందుకూ? మనమింకా పడుచువాళ్ళం. చాలాకాలం బతుకుతాం నీ కెన్నేళ్ళు? ఇరవైమూడు కదూ?"

"ఊహుఁ యిరవై ఆరు"

"నాకు ఇరవైయేళ్లు. మన ముందు కాలం యెంతో వుంది. నను తప్పించుకు పారిపోదామనుకున్నా? నీకు రష్యావాళ్ళప్రేమ అక్కర్లేదేం? బల్గేరియన్! నవెలా తప్పించుకు పోతావో చూస్తాగా. ఆవాళ నిను చూస్తానికిరాకపోతే యేం జరిగేది?

"నేనెందుకు వెళ్ళిపోదలచానో నీకు తెలుసుగా ఎలీనా!

"ఆ-నాకు తెలుసు, ప్రేమలోపడ్డాక భయపడిపోయావ్. కాని నిన్నెవరైనా ప్రేమిస్తున్నారనే అనుమానం కలగలా?"

"వొట్టు. నాకేం అనుమానం కలగలా, ఎలీనా! అమాంతంగా తొందరగా అతన్ని ముద్దెట్టుకుని 'అందుకే నిన్నింతగా ప్రేమిస్తున్నా. యిక శెలవు' అంది 'యింకాసేపు వుండగూడదూ?' అని అడిగాడు ఇన్సరోవ్

"ఊహుఁ - ప్రియతమా! యింటి దగ్గరనించి తప్పించుకు రావడం యేమంత తేలికనుకున్నా. అప్పుడే పావుగంట అయిపోయింది" హాటూ జుబ్బా తీసుకుని" నువ్వు మాయింటికి రేపుసాయంత్రం కాదు, యెల్లుండి, రా. కష్టంవేస్తుంది, విసుగేస్తుంది అయినా తప్పదు. వొకరొన్నొకరం చూచుకోనైనా గల్గుతాం, శెలవు వెళ్ళనా"

ఆఖరిసారి ఆమెని కావలించుకున్నాడు.

"చూడు నా గడియారంగొలుసు విరగ్గొటేశావ్ పోనీలే. మంచి నంది. కజ్నెటస్కీ వంతెనమీదుగా వెళ్ళి బాగుచేయడానికి యిస్తా. యెక్కడికి వెళ్ళావని యెవరన్నా అడిగితే కజ్నెటస్కీ వంతెనవైపు వెళ్ళా

నని చెబుతా.” తలుపు గడియపట్టుకుని “ఆ-మర్చేబోయాను. మానియర్ కర్నోటోవస్కీ యిక వొకటి రెండు రోజుల్లో పెళ్ళిచేసుకోమని నన్ను అడుగుతాడు. నేను జవాబు యిలాయిస్తా” అంది చేతిబొటనవేలు ముక్కు మీద ఆనించి తక్కినవేళ్ళు ఆడిస్తూ. “శెలవు. మళ్ళీకలుసుకుందాం. దోవ దొరికింది. యిక కాలం వృధాపుచ్చకూడదు.”

ఎలీనా కొద్దిగా తలుపు తెరిచి, చెవియొగ్గివిని, ఇన్సరోవ్ కేసి తిరిగి తలాడించి వెళ్ళిపోయింది.

ఒక నిమిషంసేపు ఇన్సరోవ్ తలుపుముందు నిలిచి చెవి యొగ్గి విన్నాడు. దొడ్డితలుపు వేసిన చప్పుడైంది. తర్వాత సోఫామీద కూర్చుని చేతుల్తో ముహం కప్పేసుకున్నాడు. ఎన్నడూ ఆనాటిలా జరగలా. “ఇలాంటి ప్రేమ పొందటానికి యెంతపుణ్యం చేసుకున్నానో? యిదేం కలా?” అనుకున్నాడు.

ఆ చీకటి గదిలోకి ఎలీనా తెచ్చిన పూలవాసన ఆమెని జ్ఞప్తికి తెచ్చింది. ఆ పూలవాసనతోబాటు ఆ యువతిస్వరం, అడుగులచప్పుడూ, ఆకన్య శారీరక క్రొంగ్రొత్తతనం యింకా గాలిలో తేలియాడుతున్నట్టు అతనికి అనిపించింది.

## ౨౪

బల్గేరియానించి నమ్మకమైన వార్తలకోసం నిరీక్షించడానికి ఇన్సరోవ్ నిశ్చయించుకున్నాడు. కాని ప్రయాణ సన్నాహాలు మాత్రం మానలేదు. పరిస్థితి చాలా క్లిష్టంగా ఉంది. అతని విషయంలో అడ్డంకులేం లేవు. రహదారీ చీటీ అడిగితే ఇచ్చేస్తారు. కాని ఎలీనా విషయం ఏం చేయాలి? ఎలీనాకు న్యాయమార్గాన రహదారీ చీటీ సంపాదించడం అసంభవం. రహస్యంగా పెళ్ళిచేసుకుని, ఆ తర్వాత ఆమె తలిదండ్రులకి తెలియజేయడం ...? 'అప్పుడు మమ్మల్నిద్దరినీ వెళ్లనిస్తారు' అనుకున్నాడు. 'వెళ్లనియ్యకపోతేనో? అయినా వెళ్ళితీరతాం ... కాని వాళ్ళు కేసు పెడితే? ... కేసు పెడితే? ... ఊహుఁ— యెదో విధంగా రహదారీ చీటీ సంపాదించడమే ఉత్తమమార్గం.'

పేర్లు చెప్పకుండా అతనికి పరిచితుడైన ఓ పించను పుచ్చుకున్న ప్రభుత్వన్యాయవాది సలహా పుచ్చుకుందామనుకున్నాడు. ఆ న్యాయవాది వృద్ధుడు. చాటుమాటుగా జరిపించాల్సిన వ్యవహారాల్లో చాలా అనుభవం ఉన్నవాడు. ఆ పెద్దమనిషి ఇల్లు చాలాదూరం. ఇన్సరోవ్ గూడులేని ఓ చండాలపుబండిలో ఎక్కి గంటసేపు ప్రయాణముచేసి ఆయన ఇల్లు చేరుకున్నాడు. కాని ఆయన ఇంట్లోలేడు. తిరిగి వచ్చేటప్పుడు అకస్మాత్తుగా వర్షం విపరీతంగా కురిసింది. ఇన్సరోవ్ పూర్తిగా తడిసిపోయాడు. మర్నాటి ఉదయం తలనొప్పి బద్దలుకొట్టుతున్నా లెక్కచెయ్యకుండా మళ్ళీ ఆయన్ని చూడడానికి వెళ్లాడు. పించను పుచ్చుకున్న ఆ ప్రభుత్వ న్యాయవాది ఇన్సరోవ్ చెప్పేదంతా శ్రద్ధగా విన్నాడు. వినేటపుడు పొగాకురంగు కళ్ళతో కుటిలదృక్కులు పరుపుతూ మాటిమాటికీ, మూతిమీద

అప్సరసబొమ్మ చెక్కిన పొడుండబ్బాలోంచి పొడుం పట్టుతీసుకుని పీల్చాడు. అంతావిని 'కేసులోని విషయాలు యింకా సరిగ్గా వివరించ'మని అడిగాడు. ఇన్సరోవ్ వివరాలలోకి వెళ్లడానికి సుముఖత చూపకపోయేటప్పటికి డబ్బు జాగ్రత్తపెట్టుకోమని మాత్రమే సలహాయిచ్చి ఇంకోమాటు 'నీకింకా బాగానమ్మకంకుదిరి అనుమానం తీరింతర్వాత' వచ్చి కలుసుకోమని కోరాడు. మళ్లీ పొడుం ఓ పట్టు పీలుస్తూ, "రహదారీచీటీ సంపాదించటం పెద్ద బ్రహ్మాండమైన విషయమేంకాదు. నువు ప్రయాణంచేస్తుంటే నువ్వు మేరియా బ్రెడ్డిషినావో లేకపోతే కరోలినా వోజెల్మీర్వో యెవడికితెలిసేడిస్తుంది?' అన్నాడు. ఇన్సరోవ్‌కి ఇదంతా అసహ్యంగొల్పింది. కాని ఆ వృద్ధుడికి కృతజ్ఞతతెల్పి మళ్ళీకొద్దిరోజుల్లో వచ్చికలుసుకుంటానని చెప్పివెళ్ళిపోయాడు.

సాయంకాలం ఇన్సరోవ్ స్టహోవ్ యింటికి వెళ్ళాడు. అన్నావాసిలెవ్నా ఆప్యాయంగా అతనికి స్వాగతమిచ్చి తమని ఇంతకాలంవరకు మరిచేపోయినందుకు నిష్ఠురోక్తులాడింది. ఇన్సరోవ్ పాలిపోయినట్టున్నాడనుకుని ఆరోగ్యం బాగుందా అని ప్రశ్నించింది. నికొలాయ్ అతనితో ఒక్క మాటన్నా మాట్లాడలేదు. ఏదో 'పరధ్యానంగా ఏదో సాలోచనగా ఏదో కౌతుకంతో' అతనికేసి చూశాడు. షూబిన్ ఉదాసీనవైఖరి తాల్చాడు. ఎలీనా వైఖరి ఇన్సరోవ్‌కి ఆశ్చర్యంగొల్పింది. అతను వస్తాడని ఆమెకి తెలుసు. అందుకనే ఆనాడు గుడిలో అతన్ని కలుసుకున్నపుడు ధరించిన దుస్తులే ధరించింది. అతి ప్రశాంతంగా అతనికి స్వాగతం చెప్పింది. మహా ఉల్లాసంగా ఉంది. ఎవరితోనూ ఎట్టిసంబంధమూ లేనట్టు మెలిగింది. ఆసమయంలో ఆమెని చూచినవారెవరూ ఆమె భవితవ్యంఎన్నడో నిర్ణయమై పోయిందనీ, ఆమె ప్రతికదలికలోగల ఆకర్షణకీ, సౌకుమార్యానికీ, ఆమెలో గోచరించే జీవశక్తికీ కారణం ప్రేమసాఫల్యతేనని ఎవరూ ఊహించలేదు. జోయా బదులు ఆమె వేళాకోళాలు వెక్కిరింతలూ సాగిస్తూ టీ పోసింది. షూబిన్ తన్ను కనిపెట్టి చూస్తుంటాడనీ ఇన్సరోవ్ తన భావాలను దాచుకుని ఏమీఎరగనట్టు మెలగలేడనీ ఆమెకు తెలుసు. అందుకని ముందుగానే తగు జాగ్రత్తపడింది. ఆమె తప్పు అభిప్రాయం పడలేదు. షూబిన్ దృష్టి ఆమె నించి మరల్చలేదు. ఇన్సరోవ్ మౌనంగా విచారంగా కాలంగడిపాడు. ఎలీనా ఎంతో సంతోషించి అతన్ని కాసేపు ఆడిద్దామనుకుని హఠాత్తుగా 'సరే-ఆ కార్యక్రమం యెలా జరుగుతోంది?' అని ప్రశ్నించింది.

“యే కార్యక్రమం ?”

“అప్పుడే మర్చిపోయావా ?” అని అడిగింది అతని మొహంలోకి చూసి నవ్వుతూ. ఆ మందహాసంలోని అర్థం ఇన్సరోవ్‌కి ఒక్కడికే తెలుసు. “రష్యన్లకోసం రాస్తానన్న బల్గేరియా వ్యాకరణం యెంత వరకు వచ్చింది ?” అంది.

“క్వలీబోర్డ్డి” అన్నాడు నికొలాయ్ అసహ్య భావంతో.

జోయా పియానోముందు కూర్చుంది. ఎలీనా కనిపించీ కనిపించనట్టు భుజాలు ఎగరవేసి ఇన్సరోవ్‌ని ఇక వెళ్ళి పొమ్మని సైగచేస్తున్నట్టు గుమ్మం కేసి చూసింది. తర్వాత బల్ల రెండుసార్లు చేతితో కొట్టి అతనికేసి చూసింది. రెండుమాట్లు బల్లమీద కొట్టటంవల్ల రెండు రోజులయిన తర్వాత రమ్మందని ఇన్సరోవ్ గ్రహించాడు. అతను సంకేతం గ్రహించినట్టు తనకు తెలిసిందనిఅర్థమిచ్చేటట్లు ఎలీనా చిరునవ్వు నవ్వింది. లేచి వంట్లో ఏమీ బాగాలేదనిచెప్పి అందరిదగ్గరా ఇన్సరోవ్ శెలవు పుచ్చుకున్నాడు. ఇంతలో కర్నటోవస్కీ చక్కావచ్చాడు. అతనిచూసి నికోలాయ్ లేచిఒక్కగంతేసి కుడిచెయ్యి బాగాపైకెత్తి కర్నటోవస్కీ చేతిమీద చల్లగా దింపాడు. ప్రత్యర్థిని చూడడానికి ఇన్సరోవ్ ఓ నిముసం ఆగాడు. ఎలీనా తలూచింది. నూత్నఅతిథిని ఇన్సరోవ్‌కి పరిచయం చేయలేదు. ఇన్సరోవ్ ఆఖరిసారి ఎలీనాకేసి దృష్టిబరపి వెళ్ళిపోయాడు. షూబిన్ ఆలోచించాడు. ఆ తర్వాత కర్నటోవస్కీతో తనకేం తెలీని చట్టాలవిషయం చర్చించసాగాడు.

ఇన్సరోవ్‌కి ఆ రాత్రంతా నిద్రపట్టలేదు. మర్నాటికి జబ్బుచేసింది. తలనెప్పి బద్దలు కొడుతున్నా లక్ష్యపెట్టక కాగితాలన్నీసర్ది ఉత్తరాలు రాసాడు. భోజనాలవేళకి జ్వరంతగిలింది. తిండి సయించలా. సాయంత్రానికి జ్వరంబాగా ఎక్కువై పోయింది. వళ్లంతా నెప్పులు ప్రారంభించాయి. తలనెప్పి విపరీతమైంది. అంతకు కొద్దిరోజుల క్రితం ఎలీనా కూర్చున్న సోఫామీదే పడుకున్నాడు. “ఆ దొంగ వెధవని చూట్టానికి వెళ్ళినందుకు నాకీవిధంగా ప్రాయశ్చిత్తం కావలసిందే” అనుకొని నిద్రపోవాలని యత్నించాడు. కాని జ్వరం అప్పటికే అతన్ని లొంగదీసింది. తల టక్ టక్ మని కొట్టుకుంటోంది. రక్తం ఉడికిపోతున్నట్టుంది. గాలిలోపక్షుల్లా అతని

భావాలు ఎక్కడో విహరిస్తున్నాయి. స్పృహతప్పిపోయింది... వెల్లకిలా పడుకున్నాడు. ఎవరోపక్కనసుంచుని నవ్వుతూ చెవిలోఎవో చెబుతున్నట్లుహఠాత్తుగాఅతనికి అనిపించింది. బలవంతాన కళ్ళు తెరిచాడు. కొవ్వొత్తి కాంతి కత్తిలా అతన్ని గాయపర్చింది. కిందటి సాయంకాలం కనిపించిన ప్రభుత్వ న్యాయవాది, అదే గౌనువేసుకుని అదే పట్టుమెడపట్టీ కట్టుకుని అతనికి కన్పించినట్టయింది. 'కరోలీనా వోజిల్మీర్' అని ఆన్యాయవాది బోసినోటితో గొణుకుతున్నట్టు వినిపించింది. ఇన్సరోవ్ అతనికేసి చూశాడు. కాని అతను పెరిగిపోయి పెరిగిపోయి ఓ చెట్టుగా మారాడు...ఇన్సరోవ్ వాలిపోయిన కొమ్మలు పట్టుకుని చెట్టు ఎక్కాలి. కొమ్మలు పట్టుకున్నాడు. కాని లాభంలేకపోయింది. కింద రాతిబండమీద పడ్డాడు. ఎదుర్రొమ్ముకు గాయమైంది...'రొట్టెలు, కైమావుండలు; రొట్టెలు, కైమావుండలు' అని కరోలీనా వోజిల్మీర్ అరుస్తున్నట్లు అనిపించింది. రక్తం కాలువ గడుతున్నట్టు, కత్తులు తళతళా మెరిసి పోతున్నట్టు కనిపించింది ఎలీనా దృగ్గోచరమైంది. 'మహాగందరగోళంగా ఉన్న ఆ రక్తంలో అంతా కలిసి మాయమై పోయింది.

# ౨౫

ఆ మర్నాటి సాయంత్రం నౌకరువచ్చి "మిమ్మల్ని చూడాలని యెవరో వచ్చారు" అని బెర్సెనీవ్‌తో చెప్పాడు. "తాళాలబత్తుడో ఆరకం వాడెవడో..." అన్నాడు. ఆ నౌకరు యజమానితో ఖచ్చితంగా మాట్లాడ డం లోనూ, మనిషి మాత్రుణ్ణి నమ్మకపోవడంలోనూ పేరొందినవాడు.

"సరే లోపలికి తీసుకురా" అన్నాడు బెర్సెనీవ్. ఆ తాళాల బత్తుడు లోపలికి వచ్చాడు. ఇన్సరోవ్ అతన్ని గుర్తించాడు. అ అగంత కుడు ఇన్సరోవ్ ఇంటి యజమాని – దర్జీ.

"యేం కావాలి" అని బెర్సెనీవ్ అడిగాడు.

"తమని చూద్దామనివచ్చా" అంటూ అతను ప్రారంభించాడు. అటూ యిటూ కాళ్ళమీద ఊగుతూ కుడిచెయ్యి విదుల్చుతూ, చొక్కా కఫులు ముందువేళ్ళతో పట్టుకుంటూ "మా యింట్లో అద్దెకున్నాయనికి చాలా జబ్బుగావుంది. చాలా జబ్బుగావుంది"

"ఇన్సరోవ్‌కా?"

"ఆ, ఆయనకే. నిన్నఉదయం కులాసాగానేవున్నాడు. కాని సాయంకాలం దాహంయిమ్మని అడిగాడు. మా ఆవిడ మంచినీళ్ళిచ్చింది. రాత్రి పిచ్చిమాటలు మాట్లాడసాగాడు. మా గదికీ ఆయన గదికీ మధ్య గోడ సన్ననిది. అందుకని మాటలు స్పష్టంగా వినిపించాయి. యివాళ వుదయం మాటకూడాలేదు. కదలకుండా మెదలకుండా కొయ్యమొద్దులా పడున్నాడు. జ్వరం వడ్లగింజవేస్తే పేలిపోయేటట్టుంది. పైగా వొంటరిగా వున్నాడు. నేను అనుకున్నాను. 'యిక లాభంలేదు. బతకడం కష్టం. పోలీసులకి

వెళ్ళి చెబుదాం !' కాని మా ఆవిడ 'ఆ పల్లెలో యీాయనతో పాటువుంటున్న పెద్దమనిషికి చెప్పిరా. ఆయన యేదన్నా సలహాయిస్తాడు. వస్తే ఆయనే స్వయంగా వస్తాడు' అంది. సరేనని మీాదగ్గిరికి వచ్చా. చూశారూ యింట్లో రోగిని...''

బెర్సెనీవ్ టోపీ తీసుకుని దర్జీవాడి చేతిలో ఓ రూబులు పెట్టి తొందరతొందరగా ఇన్సరోవ్ బసకు అతనితో బయలుదేరాడు.

బెర్సెనీవ్ వెళ్ళి చూసేసరికి ఇన్సరోవ్ స్పృహతప్పి సోఫాలో అలానే పడున్నాడు. మొహం పూర్తిగా మారిపోయింది. దుస్తులుతొలగించి ఇన్సరోవ్ని పరుపుమీాద పడుకోపెట్టమని చెప్పి డాక్టరుకోసం ఉరుకుతూంటూ బెర్సెనీవ్ వెళ్ళాడు...డాక్టరువచ్చి పరీక్షచేసి రక్తంతీసెయ్యడానికి జలగల్ని పట్టి చమనీ, మలాంపట్టీలు వేయమనీ, రసకర్పూరం ఇమ్మనీ చెప్పాడు.

''ప్రమాదకరంగా పరిణమించిందా ?''

''ఆ-ప్రమాదకరంగా పరిణమించింది. ఊపిరితిత్తులు వాచాయి. న్యూమోనియా గబగబా వృద్ధి అవుతోంది. మెదడుకికూడా ప్రమాదం రావచ్చు కాని రోగి పడుచువాడు. అయినప్పటికీ యీా జాడ్యంలో అతని బలమే అతనికి హానిచేస్తుంది. నన్ను ఆలస్యంగా పిలిచారు. అయినా నా శాయశక్తులా సైన్సులో అవకాశమున్నంతవరకు తంటాలుపడతా'' అన్నాడు.

ఆ డాక్టరూ పడుచువాడే. సైన్సులో విశ్వాసం అతనికి ఎక్కువ.

బెర్సెనీవ్ ఆ రాత్రి అక్కడే అట్టే ఉండిపోయాడు. ఆ యింటి యజమాని అతనిభార్యా చాలా దయచూపించారు. చెప్పినపని చేయడంలో సమర్థులనిపించుకున్నారు. కాంపొండరు వచ్చి చికిత్స ప్రారంభించాడు.

ఉదయానికి ఇన్సరోవ్కి కొద్ది నిమిషాలపాటు స్పృహ వచ్చింది. బెర్సెనీవ్ని గుర్తించిఅన్నాడు : 'నాకేం వంట్లోబాగాలేదు. యేం ?' చాలా జబ్బుగావున్న రోగిలా మందకొడిగా, నిర్జీవంగా, కంగారుగా ఓమారు చుట్టూ చూచాడు. మళ్ళీ స్పృహతప్పింది. బెర్సెనీవ్ ఇంటికివెళ్ళి బట్టలు మార్చుకుని పుస్తకాలు కొన్ని తీసుకుని ఇన్సరోవ్ బసకి మళ్ళీ వచ్చి ప్రస్తు

తానికి అక్కడే ఉండిపోవాలని నిర్ణయించుకున్నాడు. రోగి పక్కచుట్టూ తెరకట్టి సోఫాపక్కని తనకో ఆసనం ఏర్పరచుకున్నాడు. ఆరోజు మంద కొడిగా గడిచింది. బెర్సనీవ్ భోజనానికిమాత్రం బయటికి వెళ్ళాడు. తతిమ్మా కాలమంతా ఇన్సరోవ్ పక్కనే గడిపాడు. సాయంత్రమైంది. కొవ్వొత్తివెలిగించి చదువుకోటం ఆరంభించాడు. చుట్టూ అంతా నిశ్శబ్దం. ఆ ఇంటి యజమాని గదిలోంచి ఎప్పుడైనా అతిమెల్లగా మాట్లాడుకునే మాటలు, ఆవలింతలుమాత్రం వినిపించేవి. ఓమాటు ఎవరో తుమ్మారు. ఆ తుమ్మినఅతన్ని ఎవరో అతిమెల్లగా తిట్టారు. ఇన్సరోవ్ ప్రయాసమీద ఊపిరిపీలుస్తున్న చప్పుడు, మధ్య మధ్య మూలుగూ, తలగడమీద తల అటు ఇటూ కొట్టుకోవడం వినిపించాయి. చిత్రవిచిత్రమైన భావాలు బెర్సనీవ్ మనస్సులో చెలరేగాయి. ఎలీనా ప్రేమించిన పురుషునిగదిలో తా నున్నాడు. ఆ పురుషుని బతుకు అటూ ఇటూ అన్నట్లుగా ఉంది...ఒకనాటి రాత్రి షూబిన్ తన్ను కలుసుకుని ఎలీనా తనను (బెర్సనీవ్‌ని) ప్రేమిస్తున్నట్లు చెప్పినమాటలు జ్ఞాపకంవచ్చాయి! కాని ఇపుడో...'నే నిపుడేంచేయాలి?' అని తన్ను తాను ప్రశ్నించుకున్నాడు. ఇన్సరోవ్‌కి జబ్బుగాఉందని ఎలీనాతో చెప్పటమా? మానటమా? పూర్వం చెప్పినదానికంటే ఇది చాలా విషాదకరమైనకథ! చిత్రం! వారిమధ్యసంధానకర్తగా విధిఅతన్నినడిపిస్తోంది... ఎలీనాతో చెప్పకుండా ఆగిచూద్దామనే నిర్ణయించుకున్నాడు. కాగి తాలకట్టలతో నిండిన బల్లమీద అతనిదృష్టి పడింది. 'ఇన్సరోవ్ తన కార్యక్రమం సఫలీకృతం చేసుకోగల్గుతాడా? అంతా వృథాశ్రమేనా?' అనుకుని మృత్యుముఖంలో ఉన్న ఆయువకుడంటే జాలికలిగి అతన్ని రక్షించ డానికి బెర్సనీవ్ ప్రతిన తీసుకున్నాడు.

ఆరాత్రి ఏంబాగా గడవలా. ఇన్సరోవ్‌కి సంధి పుట్టింది. బెర్స నీవ్ చాలాసార్లు బొటనవేళ్ళమీద నడుస్తూ రోగిదగ్గిరికి వెళ్ళి అతని పిచ్చి మాటలు అతివిచారంతో విన్నాడు. ఒక్కమాటమాత్రం రోగి తెలివి వచ్చినవాడిలా "నాకేంవద్దు. వద్దు ప్రియతమా!" అనడం విన్నాడు... బెర్సనీవ్ ఉలిక్కిపడి ఇన్సరోవ్‌కేసి చూచాడు. పాలిపోయి చావుకళపడిన మొహం నిశ్చలంగాఉంది. చేతులు చచ్చడి పక్కన పడున్నాయి ...

"నాకేంవద్దు" అని మళ్ళీ అన్నాడు ఇన్సరోవ్ వినిపించీ వినిపించ కుండా.

ఉదయం డాక్టరు మళ్ళీవచ్చి తల ఊగించి కొత్తమందు రాసిచ్చాడు. పోటుపెట్టుకుంటూ 'యింకా గడ్డుసితికిరాలేదు' అన్నాడు.

"వచ్చింతర్వాత ?" అని అడిగాడు బెర్సెనీవ్.

"తర్వాత, రెండే అవకాశాలున్నాయి. చావో, బ్రతుకో" డాక్టరు వెళ్ళిపోయాడు. కాసేపు చల్లగాలిలో తిరిగొద్దామని బెర్సెనీవ్ బైటికి వెళ్ళాడు. తిరిగివచ్చి చదువు ప్రారంభించాడు.

రోమర్ రాసినపుస్తకం చదవడం అయిపోయింది. * గ్రోటీ రచనలు మొదలెట్టాడు.

మెల్లిగా ద్వారబంధం చప్పుడైంది. ఇంటికామందు కూతురు మామూలుగా మొద్దుదుప్పటి కప్పుకుని తలుపుసందులో ప్రత్యక్షమైంది.

"ఆ అమ్మాయి - యిదివరకు నాకు అరుపెన్నీలు యిచ్చిన అమ్మాయి వచ్చింది." అని మెల్లిగాచెప్పి హఠాత్తుగా మాయమై చక్కాపోయింది. ఆపిల్ల స్థానంలో ఎలీనా ప్రత్యక్షమైంది.

ఏదో కుట్టినట్టు బెర్సెనీవ్ అమాంతం ముందుకురికాడు. ఎలీనా కొయ్యబొమ్మలా నిలబడిఉంది. ఒక్కమాటైనా మాటాడలేదు. మెరుపులా అంతా ఆమెకి ఒక్కక్షణంలో అర్ధమయింది. మొహంలో నెత్తురు చుక్కయినా లేదు. తెరదగ్గిరికి వెళ్ళి లోపలికి తొంగిమాసింది. చేతులు పైకెత్తింది. రాతిబొమ్మగా మారిపోతోందా అనిపించింది. ఒక్కనిమిషం అలానే జరిగితే ఇన్సరోవ్ మీద వాలేదే. బెర్సెనీవ్ ఆమెని ఆపివేశాడు.

"యేం చేస్తున్నావో తెలుసా ? అతన్ని చంపేదానివే ?" అన్నాడు మెల్లిగా.

"ప్రాణంపోతుందా ?" అని అతి ప్రశాంతంగా అతిమృభావంగా ఆమెఅడిగేటప్పటికి బెర్సెనీవ్‌కి భయంవేసింది.

"అదేమిటి ఎలీనా నికోలయెన్నా ? యేమిటా పిచ్చిమాటలు ! జబ్బుగా వుంది. చాలా జబ్బుగావుంది. అంతే, అయితేనేం మనం అతన్ని రక్షిద్దాం. రక్షిస్తానని ప్రమాణం చేస్తున్నా"

"స్పృహలేదా ?"అని అడిగింది వెనకటిలాగానే.

"ఆ-స్పృహలేదు. యీరోగానికి మొదట్లో యిలానే వుంటుంది.

---

* గ్రోటీ (1794 - 1871) గ్రీసుదేశపుచరిత్ర రాసిన ఆంగ్లచరిత్రకారుడు.

మరేం భయపడనక్కరలేదు. నేను చెబుతున్నాగా. నమ్ము, కాసిని మంచి నీళ్ళుతాగు."

ఆమె తలెత్తిచూసి అతను చెప్పింది తనకేమీ వినపడలేదని గుర్తించింది.

"అతనే గనక మరణిస్తే, నేనూ అతనితో మరణిస్తా" అంది పూర్వపు ధోరణిలోనే.

సరిగ్గా ఆసమయానికి ఇన్సరోవ్ మూలిగాడు. ఎలీనా హడిలిపోయి తల చేతుల్తో గట్టిగాపట్టుకుంది. ఓ నిమిషం తర్వాత హాటు రిబ్బన్లు ఊడ తీసుకుంది.

"యేం చేస్తున్నావో తెలుసా?" అని అడిగాడు బెర్సెనీవ్.

ఆమె జవాబియ్యలేదు. మళ్ళీ అదేప్రశ్న వేశాడు బెర్సెనీవ్.

"నేనిక్కడే వుండిపోతా."

"యేమిటీ? యెంతకాలమని వుంటావ్."

"నాకే తెలీదు... బహుశా పగలంతా, రాత్రంతా, బహుశా శాశ్వతంగానే వుండిపోతానేమో...నాకే తెలీదు."

"అదేమిటి ఎలీనా? కాస్త మంచీచెడ్డా ఆలోచించు. నువ్విక్కడికి వస్తావని బొత్తిగా అనుకోలేదు. వచ్చిందానివి కానేపుండి వెళ్ళిపోతా వనుకున్నా. ఇంటిదగ్గిర నువు కనిపించకపోతే..."

"కనిపించకపోతే?"

"నీకోసం వెతుకుతారు. యిక్కడ నువు కనిపిస్తే..."

"యేం కనిపిస్తే?"

"ఎలీనా...చూడు, అతను నిన్నిపుడు రక్షించేస్థితిలో లేడు."

ఆలోచనాపూర్వకంగా కిందికిచూసి నోటిమీద జేబురుమాలు పెట్టుకుని వెక్కి వెక్కి ఏడ్వసాగింది...సోఫామీద బోర్లాపడి ఏడుపును అరికట్టాలని యత్నించింది. కాని పట్టుబడ్డ పక్షిలా ఆమె శరీరం అటు యిటూ తన్నుకుంది.

"ఎలీనా...అదేమిటి?" అని ఆమెపక్కన నిల్చుని మళ్ళీ అన్నాడు బెర్సెనీవ్.

"యేమిటి ?" అని హఠాత్తుగా అన్న ఇన్సరోవ్ స్వరం వినిపించింది.

ఎలీనా లేచికూర్చుంది. బెర్సెనీవ్ కదలకుండా నించున్నాడు. తర్వాత ఇన్సరోవ్ పక్కదగ్గిరికి వెళ్ళాడు. వెనకటిలాగానే ఇన్సరోవ్ తల నిర్జీవంగా పడివుంది. కళ్ళుమూసుకుని ఉన్నాయి.

"సంధి పుట్టుకొచ్చిందా ?"

."అట్లాగేవుంది. మరేంభయంలేదు, యీజబ్బులో మామూలేగాయిది"

"యెప్పటినించి జబ్బుగావుంది ?"

"రెండురోజులనించి. నిన్నటినించీ నేనిక్కడేవున్నా. భారమంతా నామీద వెయ్యి ఎలీనా! నేనితన్ని వదిలి వెళ్లను. సాధ్యమైనదంతా చేస్తాను. అవసరమైతే యితర్ల సలహాకూడా తీసుకుందాం."

"నేను దగ్గిరలేకుండానే చనిపోతాడా యేంకర్మం." చేతులు నలుపుకుంటూ ఏడ్చింది ఏలీనా.

"యెలావున్నదీ యెప్పటికప్పుడు నీకు తెలియజేస్తూవుంటా. అంతగా ముంచుకొస్తే..."

"పగలైనాసరే, రాత్రయినాసరే - అవసరమైతే అప్పటికప్పుడు నాదగ్గిరికి మనిషినిపంపు. ఓ చీటీముక్కరాసి మరీపంపు...యిక యిప్రుడు యేమైనసరే ..వినిపించిందా ? వాగ్దానంచెయ్."

"దైవసాక్షిగా వాగ్దానంచేస్తున్నా."

"ప్రమాణంచెయ్."

"ప్రమాణంచేస్తున్నా."

అమాంతం అతనిచెయ్యి పుచ్చుకుని అతను వెనక్కి తీసుకుందామనుకునేలోపల పెదవులకు హత్తుకుంది.

"ఎలీనా... యేమిటీపని ?" అని గొణిగాడు.

."ఉహుం - ఉహుం - " అని ఇన్సరోవ్ పెద్దగా నిట్టూర్పు విడుస్తూ వినిపించీ వినిపించనట్లు అన్నాడు.

ఎలీనా తెరదగ్గిరికివెళ్ళి నోట్లో జేబురుమాలు కుక్కుకుని ఆరోగికేసి ప్రేమతో చాలాసేపు తేరిపారజూసింది. నిశ్శబ్దంగా ఏడ్చింది. చెంపలమీద కన్నీరు ప్రవహించింది.

"ఎలీనా !...స్పృహవచ్చి నిను గుర్తుపట్టచ్చు. అలా గుర్తుపట్టం మంచిదో కాదో, యెవరికితెలుసు ! అంతేకాకుండా డాక్టరు వచ్చేవేళైంది."

ఎలీనా సోఫామీదనించి పాటుతీసుకుని నిశ్చలంగా నిల్చుంది. గది చుట్టూ ఏదో జ్ఞాపకంచేసుకుంటున్నట్టు చూసింది...

"నేను వెళ్ళిపోతాను" అంది మెలమెల్లగా. బెర్సెనీవ్ ఆమెచేతిని నొక్కాడు.

"గుండెనిబ్బరం చేసుకుని శాంతంగావుండాలి. నాకు అప్పగించి వెడుతున్నావుగదా. రాత్రికి తప్పకుండా నిను కలుసుకుంటా."

బెర్సెనీవ్‌కేసి తదేకదృష్టితోచూసి "ఓ ప్రాణమిత్రమా !" అని ఎలీనా వెక్కి వెక్కి ఏడుస్తూ పరిగెత్తుకు వెళ్ళిపోయింది.

ద్వారానికి ఆనుకుని బెర్సెనీవ్ నించున్నాడు. దుఃఖంతో కుంగి పోయాడు. కాని ఏదో సంతృప్తి అతన్ని ఆవరించింది. 'ప్రాణమిత్రమా ?' అనుకుని బుజాలు ఎగరవేశాడు.

"యెవరక్కడ" అన్న ఇన్సరోవ్ మాట వినిపించింది. పక్క దగ్గిరికి వెళ్ళి 'నేనూ డిమిట్రీ ! ఏమిటి ? యెలావుంది ?' అన్నాడు.

"వొక్కడివే వున్నావా !"

"ఆ-"

"ఆమె యెక్కడుంది ?"

"ఆమె ! యెవరూ ?" అన్నాడు బెర్సెనీవ్ భయంతో. ఇన్సరోవ్ ఓ నిమిషం మాట్లాడలేదు.

"పూలు" అని గొణుక్కుని ఇన్సరోవ్ మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు.

## ౨౮

ఎనిమిదిరోజులపాటు ఇన్సరోవ్ జీవన్మరణావస్థలో పడి కొట్టుకున్నాడు. ఎడతెరపిలేకుండా డాక్టరు వచ్చి చూచి పోతూనేఉన్నాడు. ఆ డాక్టరు యువకుడు అవడంచేత ఈ గడ్డురోగంలో ఆసక్తి తీసుకోసాగాడు. ఇన్సరోవ్‌కి చాలా జబ్బుగావుందని తెలిసి షూబిన్ వచ్చి చూసివెళ్ళాడు. తోటి బల్గేరియన్ దేశభక్తులు కూడా వచ్చారు. ఇదివరలో తమ కుటీరానికి వచ్చి తనకెంతో ఆశ్చర్యంకలిగించిన ఆ ఇద్దరు బల్గేరియన్లను బెర్సెనీవ్ వీళ్ళల్లో గుర్తించాడు. అందరూ ఆందోళనచెందారు. బెర్సెనీవ్‌కి బదులు ఇన్సరోవ్‌కి పరిచర్య చేయడానికి అందులో చాలమంది ముందుకొచ్చారు గాని ఎలీనాకిచ్చిన వాగ్దానం జ్ఞప్తికి తెచ్చుకుని బెర్సెనీవ్ అందుకు అంగీకరించలా. ప్రతిరోజూ ఎలీనాను కలుసుకుంటూనే ఉన్నాడు. మాటల ద్వారానో, చీటీ ద్వారానో ఇన్సరోవ్‌స్థితి ఆమెకి తెలియజేస్తూనే ఉన్నాడు. ఎంతో ఆదుర్దాగా బెర్సెనీవ్‌కోసం ఎలీనా నిరీక్షించేది. ఎంతో శ్రద్ధతో అతనిమాటలు వినేది. ప్రశ్నలు వేసేది. తానే స్వయంగా ఇన్సరోవ్ దగ్గిరికెళ్ళాలని ఆతురచెందేది. కాని బెర్సెనీవ్ ఆమెని వెళ్ళవద్దని బతిమాలుకున్నాడు. ఇన్సరోవ్ చుట్టూ ఎప్పుడూ ఎవరో ఒకరు ఉంటూనే ఉన్నారు. ఇన్సరోవ్‌కి జబ్బుచేసిందని విన్నరోజునే ఎలీనాకికూడా జబ్బుచేసినట్లనిపించింది. ఇంటికి వెళ్ళగానే గదిలోకి వెళ్ళి తలుపు గడియవేసుకుంది. కాని భోజనానికి కబురువచ్చింది. లేచి వెళ్ళింది. ఆమె వాలకంచూసి తల్లి భయపడి వెంటనే వెళ్ళి పడుకోమన్నది. ఎలీనా తన చిత్తవృత్తిని ఎలాగైతేనేం అణచుకోగల్గింది. 'అతను చనిపోతే నేనూ చనిపోతా' అని అనుకో

సాగింది. ఈ ఆలోచన ఆమెకి సంతృప్తికలిగించి ఉదాసీనవైఖరి ప్రదర్శించ డానికి కావలసిన శక్తిని ప్రసాదించింది. ఎవరూ ఆమెని ఎక్కువగా వేధించలేదు. అన్నావాసిలెవ్నా పళ్ళతీపుతో బాధపడుతోంది. షూబిన్ తనపనిలో పూర్తిగా నిమగ్నమైపోయాడు. జోయా విచారసాగరంలో మునిగి *వెర్థర్ చదవాలని నిశ్చయించుకుంది. బెర్సెనీవ్ తరుచు వస్తూ పోతుండడం నికొలాయ్‌కి ఇష్టంలేదు. కర్నటోవస్కీ విషయంలో తన పథకం మందకొడిగా సాగినకొద్దీ ఈ అయిష్టత ప్రబలమైంది. ఇక ఆ ప్రధాన కార్యదర్శి (కర్నటోవస్కీ) ఎలీనా తన్ను వివాహమాడడానికి అంగీక రిస్తుందనే నమ్మకం కుదరక వెనకాముందాడుతున్నాడు. ఎలీనా బెర్సెనీవ్‌కి కృతజ్ఞతైనా తెలపలేదు. కొన్ని కొన్ని ఉపకారాలుచేసినవారికి కృతజ్ఞత తెల్పడంకూడా బాధాకరంగా ఉండి కలవరపెడుతుంది.

ఒకరాత్రి ఇన్సరోవ్‌కి మహాకష్టంగా కాలం గడిచింది. ఆ మర్నాడు బెర్సెనీవ్‌కి ఎలీనా అతని వాగ్దానం జ్ఞాపకంచేసింది. 'అయితే వెడదాంపద' అన్నాడు బెర్సెనీవ్. ఆమె లేచి జుబ్బా వేసుకోబోతుండగా మళ్ళీ బెర్సెనీవ్ అన్నాడు: 'వద్దు. రేపటికిదాకా ఆగు, చూద్దాం.' ఆ సాయంకాలానికి ఇన్సరోవ్‌కి కొంచెం నులువుచిక్కింది.

ఎనిమిదిరోజులు బాధాకరంగా గడిచాయి. ఎలీనా ప్రశాంతంగా ఉన్నట్టు కన్పించింది. కాని ఆమెకి తిండి సయించలా. నిద్రపట్టలా. అవయవాలలో ఏదోబాధ, తలలో ఏదో మంట బయలుదేరాయి. 'హారతి కర్పూరంలా హరించిపోయింది.' అంది దాసీది.

చివరికి తొమ్మిదోరోజున ఇన్సరోవ్‌కి సందిగ్ధావస్థ దాటింది. మాస్కో జర్నల్ చదివి వినిపిస్తూ కచేరీసావిడిలో ఎలీనా తల్లిపక్కకూర్చుని ఉంది. కాని ఆమె ఏంచమవుతోందో ఆమెకేతెలియడంలేదు. ఇంతలో బెర్సెనీవ్ వచ్చాడు. మామూలుగానే ఎలీనా ఆదుర్దాతో సిగ్గుతో అతనికేసి తేరిపారజూచింది. చూచీచూడడంతోనే అతను శుభవార్త తెచ్చాడని ఊహించింది. అతనూ ఔనని తలూచి మందహాసం చేశాడు. ఎలీనా లేచి అతన్ని ఆదరించింది

* సంగీతరూపకం. రచయిత: ఇటాలియన్ నాటక కవి. మాసెనెట్ (1842–1912)

"స్పృహవచ్చింది. గండం తప్పింది. ఓ వారంరోజుల్లో కోలుకుంటాడు." అని మెల్లిగా చెప్పాడు.

దెబ్బతప్పించుకుంటానికా అన్నట్లు ఎలీనా చెయ్యిచాచింది. కాని మాటాడలేదు. ఆమె పెదవులుమాత్రం వణికాయి. మొహం వికసించింది. బెర్సెనీవ్ అన్నావాసిలెవ్నాతో సంభాషణ మొదలుపెట్టాడు. ఎలీనా తన గదికి వెళ్ళి మోకాళ్ళమీద కూలబడి. దేవుణ్ణి ప్రార్థించింది. కృతజ్ఞత తెలిపింది...హృదయభారం తగ్గింది. నెమ్మదిగా కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి. హఠాత్తుగా అలసిపోయినట్లనిపించి తలగడామీద తల ఆనించి మెల్లగా గొణుక్కుంది. 'ఆండ్రీపెట్రోవిచ్...' అక్కడికక్కడే పడి నిద్రపోయింది. కనురెప్పలు. చెంపలు ఇంకా తడి ఆరలేదు. అప్పటికి పాపం! ఎలీనా నిద్రపోయీ, ఏడ్చీ ఎన్నాళ్ళో అయింది.

28.8.54

# ౨౭

బెర్సనీవ్ తెచ్చిన శుభవార్త కొంతవరకే నిజమైంది. గండం తప్పింది. కాని ఇన్సరోవ్ త్వరగా కోలుకోలేకపోతున్నాడు. శరీరతత్వమే బాగా దెబ్బతిందని డాక్టరు చెప్పాడు. అయినా రోగి లేచి గదిలో కాస్త అటూ ఇటూ తిరుగుతున్నాడు. బెర్సనీవ్ తన గదికి వెళ్ళిపోయినా ప్రతిరోజూ వచ్చి చూచివెళ్ళి ఎలీనాకు రోగి ఆరోగ్యవిషయం తెలియజేస్తూనే ఉన్నాడు. ఆమెకిఉత్తరంరాయడానికి ఇన్సరోరోకిధైర్యంచాలకపోయింది. బెర్సనీవ్‌తో మాట్లాడేటప్పుడైనా సూటిగా ఆమెనిగురించి మాట్లాడలేకపోయాడు. బెర్సనీవ్ ఉదాసీనత నటిస్తూ తాను స్టహోవ్ ఇంటికి వెళ్ళుతున్న సంగతి చెప్పి ఎలీనా చాలా కలతచెంది ఇంకా తేరుకోలేదని సూచించాడు. ఎలీనా కూడా ఉత్తరంరాయలేదు. మనసులో ఇంకోమార్గం తొక్కాలని అనుకుంది.

ఓ రోజున బెర్సనీవ్ మహాసంతోషంతో డాక్టరు ఇన్సరోవ్‌కి పత్యం పెట్టించాడనీ త్వరలోనే లేచి బయటతిరుగుతాడనీ ఎలీనాకు చెప్పాడు. మాటలు వినీవినడంతో ఎలీనా ఆలోచనాపూర్వకంగా కిందికిచూసి 'నీతో యేం చెప్పాలనుకుంటున్నానో వూహించగలవా ?' అని అడిగింది.

బెర్సనీవ్ ఆమె అభిప్రాయం అర్థంచేసుకుని కంగారుపడి,

"అతన్ని చూడాలనుకుంటున్నానని చెప్పదలచావు." అన్నాడు ఆమెకేసి చూడకుండానే.

ఎలీనా సిగ్గుపడి వినిపించీవినిపించనట్టు 'అవును' అని గొణిగింది.

"సరే-యెందుకు చూడకూడదు. చూడొచ్చు" అన్నాడు మనసులో బాధపడుతూ.

"ఇదివర కోమాటు చూసివచ్చాగదా అనా. కాని యీాతడవ నాకెదో భయమేస్తోంది...యెప్పుడూ ఇన్సరోవ్ వొంటరిగా వుండడం లేదంటిబిగా."

"అదేం పెద్ద సమస్యకాదు." అన్నాడుబెర్సెనీవ్ ఇంకా ఆమెకేసి చూడకుండానే 'నేను స్వయంగా నువు వస్తున్నావని చెప్పలేనుగాని నువు చీటీరాసియ్యి, తీసికెళ్ళియిస్తా. స్నేహితునికి చీటీరాసిస్తుంటే నిన్నెవరూ అడ్డగించలేరు. తప్పేమీాలేదు. చిన్న చీటీలో వస్తున్నానని రాయి"

"అబ్బా! వెళ్ళి చూడడం మహాకష్టంవేస్తుంది." అంది ఎలీనా.

"చీటీరాసి నాకియ్యి. నే తీసికెళ్ళి యిస్తా"

"అదేం అవసరంలేదులే. ఒక్కవిషయం నిన్నడగదలిచా. నామీాదేం కోప్పడకు, ఆంద్రీపెత్రోవిచ్! రేపుమాత్రం ఆయనదగ్గిరికి వెళ్ళకు."

బెర్సెనీవ్ పెదవి కొరుక్కుని. "ఆ-అర్థమైంది. పూర్తిగా అర్థమైంది" అని ఒకటి రెండు మాటలు మాత్రం మాట్లాడి త్వరగా వెళ్ళిపోయాడు.

"మరీ మంచిది, మరీమంచిది." అనుకున్నాడు ఇంటికెవెడుతూ. "నను ప్రోత్సహించే కొత్తవిషయం యేం కనబడడంలేదు మామూాలుకు భిన్నంలేదు. చూరుపట్టుకు వేలాట్టంలో ఆనందమేముంది? నేనెందుకూ పశ్చాత్తాప్పడను. నా అంతరాత్మ బోధించినట్టు చేశా. అంతా అయి పోయింది. సరే-వాళ్లనిఅలానే ఉండనీ. మానాన్న చెప్పిందేనిజం. 'మనం *సిబరైట్లంకాం మనం అన్నివిధాలాచెడ్డ ఘరానా మనుషులంకాం. మనం త్యాగధనులంకాం. మనం కార్మికులం! కార్మికులం! కార్మికులం! తోలు చొక్కాలేసుకొని కర్మాగారంలో - ఆ చీకటికోణంలో - పనిచేయడానికి పద - సూర్యరశ్మిని తక్కిన ప్రజకి వదిలెయ్యి. మన అజ్ఞాతజీవితం కూడా గర్వింపదగిందీ, సౌఖ్యదాయకమైందీ."

మర్నాటిఉదయం పోస్టుబంట్రోతు ఎలీనా రాసిన చీటీతెచ్చి ఇన్సరోవ్‌కి ఇచ్చాడు. అందులో 'బయలుదేరి వస్తున్నా. అందర్నీ పంపించి వెయ్. ఆంద్రీ పెత్రోవిచ్ యివాళ అక్కడికిరాడు' అని ఉంది.

---

* సిబరైట్లు: పురాతన గ్రీసునగరం సిబారిస్ నివాసులు. భోగ లాలసులు.

## ౨౮

చీటీ చదువుకోగానే ఇన్సరోవ్ గదంతా శుభ్రంచేశాడు. మందు సీసాలు తీసిపారెయ్యమని ఇంటి యజమానురాలికి చెప్పి అంగరఖా తీసేసి చొక్కా తొడుక్కున్నాడు. గుండె టకటకా కొట్టుకొంటోంది. ఆనందంతో, బలహీనంతో తల దిమ్మెక్కిపోయింది. కాళ్ళమీద నిలుచోలేక పోయాడు. సోఫామీద కూర్చుని చేతిగడియారంకేసి చూసి 'పన్నెండింటికి ఇంకా పావుగంట వుంది. పన్నెండుకాకముందు ఆమె రావడం సాధ్యపడదు. యీ పావుగంట యెదన్నా ఆలోచిస్తూ కూర్చోవాలి. లేకపోతే తట్టుకోలేను.' అని తనలో తాను అనుకున్నాడు.

ఇంతలో హఠాత్తుగా తలుపుతెరుచుకుని ఎలీనావచ్చింది. సన్నని సిల్కుగౌను తొడుక్కుని ఉంది. మొహం పాలిపోయిఉన్నా నవనవలాడే యవ్వనం ఆమెలో పొంగిపోతోంది. అమాంతంవచ్చి సంతోషంతో ఏడుస్తూ అతని వక్షంమీద వాలింది.

"నువు బతికేఉన్నావు" అని పదే పదే అంది "నువు నావాడివి" ఇన్సరోవ్ తలపట్టుకుని నిమిరింది. ఆమెచేతులు తగిలేసరికి, ఆమె దగ్గర ఉందనే పరిజ్ఞానం కలిగేసరికి అతను సంతోషంతో ఉక్కిరిబిక్కిరి అయిపోయాడు.

ఆనుకునికూర్చుని అమె తనికేసి తేరిపారజూచింది. ఆ చూపులో ప్రేమలోమునిగిన స్త్రీ కళ్ళల్లోమాత్రమేవెలిగే దరహాసం, కరుణ, లాలింపు ద్యోతకమయాయి.

హఠాత్తుగా ఆమె మొహం విషాదావృతమైంది. "యెంత చిక్కి పోయావ్ డిమిట్రీ!" అని అతని చెంపలునిమిరి "గడ్డం యెంత మాసి పోయింది!" అంది.

"నువ్వూ యెంతో చిక్కిపోయావ్ ఎలీనా!" అన్నాడు ఇన్సరోవ్ ఆమె చేతివేళ్ళను ముద్దిడుకుంటూ. ఆమె సంభ్రమంతో ఉంగరాలజుట్టు విదల్చి అంది "మరేం పర్వాలేదులే. మనకి మంచిరోజులువచ్చాయి. మనం గుళ్ళోఏకలుసుకున్ననాడువచ్చిన తుపానులాంటిదే వచ్చింది, పోయింది. ఇక మనం జీవితం సుఖంగా గడుపుదాం."

జవాబుగా అతను మందహాసం చేశాడు.

"అబ్బ! యెంత చెడుకాలం దాపరించింది. డిమిట్రీ! తాము ప్రేమించినవారు పోయింతర్వాత మనుష్యులు ఎలా మనగలుగుతున్నారో! ఆంద్రీపెట్రోవిచి చెప్పినముక్కలు నాకు ముందేతెలుసు ఆంద్రీ అన్నాడు: 'నీ జీవితం అతనిజీవితం మీద ఆధారపడి వుంది.' అని.స్వాగతం డిమిట్రీ! స్వాగతం!"

ఏమనాలో ఇన్సరోవ్‌కి తెలయలా. ఆమె పాదాలమీద పడాలనే కాంక్ష కలిగింది. అతనిజుట్టు వెనక్కిదువ్వి ఎలీనా అంది: "యింకో విషయంకూడా. గమనించా. నాకు పనేం లేనపుడు అనేకవిషయాలు గమనిస్తుంటా. మనిషికి బొత్తిగా సౌఖ్యంలేనప్పుడుచుట్టూ జరుగుతున్నదంతా అతి సూక్ష్మంగా పరిశీలిస్తాడని నీకు తెలిసిందేగా. నిజంచెప్పాలంటే నా మనసు భయంతో కంపించిపోతున్నా యే యీగకేసో తదేకదృష్టితో చూస్తాను. కాని అదంతా సమసిపోయింది, సమసిపోయింది. కదూ? ముందుముందంతా శుభ్రప్రదంగా వుంటుంది కదూ?"

"నాకు ముందున్నది నువ్వే! నాకిక శుభప్రదంగా వుంటుంది." అన్నాడు ఇన్సరోవ్.

"నాకుగూడా అంతే. కాని జ్ఞాపకముందా? ఆఖరితడవ నేనిక్కడికి వచ్చినప్పుడు—కాదు. ఆఖరితడవకాదు. క్రిందటితడవ మనిద్దరం మాట్లాడు కునేటప్పుడు మృత్యువును గురించి నేను మాట్లాడడం మొదలుపెట్టా. అలా యెందుకు మాట్లాడానో నాకే తెలియదు. అప్పుడు మృత్యువు మన

వెనుక పొంచివుందని నాకు అనుమానం వెయ్యనేలేదు. యిప్పుడు నీకు కులాసాగానేవుందికదూ?"

"ఓ బాగా కులాసాగానేవుంది."

"కులాసాగావున్నావ్. నాకెంత సంతోషం కల్గిందనుకున్నా!"

కొంచెంసేపు ఇద్దరూ మౌనంవహించారు.

"ఎలీనా" అన్నాడతను.

"యేమిటి, ప్రియతమా!"

"మనకి శిక్షగా యీరోగం ప్రాప్తించిందని నీకెప్పుడైనా తట్టిందా, చెప్పు?"

ఎలీనా అతనికేసి గంభీరంగా చూసి 'అవును. ఈ ముక్క నాకు తట్టింది. డిమిట్రీ! కాని అపుడు నేననుకున్నాను: 'మన మేం అపరాధం చేశామని యీశిక్ష? నా విద్యుక్తధర్మం నెరవేర్చలేదా? భగవంతుణ్ణి అవమానించానా? లేదే!' నా అంతరాత్మ యితర్ల అంతరాత్మకన్న వేరు కావచ్చు. కాని యేదిసంగానైతేనేం ప్రశాంతంగావుంది. నీమూలంగా నేను నిందార్హురాలనౌతానా? నిన్ను అడ్డగిస్తున్నానా? నిన్ను ఆపేస్తున్నానా?"

"నన్ను ఆపెయ్యవు ఎలీనా! మనిద్దరం కలిసేవెడదాం."

"డిమిట్రీ! మనిద్దరం కలిసేవెడిదాం. నువ్వెక్కడికి వెడితే అక్కడికి నేనూ వస్తా...అది నా విద్యుక్తధర్మం. నిను ప్రేమిస్తున్నా...యింకే ధర్మం నాకు తెలీదు."

"ఎలీనా! నువ్వనే ప్రతిమాటా నను శాశ్వతంగా బంధించి వేస్తోంది."

"బంధనాలసంగతి యిపుడెందుకూ? మనిద్దరం స్వతంత్రులం అవును." నేలకేసి ఆలోచనాపూర్వకంగా చూస్తో, అతని జుట్టు యింకా సవరిస్తూ 'ఈరోజుల్లో యెంతో అనుభవానికొచ్చింది. వెనుక యెన్నడూ గ్రహించలేనివిషయాలెన్నో గ్రహించా. యిదివరకుయెవరన్నా, నాతో 'పెద్ద కుటుంబంలోని అమ్మాయి, ఆవంకా యీవంకా పెట్టి వొంటరిగా వెళ్ళి ఓయువకుణ్ణి కలుసుకుంటోంది.' అంటే యెంత మండిపోయేదాన్ని! కాని తమాషా యేమంటే అదంతా నాకు అనుభవమైంది. యిపుడు నాకు కోపం రాదు. అవును, నిజం." అందామె ఇన్సరోవ్ కేసి తిరిగి.

ఎంతగానో మెచ్చుకుంటూ అతను ఆమెకేసి చూసేసరికి ఆమె అతని జుట్టు వదిలి కళ్ళుమూసింది.

"డిమిట్రీ!"...అంటూ తిరిగీ ప్రారంభించింది. "ఆ దిక్కుమాలిన పక్కమీద నువు పడుండగా వచ్చి చూచా. నువు స్పృహతప్పి మృత్యు గహ్వరంలో చిక్కుకునివుండగా చూచా. నీకు తెలుసా?"

"నన్ను వచ్చి చూచావా?"

"ఆ—"

ఒక్కనిమిషం మౌనంవహించి అన్నాడు:

"బెర్సెనీవ్‌కూడా యిక్కడే వున్నాడా?"

ఆమె అవునని తలూపింది. అతను ఆమె మీదికిఒరిగి "ఎలీనా! నీకేసి చూడలేను ఎలీనా!" అన్నాడు బహు నెమ్మదిగా.

"యెందుకనేం? ఆండ్రీ పెట్రోవిచ్ దయామయుడు. అతనిముందు నాకేం సిగ్గేయదు. అసలు సిగ్గుపడాల్సిన అవసరమేముంది? నేను నీదాననని ప్రపంచానికి చాటిచెప్పడానికి సిద్ధంగావున్నా. ...ఆండ్రీ పెట్రోవిచ్‌ని నా సోదరునిలా విశ్వసిస్తా."

"అతను నా ప్రాణం రక్షించాడు. అమితదయాళువు, ఉదారుడు."

"అవును...యిదంతా అతని చలవేనని నీకు తెలుసా. నువ్వు నన్ను ప్రేమించావని మొదటిసారిగా చెప్పిందతనే. అంతా చెప్పాలంటే... అవును. అతను మహా ఉదారస్వభావుడు!"

ఇన్సరోవ్ ఆమెకేసి ఆప్యాయంగాచూసి "అతను నిన్ను ప్రేమిస్తున్నాడుకదూ?" అన్నాడు. ఆమె కిందకు చూసి మెల్లిగా అంది:

"అవును. నన్ను ప్రేమించాడు."

ఇన్సరోవ్ ఆమెచెయ్యి వొత్తి "ఓ రష్యన్లు! మీది బంగారంలాంటి మనసు! బెర్సెనీవ్ వున్నాడా, యెంతశ్రద్ధగా నాకు పరిచర్యచేశాడు! రాత్రిళ్ళు కాచుకూర్చున్నాడు! యిక నువ్వో దేవకన్యవి! ఒక్కమాటన్నా అనకుండా, కాస్తన్నా సందేహం లేకుండా...యిదంతా నాకోసం..."

"అవునవును. అంతా నీకోసమే. ఎందుకు తెలుసా? మేమంతా నిన్ను ప్రేమిస్తున్నాంగనుక. డిమిట్రీ! యెంతచిత్రంగా వుందో చూడు. మొట్ట

మొదటగా నిను చూసినపుడు—ఆ కథంతా మళ్ళీ మళ్ళీ చెప్పాలని నా కుంది, మళ్ళీ మళ్ళీ వినాలని నీ కుంది" "యేమిటా కన్నీళ్ళు," అన్నాడు ఇన్సరోవ్.

"కన్నీళ్ళా?" జేబురుమాలుతో కన్నీళ్లుతుడుచుకుని "తెలివితక్కువా, ఆనందబాష్పాలు వస్తాయని తెలీదూ! నే చెప్పదలిచిందేమిటంటే మొట్ట మొదట నేను నిను చూసినపుడు నువ్వింత గొప్పవాడ వనుకోలా. మొదట షూబిన్ అంటే నా కెంతో యిష్టంగా వుండేది. కాని అతనిమీద యెన్నడూ ప్రేమ పుట్టలా. యిక ఆంద్రీ పెట్రోవిచ్ విషయం: అవును. వొకప్పుడు నను నేనే ప్రశ్నించుకున్నా, 'యితన్నేనా ప్రేమిస్తున్నది?' అని కాని నీ విష యంలో అసలు అలాంటి గొడవే రాలా. కాని తర్వాత తర్వాత నా మనసు పూర్తిగా నీ స్వాధీనం అయిపోయింది."

"వద్దు వద్దు." అని లేచినిల్చోవాలని ఇన్సరోవ్ చూచాడు. కాని నిల్చోలేక సోఫామీద పడిపోయాడు.

"యేమిటి?" అని అడిగింది ఎలీనా ఆదుర్దాగా.

"మరేం లేదు...నా కింకా బాగా బలంపట్టలా, యిటువంటి ఆనందం తట్టుకోలేకుండా వున్నా."

"అలా అయితే ప్రశాంతంగా కూర్చో. ఉద్రేకం పనికిరాదు." అంది వేలితో బెదిరిస్తూ. "అంగరఖా అప్పడే తీసేసావేం? యిలా కూర్చో. కథలు చెబుతా. వినాలి. అంతేగాని మాట్లాడకూడదు. వంట్లో బాగా లేనప్పుడు యెక్కువ మాట్లాడడం మంచిదిగాదు."

షూబిన్ గురించీ, కర్నటోవస్కీని గురించీ యీ రెండువారాల్లో అతను చేసిన పనులనుగురించీ ఆమె చెప్పింది. పత్రికల్లో రాతలనుబట్టి చూస్తే యుద్ధంవచ్చితీరుతుందనీ అతనికి బాగా కులాసా చిక్కగానే ఒక్క నిమిషం కూడా ఆలస్యంచెయ్యకుండా వెళ్ళిపొయ్యేమార్గం ఆలోచించాలనీ చెప్పింది. అతనిపక్కన కూర్చుని బుజంమీద చెయ్యి ఆనించి ఏవేవో కబుర్లు చెప్పింది.

ఆమె చెప్పిందంతా ఇన్సరోవ్ విన్నాడు. వింటూ మధ్యమధ్య సిగ్గు పడ్డాడు. మధ్యమధ్య వెలవెలబోయాడు. అనేకసార్లు ఆమెధోరణి ఆపుదా మని యత్నించాడు. తర్వాత హఠాత్తుగా లేచి కూర్చుని,

"ఎలీనా, యిక నను వదిలివెళ్ళిపో." అన్నాడు కఠినంగా.

"ఏమిటి?" అంది ఆశ్చర్యపోతూ. "వంట్లో బాగుండలేదా?"

"అబ్బే! వంట్లో బాగానేవుంది. కాని దయుంచివెళ్ళిపో."

"నాకేం అర్థంకావడంలేదు. నన్ను వెళ్ళిపొమ్మంటావా?...యేమిటీ పని?" అంది హఠాత్తుగా. అతను నేలమీదికి వొరిగి ఆమె పాదాలు ముద్దిడుకుంటున్నాడు.

"అదేంపని డిమిట్రీ! వద్దు. వద్దు."

అతను లేచికూర్చుని అన్నాడు:

"అయితే నువు నను వదిలిపెట్టి వెళ్ళిపోవాలి. ఏలీనా! చూడు. జబ్బుచేసినప్పుడు నాకు మొదట్లో స్పృహతప్పలా. అపుడు మహాఅగాధంలో పడిపోబోతున్నానని నాకు తెలుసు. నాకు జ్వరంవచ్చి సంధిపుట్టినప్పుడు కూడా యీవిషయం గుర్తించా. మృత్యువు నా సమీపంలో తారాడుతుందని అనిపించి మనసులో అందరిదగ్గరా శెలవుపుచ్చుకున్నా. ఆశ పూర్తిగా అంతరించిపోయింది...యిక యిపుడు హఠాత్తుగా యీ పునర్జన్మ, చీకటితర్వాత యీ వెలుగు, నా పక్కన నువ్వు, నీ స్వరం, నీ విశ్వాసం, తట్టుకోలేకపోతున్నా. యెంతో పిచ్చిగా నిను ప్రేమిస్తున్నానని నాకు తెలుసు. 'నీ దానను' అన్న నీమాట విన్నా. యిక నాకు నేను బాధ్యత వహించాలేను...నువు వెళ్ళిపో."

"డిమిట్రీ!" అని అతనిబుజంమీద మొహం దాచుకుంది ఎలీనా. ఇప్పుడు అతన్ని పూర్తిగా అర్థంచేసుకుంది."

"ఎలీనా! నిను ప్రేమిస్తున్నా. నీకోసం నా ప్రాణాలైనా అర్పిస్తా... నేను యింతబలహీనంగావుండి, నను నేను అదుపులో పెట్టుకోలేని సమయంలో యెందుకొచ్చావ్? నా రక్తం వుడికిపోతుంటే 'నీదాన'నన్నావ్. నిను ప్రేమిస్తున్నానన్నావు..."

"డిమిట్రీ" అని మళ్ళీ సిగ్గుపడి ఆమె అతనికింకా దగ్గిరిగా జరిగింది.

"ఎలీనా! కాస్త దయుంచు. వెళ్ళిపో. నేను చచ్చిపోతానేమోననిపిస్తోంది...యీ భావాలను భరించలేకుండావున్నా...నా తనువంతా నిను కాంక్షిస్తోంది...మృత్యువు మనకు యెడబాటుకలిగిస్తుందనుకోడం... మరి యిపుడు నువు నా బాహుపంజరంలో వుండడం...ఎలీనా!"

ఆమె వణికిపోయింది.

"అయితే నను స్వీకరించు" అన్నది, అతనికివినిపించీ వినిపించకుడా.

## ౨౯

మోహం చిట్లించుకుంటూ నికోలాయ్ గదిలో అటూ యిటూ పచార్లు చేస్తున్నాడు. కిటికీదగ్గర కాలుమీద కాలేసుకుని కూర్చుని షూబిన్ ప్రశాంతంగా చుట్ట కాలుస్తున్నాడు.

"అటునించి యిటూ, యిటునించి అటూ పచార్లుకొట్టడం యింక ఆపేస్తే బాగుంటుంది." అన్నాడు షూబిన్ చుట్టబూడిద వేలితో రాల్చి వేస్తూ. "ఏదో చెబుతారని ఆశతో మీరు తిరిగినట్లల్లా ముందుకూ వెనక్కీ తలతిప్పుతూంటే నా మెడ నెప్పెట్టిపోతోంది!"

"నువ్వు వట్టి జగడాలకోరువి. నా చిత్తవృత్తిని అర్థంచేసుకోవాలని ప్రయత్నించవు. నా కామెతో బాగా జోస్తీ అయిపోయింది. నిజనాకి ఆమంటే నా కమితప్రేమ: అందుకని సహజంగా ఆమె దగ్గరలేకపోతే నాకు నరకలా వుంటుంది. యి వెర్రీ నువు ఆలోచించవ్...అక్టోబరు జరుగుతోంది. అపుడే శీతాకాలం వచ్చేసింది. యింకా రెవాల్‌లో ఆమె యేంచేస్తోందో!" అన్నాడు నికోలాయ్.

"మేజోళ్లు కుట్టుకుంటూ వుండచ్చు. నీకోసరంమాత్రం కాదులే! ఆమెకోసం."

"నీకంతా నవ్వులాటగా వుంది. సరే నవ్వు. కాని వొక్కటి చెబుతా విను. అలాంటిమనిషి యిక దొరకదనుకో. యెంత నిజాయితీ! యెంత నిష్పక్షపాతబుద్ధి!"

"నువు రాసిచ్చిన ప్రాంసరీనోటు తాలూకు డబ్బు అడిగిందా?"

"యెంతనిష్పక్షపాతం!" అని తిరిగి నికొలాయ్ గొంతెత్తి ప్రారంభించాడు "నిజం. ఆశ్చర్యంగావుంది. ఓ లక్షమంది ఆడాళ్ళున్నారంటారు గదా! వాళ్ళని, ఆలక్షమందినీ యేసీచూపించమను. అందులో మచ్చుకు ఒక్కత్తైనా ఆమెతో తులతూగుతుందేమో? వొక్క వుత్తరం ముక్కన్నా రాయడంలేదు. నా ప్రాణం తినేస్తోంది."

"నీకు ♦పైథాగోరస్ కున్నంత వాగ్ధోరణివుంది. నీకో సలహా చెప్పనా?" అన్నాడు షూబిన్.

"యేమిటో సలహా?"

"అవగస్టనా క్రిస్టియనోవ్నా తిరిగి రాగానే... అర్థమైందా?"

"సరే-తిరిగివచ్చినాక?"

"ఆమెని చూడగానే... నా భావపరంపర అర్థమవుతోందా?"

"ఆ-ఆ-"

"చితకతన్ను, దాంతో తిక్క కుదురుతుందోలేదో చూడు."

నికొలాయ్ కోపంతో మొహం తిప్పేసుకున్నాడు.

"నాకేదో చక్కని సలహాయిస్తావనుకున్నా, చివరికిదా!... కాకపోయినా శిల్పి-నీతీనియమాలూ లేని శిల్పి - యింతకంటె మంచిసలహా యెలా యిస్తాళ్ళే."

"నీతీ నియమాలూ... అయితేనేం, నువ్వంతగా అభిమానించే కర్నటోవస్కీ, నీతీనియమా లెన్నివున్నా నీ దగ్గిరనించి నిన్న వందరూబుళ్ళు కొట్టేశాడటగా. బొత్తిగా నీకు వుపాయం తెలీదు. కాదూ?"

"అయితేనేం. దబ్బట్టి పేకాడాం. అవును. నేను అనుకున్నా... కాని అతన్నెవరూ మా యింట్లో మెచ్చుకోరు యెందుకో..."

"అతడు అనుకుంటున్నాడు: 'పోనిద్దూ, యీాయనకి అల్లుణ్ణి అవుతానో లేదో దేవుడికి తెలియాలి, లంచాలు పుచ్చుకోని నాకు యీ వంద రూపాయలు మహాభాగ్యం' అని."

"అల్లుడు! మామ! సరిపోయింది! దశమగ్రహం! యింకేపిల్లయినా అలాంటి మొగుడు దొరుకుతాడంటే సంబరపడేది. నువు ఆలోచించు! మాంచి

♦పైథాగోరస్ (బి. సి. 6వ శతాబ్దం) గ్రీసుదేశపు గణితశాస్త్రజ్ఞుడు, గొప్ప వక్త. వేదాంతి.

చురుకైనవాడు. మాంచి తెలివైనవాడు. స్వయంకృషిమీద పైకి వచ్చిన వాడు. రెండురాష్ట్రాల్లో పనిచేశాడు."

"ఆ-రాష్ట్రంలో గవర్నర్ని బుట్టలో వేసుకున్నాడు."

"కావచ్చు. అలాంటి పని చాలా అవసరం. కార్యశూరుడు, వ్యాపారస్తుడు-"

"మాంచి పేకాటగాడు!" అన్నాడు ఖూబిన్.

"సరే - పేక బాగా ఆడతాడు. కాని ఎలీనాని యెవరన్నా అర్థం చేసుకోగలరూ? ఆమెకేం కావాలో తెలుసుకున్న మొగాడుంటేచూపించు. మొట్టమొదట చాలా ఖుషీగా వుంది. తర్వాత వాడి వత్తైపోయింది. హఠాత్తుగా ఆమెకేసి చూట్టానికే భయం వేస్తుంది. మళ్ళీ హఠాత్తుగా కులాసాగా తిరుగుతుంది. యింతకీ కారణం మాత్రం కనిపించదు."

ఓ నౌకరు ట్రేమీద కాఫీ, మీగడ, బిస్కత్తులు పెట్టుకుని చక్కా వచ్చాడు.

"ఆ యువకుడంటే తండ్రి కిష్టం" అన్నాడు నికొలాయ్ ఓ బిస్కత్తు అటూ ఇటూ తిప్పతూ. 'అయితేనేం కూతురికేం పట్టింది. పూర్వం-తండ్రిని దేవుడుగా చూచుకునే రోజుల్లో అదంతా సరిపోయింది. అదంతా మార్చేసుకున్నాం. కాలమే మారిపోయింది. యిప్పుడు ఆడపిల్లలు వాళ్ళిష్ట మొచ్చిన వాళ్ళతో కులాసాగా మాట్లాడొచ్చు. వాళ్ళిష్టమొచ్చిన పుస్తకాలు చదవచ్చు. నౌకర్లూ చాకర్లూ లేకుండా మాస్కో-దాటి, పారిస్‌లో ఆడాళ్లలాగా వెళ్ళిపోవచ్చు. మరేం తప్పులేదు. మొన్న 'యెలీనా యెదీ?' అని అడిగా. 'యెక్కడికో బయటికి వెళ్లింది.' అని చెప్పారు. యెక్కడికి వెళ్లింది? నౌకర్లకీ తెలీదు. యిది మంచి పనే నంటూ."

"కాఫీ తీసుకుని వాణ్ణి పంపించెయ్యండి. మీ అంతట మీరే అన్నారుగా గృహకల్లోలం పనికిరాదని." అన్నాడు ఖూబిన్ మెల్లిగా.

నౌకరు ఖూబిన్‌కేసి నిస్పృహతో చూశాడు. నికొలాయ్ కాఫీకప్పు తీసుకొని, కొంచెం మీగడ కలుపుకుని, గుప్పెడు బిస్కెత్తులు తీసుకున్నాడు. నౌకరు వెళ్ళిపోగానే అన్నాడూ: "యీ యింట్లో నేనంటే ఆవగింజంతైనా లక్ష్యంలేదు. ఈముక్కే చెప్పాలనుకున్నా. యీరోజుల్లో పైబడాయిచూసి మోసపోతారు. పట్టి తెలివితక్కువ మొద్దయినా, గొప్ప

వాడిలా నటిస్తేసరి, వాణ్ణి అంతా గౌరవిస్తారు. ప్రపంచానికి యెంతో వుపకరించే తెలివితేటలు వున్నవాడైనా నమ్రతతో...”

“నువు పెద్ద రాజకీయవేత్తవనే అనుకుంటున్నావా, నిక్కీ” అన్నాడు ఖూబిన్ బిగ్గరగా.

“యేమిటా పిచ్చివాగుడు!” అన్నాడు నికొలాయ్ మండిపడుతూ. “నువ్వెవరో మర్చేపోతున్నావు. యిక్కడ నన్నెవరూ లక్ష్యపెట్టరంటానికిదో వుదాహరణ.”

“అన్నావాసిలెవ్నా నిన్నలా వేధిస్తోంది, పాపం” అన్నాడు ఖూబిన్ మాటలు సాగదీస్తూ. ‘నికొలాయ్ ఆర్కియోమెవిచ్! నిజానికి మేం సిగ్గుపడాల్సిందే. యివాళో రేపో అన్నావాసిలెవ్నా పుట్టినరోజు. ఆమెకి యెదన్నా బహుమానం కొనుక్కు రారాదూ. ఆమెంటే కాస్త శ్రద్ధ చూపావంటే యెంత సతోషిస్తుందో నీకు తెలుసుగా.”

“అవునవును. సమయానికి జ్ఞాపకంచేశావు. కృతజ్ఞుణ్ణి, తప్పకుండా, తప్పకుండా యెదన్నా బహుమానం...అంతాయెందుకు యిదిగో, నాదగ్గిర ఓ వెండిపిన్ను వుంది. మొన్ననే కొన్నా. యిది బాగుంటుందిగదూ?”

“లెవాల్‌లోవున్న ఆవిడకోసం కొన్నావుగదూ!”

“అవునవును.”

“అలాగయితే ఆమెకి చాలా బాగుంటుంది.” అని ఖూబిన్ లేచాడు.

“యివాళ రాత్రికి యెక్కడికివెడదాం పావెల్!” అని నికొలాయ్ అతని కళ్ళల్లోకి చూస్తూ చనువుగా అడిగాడు.

“మీరు క్లబ్బుకివెళ్లరూ?”

“క్లబ్బుకి వెళ్ళినాక – ఆ తర్వాత యెక్కడికివెడదాం అని అడిగా.”

“ఊహుఁ–నికొలాయ్! రేపు నాకు బోలెడంత పనుంది. యింకో మాటు వెడదాం.” అని ఖూబిన్ చక్కాబోయాడు.

నికొలాయ్ మళ్లీ మొహం చిట్లించుకుని రెండుమూడుమాట్లు పచార్లు చేసి బీరువాలోంచి వెండిపిన్ను ఉన్న పెట్టితీశాడు. పట్టురుమాలుతో తుడుస్తూ దానికేసి తదేకదృష్టితో చూసి, అద్దంముందు కూర్చుని గంభీరముఖం పెట్టి తల అటూ, ఇటూ త్రిప్పుతూ జాగ్రత్తగా తలదువ్వుకున్నాడు. బుగ్గ మీదికి నాలిక జాపి దానికేసి తేరిపారజూచాడు.

ఇంతలో వెనక యెవరో దగ్గారు. వెనక్కి తిరిగి చూసేసరికి ఇందాక కాఫీ తెచ్చిన నౌకరు కనిపించాడు.

"నికొలాయ్ ఆర్టియోమెవిచ్ !" అన్నాడు, నౌకరు గంభీరంగా. "మీరు మా యజమానులు."

"ఆ_తెలుసు. అయితే?"

"చనువుతీసుకున్నందుకు క్షమించండి. పసితనంనించీ మీదగ్గిర పని చేస్తున్నా. మీకు సేవచేయాలనే కోరికతోనే—కాని వొక్క విషయం చెప్పాలి "

"యేమిటది ?"

నౌకరు సంకోచిస్తూ సంకోచిస్తూ అన్నాడు :

"ఎలీనా నికొలయెవ్నా యెక్కడికి వెడుతోందో తెలియదన్నారు కదూ. యెక్కడికి వెడుతోందో నాకు తెలుసు."

"యేమిటా పిచ్చికూతలు. మొద్దుమొహమా !"

"చిత్తం. మూడురోజులక్రితం ఓ యింటోకి వెడుతూంటే చూశా."

"యెమిటీ? యెక్కడికి ? యెవరియింటికి ?"

"ఆ_వీధిలో యింటికి. యెక్కువదూరం వుండదు. ఆయింటో యెవరు వుంటున్నారని నౌకర్ని అడిగా."

నికొలాయ్ నేలతన్ని "నోరుమూయ్, పుండాకోర్ ! నా కూతురు యెదో దయతలిచి బీదాబిక్కిని చూట్టానికి వెళుతూంటుంది. నువు ... పో, అవతలికి పో, వెధవ !"

నౌకరు భయపడి గుమ్మందాకా పరుగెత్తాడు.

"ఆగు. ఆ నౌకరు యేమని చెప్పాడు." అని అడిగాడు నికొలాయ్.

"మరేంలేదు, దొరా, మరేంలేదు. అక్కడ చదువుకునే కుర్రాడు_"

"నోరుముయ్ వెధవా ! ... విను. యీ ముక్క యెవరితోనన్నా, కల్లోఆయినా సరే అన్నావో_"

"చిత్తం, దొరా, చిత్తం..."

"నోరుముయ్ ! ఒక్కముక్కన్నా అన్నావో-అన్నావని యెవరన్నా నాకు చెప్పారో - నడిసముద్రంలో దాక్కున్నాసరే నిను యీడ్చుకొస్తా. వినిపించిందా ? పో, బయటికి పో."

నౌకరు చక్కా బోయాడు.

"ఆరి, భగవంతుడా, భగవంతుడా! యేమిటిదంతా" అనుకున్నాడు నికొలాయ్ నౌకరు వెళ్ళిపోగానే. "గాడిద యేం చెప్పాడు? యేమైనాసరే ఆయింటో యెవరుంటున్నారో తెలుసుకోవాలి ... నేనే స్వయంగా వెళ్ళి రావాలి. చివరికి యిదీ. నౌకరు వెధవ, వీడూ అధిక్షేపించేవాడే!"

వెధవ! అని బిగ్గరా అనుకుని వెండిపిస్తు బీరువాలోపెట్టి అన్నా వాసిలెవ్నాను చూట్టానికి వెళ్లాడు, నికొలాయ్.

నికొలాయ్ వెళ్లేసరికి అన్నావాసిలెవ్నా మొహానికి కట్టుకట్టుకుని పడుకునిఉంది. ఆవిడ పడుతున్న బాధచూసేసరికి నికొలాయ్‌కి మరింత కోపం వచ్చింది. తొందర్లోనే ఆమెకి కన్నీరు ప్రవహించేటట్లు చేశాడు.

# 30

బాల్కన్ రాష్ట్రాలలో అలముకున్న యుద్ధమేఘాలు చివికి చివికి గాలివానగా పరిణమించాయి. టర్కీ రష్యామీద యుద్ధం ప్రకటించింది. ముఖ్యపట్టణాలు ఖాళీచేయవలసిన గడువు దాటిపోయింది. సినోపీ హత్యా దినం సమీపించింది. మాతృదేశానికి వెనువెంటనే బయలుదేరి రమ్మంటూ ఇన్సరోవ్‌కి జాబు వచ్చింది. కాని ఇన్సరోవ్‌కి ఇంకా పూర్తిగా ఆరోగ్యం చిక్కలేదు. దగ్గు వస్తూంది. చాలా బలహీనంగాఉన్నాడు. కొద్దిగా జ్వరం కూడా తగులుతోంది. అయినప్పటికీ ఇంటిదగ్గిర ఉండడమేలేదు. అతని హృదయంలో అగ్ని ప్రజ్వరిల్లింది. ఆరోగ్యవిషయం బొత్తిగా పట్టించుకోటం లేదు. మాస్కో వెళ్ళి రహస్యంగా రకరకాల మనుష్యుల్ని కలుసుకున్నాడు. రాత్రిళ్ళు రాసుకుంటూ కూచునేవాడు. పగలు ఎవరికీ కనిపించేవాడేకాదు. తొందర్లోనే వెళ్ళిపోతున్నానని ఇంటి కామందుకి చెప్పి తన కొద్దిపాటి సామానూ అతనికి బహుమతిగా ఇచ్చేశాడు. ఎలీనాకూడా ప్రయాణసన్నాహంలో ఉంది. ఓరోజు సాయంత్రం ఎలీనా తనగదిలో కూర్చుని జేబు రుమాళ్ళు కుట్టుతూ దిగాలుపడి గాలిమోత వింటూంది. ఇంతలో దాసీ వచ్చి నికొలాయ్, అన్నా పడకగదిలో ఉన్నాడనీ ఎలీనాను రమ్మన్నాడనీ చెప్పింది. ఎలీనా బయలుదేరుతుండగా 'మీ అమ్మ యేడుస్తోంది. మీ నాన్న మహాకోపంగావున్నాడు.' అని మెల్లిగా అన్నది.

ఎలీనా తల్లిపడకగదిలో ప్రవేశించింది.

అన్నా పడకకుర్చీలో పడుకుని ఉడుకులాం వాసనచూస్తోంది. నికొలాయ్ నెగడుపక్క నిల్చుని ఉన్నాడు. చొక్కాగుండీలు అన్నీ పెట్టుకున్నాడు. బాగా పిండిపెట్టిన కాలరులోంచి పై వేలాడుతోంది. అతని

వైఖరి అంతా పార్లమెంటులో మహోపన్యాసం చేయడానికి సిద్ధంగా ఉన్న వాడిలా ఉంది. హఠాత్తుగా చేతితో కుర్చీచూపించాడు. ఎలీనా అర్థం చేసుకోలేక యేమిటని ప్రశ్నార్థకంగా తండ్రికేసి చూసింది. కూతురుకేసి తిరగకుండానే హుందాగా 'అలాకూర్చో' అన్నాడు నికొలాయ్.

ఎలీనా కుర్చీలో కూర్చుంది. తల్లి ఏడుస్తూ ముక్కు చీదుకుంది. నికొలాయ్ కుడిచెయ్యి చొక్కా కింద పెట్టుకుని కొంచెం సేపైనాక అన్నాడు:

"ఎలీనా! మన అభిప్రాయాలు విశదీకరించుకుందామని - కాదు. నీనించి సంజాయిషీ కోరదామని నిన్ను పిలిపించాను. నీ నడత నాకేం నచ్చలా! ఈ ముక్క వేలవంగా వుంది - నీ నడత నాకు యిదిగో యిక్కడకూర్చున్న మీ అమ్మకీ మహావిచారం కలిగిస్తోంది. మహాకోపం తెప్పిస్తోంది."

నికొలాయ్ ఈ మాటలు మంద్రస్వరంలో చెప్పాడు. ఎలీనా మాట్లాడకుండా తండ్రికేసి చూసింది. తర్వాత తల్లికేసి చూసి వైవర్ణ్యం చెందింది.

"వొకప్పుడు పిల్లలు తల్లిదండ్రులను తిరస్కరించేవారుకాదు. గజ గజా వణికేవారు. దురదృష్టవశాత్తూ - చాలామంది అలానే అనుకుంటారు- ఆకాలం దాటిపోయింది. అయినా యింకా చట్టాలు ... యిలా సాగనీని చట్టాలు...చట్టాలు ఉన్నాయి, గమనించు. యింకా చట్టాలువున్నాయి."

"కాని, నాన్నా!" అంబోయింది ఎలీనా.

"నా మాటలకి అడ్డంరాకు. యింతవరకు జరిగిందేదిటో పరిశీలిద్దాం. మీ అమ్మా నేనూ మా విద్యుక్తధర్మం నెరవేర్చుకున్నాం. డబ్బూ, శ్రమా లక్ష్యపెట్టకుండా నీకు చదువు చెప్పిచ్చాం. మేం చేసిన ఖర్చు, శ్రమవల్ల నీకేత లాభించిందనేది వేరే విషయం. కాని నాకూ, మీ అమ్మకీ హక్కు వుంది - అదేమిటంటే మేము అవలంబించిన నీతినియమాలనూ నువ్వూ పూర్తిగా అవలంబించాలని ఆశించే హక్కు. ఈ పవిత్రధర్మాన్ని యీ ఆధునిక భావాలు నాశనం చేయకూడదని భావించడానికికూడా మాకు హక్కువుంది. అయితేనేం చివరికి జరిగిందేమిటి? నీ వయసుకి సహజమైన పిచ్చి పిచ్చి వేషాలు గురించి నే మాట్లాడదలుచుకోలేదు. కాని నువ్వింత వొళ్ళుమరిచి...

"నాన్నా! నువు చెప్పదలిచిం దేదిటో నాకు తెలుసు..."

"ఊహుఁ- నే చెప్పదలిచింది నీకేం తెలీదు." అని మునుపటి పార్ల మెంటరీ ఉపన్యాసకుని వైఖరీ, వాగ్ధోరణీ వదిలివేసి హెచ్చుస్థాయిలో హఠాత్తుగా అన్నాడు నికొలాయ్.

"నీకేం తెలీదు."

"నికొలాయ్ ! నా ప్రాణం కొరికేస్తున్నావ్" అని గొణిగింది అన్నా వాసిలెవ్నా.

"అలా అనకు. నీ ప్రాణం కొరికేస్తున్నానా ? నేనేం చెప్ప బోతున్నానో నీవూహించుకోలేవు. ముందుగానే చెబుతున్నా, మహా ఘోర విషయిం వినబోతున్నావు. గుండె నిబ్బరం చేసుకో."

అన్నావాసిలెవ్నాకి మూర్ఛవచ్చినంత పనైంది.

"ఊహుఁ- నే చెప్పబోయేది నీకు తెలీదు." అన్నాడు నికొలాయ్ ఎలీనాకేసి తిరిగి.

"మీయెడ ఘోర అపరాధం చేశాను" అంది ఎలీనా.

"ఆహహ ! చివరికి వొప్పుకున్నావన్నమాట."

"యెన్నడో మీతో చెప్పేయవలసింది. చెప్పకుండా మీ యెడ ఘోర అపరాధం చేశాను."

"వొక్క మాటలో నిన్ను నాశనం చేసేయగలను. తెలుసా ?" అన్నాడు నికొలాయ్.

ఎలీనా తలపైకెత్తి తండ్రికేసి చూసింది.

"అవును. వొక్క మాట. అలా తేరిపారజూస్తే యేం లాభం" చేతులు కట్టుకుని మళ్ళీ అతను అన్నాడు.

"పొవరస్కాయా దగ్గిర - ఆవీధిలో ఆ యిల్లు యెరుగున్నావు కదూ? ఆ యింట్లోకి వెళ్ళేలా ?"

నికొలాయ్ కోపంతో వేలతన్ని "జవాబు చెప్పు, దరిద్రమ్ముండా ! నా దగ్గిర దాచి లాభమేంలేదు. ఛీ ! నువ్వా యింట్లోకి వెడుతూండగా నాకర్లు చూచారు."

ఎలీనా మొహం ఎర్రబారింది. కళ్ళు వెలిగిపోయాయి.

"దాచవలసిన అవసరం నాకేంలేదు. అవును. ఆ యింటికి వెళ్ళా."

"బలే! విన్నావా అన్నావాసిలెవ్నా! అక్కడెవరున్నారో నీకు తెలుసు ననుకుంటా?"

"ఆ - అక్కడ నా భర్త వున్నాడు."

నికోలాయ్ కళ్ళు ఇంతచేసుకుని 'యేమిటీ నీ...' అన్నాడు.

"భర్త! నేను డిమిట్రీ నికనరోవిచ్ ఇన్సరోవ్‌ని పెళ్ళిచేసుకున్నా."

"నువ్వు ... పెళ్ళి చేసుకున్నావా?" అన్నది అన్నావాసిలెవ్నా ఎలాగో.

"అవునమ్మా, క్షమించు. పదిహేనురోజులక్రితం రహస్యంగా పెళ్లి చేసుకున్నాం."

అన్నావాసిలెవ్నా కుర్చీలో కూలబడిపోయింది. నికోలాయ్ రెండడుగులు వెనక్కి వేశాడు. "పెళ్లి చేసుకున్నావా? ఆ దేశదిమ్మరిన్ని, ఆ మడ్డి మృగాన్ని! పూర్వకాలంనించీ పేరు ప్రఖ్యాతులు పొందిన కుటుంబంలో పుట్టిన నికోలాయ్ స్టహోవ్ కూతురు ఓ సామాన్యుణ్ణి, ఓ దేశదిమ్మరిన్ని తలిదండ్రుల అనుమతిలేకుండా పెళ్లిచేసుకోవడమా? నేను నోరుమూసుకుని వూరుకుంటాననుకున్నావా? కోర్టులో ఫిర్యాదు చేయననుకున్నావా? వాడితో...నిన్ను మఠానికి పంపిస్తా. యిక అతన్ని - అతన్ని కఠినశిక్ష పడేటట్లుచేస్తా. అన్నావాసిలెవ్నా! నీఆస్తిపాస్తుల్లో ఒక్కదమ్మిడీ అయినా దీనికి చెందనివ్వనని చెప్పేశాయ్."

"నికోలాయ్ ఆర్టియోమెవిచ్! యిక వూరుకో" అని మూల్గింది అన్నావాసిలెవ్నా.

"పెళ్ళి యెప్పుడుజరిగింది? యెలా జరిగింది? యెవరు చేయించారు? యెక్కడ జరిగింది? అరి దేవుడా? మన స్నేహితులంతా యేమంటారు! ప్రపంచం యేమంటుందో, తెలుసా? సిగ్గూబిడియం లేకుండా యింత ద్రోహంచేసి మా చూరుకింద యెలా వుందామనుకున్నావే? భగవంతుడికి ఆగ్రహంవస్తుందనన్నా భయం వేయడంలా?"

"నాన్నా!" ఎలీనా ప్రారంభించింది. మనిషి నిలువునా వణికిపోయింది. కాని కంఠస్వరంలో మాత్రం వణుకురాలా. "నీ యిష్టంవచ్చినట్లు చెయ్యి. కాని నేనేమో సిగ్గుమాలినపని చేశాననీ, ద్రోహంచేశాననీ మాత్రం అనకు. మిమ్మల్ని కష్టపెట్టాలని నాకేంలేదు. ఒకటి రెండు రోజుల్లో

యిదంతా నేనే చెప్పేశేద్దామనుకున్నా. యెందుకంటే తొందరలో నే నా భర్తతో కలిసి యిక్కడనించి వెళ్ళిపోతున్నా."

"వెళ్ళిపోతున్నావా ? యెక్కడికి ?"

"ఆయన దేశం - బల్గేరియా."

"ఆ టర్కీవాళ్ళ దగ్గరికా ?" అని కేక పెట్టి అన్నా వాసిలెవ్నా మూర్ఛపోయింది.

ఎలీనా తల్లిదగ్గరికి వురికింది.

"ఫో, అవతలికి పో" అన్నాడు, నికొలాయ్ కూతురుచెయ్యి గట్టిగా పట్టుకు ఆపి. "పనికిమాలిందానా ! పో, వెళ్ళిపో"

సరిగ్గా ఆ సమయానికి తలుపుతీసుకుని షూబిన్ తొంగిచూశాడు. అతనిముఖం వాడిపోయిఉంది. కాని కళ్ళుమాత్రం వెలిగిపోతున్నాయి.

"నికొలాయ్ ఆర్టెయోమెవిచ్!" అని కేకేశాడు బిగ్గరగా. "అవగస్టీనా క్రిస్టియనోవ్నా యిక్కడికి వచ్చింది. మీతో మాట్లాడాలంటోంది."

నికొలాయ్ మండిపడుతూ పిడికిలి బిగించి అతన్ని బెదిరించి ఒక్క నిమిషం మెదలకుండా నిలుచుని తర్వాత నెమ్మదిగా బయటికి చక్కాబోయాడు. ఎలీనా తల్లిపాదాలమీద వాలి మోకాళ్లు కావలించుకుంది.

* * *

యువార్ ఇవనోవిచ్ పక్కమీద పడుక్కొనిఉన్నాడు. కాలరు లేని చొక్కా తెరుచుకుని ఉంది. స్త్రీల వక్షంలాంటి అతని వక్షంమీద కొయ్యశిలువ, తాయెత్తుల గుత్తి కనిపిస్తున్నాయి దుప్పటి కప్పుకుని ఉన్నాడు. పక్కదగ్గిరిగా బల్లమీద దీపం మిణుకుమిణుకు మంటోంది. దీపం పక్కన పానపాత్ర ఉంది. పక్కచివర యువార్ దగ్గిరగా విచారంతో కుమిలిపోతూ షూబిన్ కూర్చుని ఉన్నాడు.

"అవును" అన్నాడు షూబిన్ ఆలోచనా పూర్వకంగా.

"పెళ్ళి చేసుకుంది. వెళ్ళిపోవడానికి సన్నాహాలు చేస్తోంది. మీవాడు యిల్లు ఎగిరిపోయ్యేటట్టు కేకలు వేస్తున్నాడు. గోప్యంగా వుండాలని పడక గదిలో తలుపువేసుకూర్చున్నాడుగాని నౌకర్లు, బండీవాడు కూడా ఆయన అన్నదంతా విన్నారు. యింకా కేక లేస్తూనే వున్నాడు. నాతో

చేతులు కలపడందాకా వచ్చింది. పగ తీర్చుకుంటానని మహా బెదిరిస్తున్నాడు గాని చివరికి జరిగేదేమీ వుండదు. అన్నావాసిలెవ్నాకి దిక్కూ మొక్కూ తోచడంలా. పెళ్ళిచేసుకుందనే విషయంకంటె తన్ను విడిచివెళ్ళిపోతుందనే విషయం ఆమెకి ఎక్కువ బాధాకరంగా వుంది."

యువార్ చేతి వ్రేళ్ళు ఆడించి, "అవును. తల్లాయెను. అంటే..."

"మీవాడు ఆర్చిబిషప్పుకి, గవర్నర్ జనరల్‌కి, మంత్రికి ఫిర్యాదు చేస్తానని తెగ బెదిరిస్తున్నాడు. యెన్ని చేసినా చివరికి ఆమె పెళ్ళి తీరుతుంది. కన్నకూతుర్ని నాశనం చెయ్యడం యేపంత మంచి దేవిటి? యిప్పు డెదో మహా కోపంగా వున్నాడుగాని చల్లగా అతనే దిగొస్తాడు."

"వాళ్ళకి అధికారం యేం వుంది." అన్నాడు యువార్ పాన పాత్రలో నించి ఓ గుక్కెడు సారాతాగి.

"నాకు తెలుసు. తెలుసు...కాని మాస్కోలో యీ పెళ్ళిమీద గాలిదుమారం రేగుతుంది. ఆమె అందుకేం భయపట్టంలేదు. యేమైనా ఆమె వీటన్నిటికీ అతీతురాలు. వెళ్ళిపోతుంది. యెక్కడికనుకుంటున్నావ్ .. ఆవిషయం ఆలోచించడమే మహాదారుణంగా వుంటుంది. యెంతోదూరం వెళ్ళిపోతోంది. అక్కడికిచేరుకున్నాక ఆమె పరిస్థితి యెలావుంటుందో తెలుసా? మంచుతుఫానులో యెదో హోటల్నించి అర్ధరాత్రి బయలుదేరి వెడుతున్నట్టు ఆలోచించినకొద్దీ నా కళ్లకు కడుతోంది. జన్మభూమినీ, కుటుంబాన్నీ విడిచివెళ్ళిపోతోంది. విషయం అర్ధంచేసుకోగల. యెవరిని వదలి వెడుతోంది? ఆమెని నిత్యం యెవరు కలుసుకుంటున్నారు? కర్నటోవస్కీ వంటివారిని, బెర్సెనీవ్‌వంటివారిని, నీవంటివారిని, నావంటివారిని వదిలి వెడుతోంది. అందరిలోకీ మనమే ఉత్తములం. వెళ్ళిపోయిన తర్వాత యేవని వస్తాయిస్తుంది? కాని వొక్కవిషయం మట్టుకు మహాఘోరం. ఆమెభర్త-ఆరిదేవుడా? ఆమాట నా గొంతులో యెలా అడ్డుపడుతోందో! ఇన్సరోవ్ నెత్తురు కక్కుతున్నాడు. అదే మహాఘోరమైన విషయం. మొన్న చూసాను. అతనిముఖం చూస్తూ *బ్రూటస్ విగ్రహం నుంచున్నపాటున తయారు చెయ్యచ్చు...యింతకీ బ్రూటస్ యెవరో నీకు తెలుసా!

* బ్రూటస్ : (బి. సి. 85—42) జూలియస్ సీజరును చంపిన హంతక బృందానికి నాయకుడు.

యువార్: "యెవరో వాడి సంగతి నాకు తెలియాలని యెక్కడుంది."

"సరిగ్గా అంతే! యితనూ మనిషంటే! మహా మంచి మొహం కాని జబ్బులో కృశించిపోయింది, కృశించిపోయింది."

"యేమైతేనేం...రోగంతో పోట్లాడడానికి"

"నిజం! యేమైతేనేం రోగంతో పోట్లాడడానికి యెంత చక్కగా చెప్పావ్! కాని కాపరంచేయడం యెలా?...అతనితో కాస్త కులాసాగా ఆమె గడిపాలిగదా?"

"అవును. యవ్వనం" అన్నాడు యువార్.

"అవును. యవ్వనం, ఆనందం, సాహసం, జీవన్మరణాలు, పోరాటం, జయాపజయాలు, ప్రేమ, స్వేచ్ఛ, మాతృభూమి! బలే! బలే! భగవంతుడు అందరికీ యిది ప్రసాదిస్తాడుగాక! బురదలో గొంతుదాకా దిగి లక్ష్యంమేం లేకపోయినా వుదాసీనవైఖరి తాల్చడంగాదు, ప్రపంచాని కంతటికీ మార్గదర్శకులు కావడమో, నశించిపోవడమో వారి ఆశయం."

షూబిన్ తల వక్షంమీద పెట్టుకుని తిరిగి ప్రారంభించాడు, చాలా సేపు మౌనంవహించి.

"అవును. ఇన్సరోవ్ ఆమెకి తగినవాడు. కాని ఊహుఁ - ఆమెకి యెవరూ తగినవారులేరు. ఇన్సరోవ్...ఇన్సరోవ్...యెందుకీ కపటవినయం! అతనికి ధైర్యసాహసాలున్నాయి. తనకాళ్ళమీద నిలబడగలడు. కాని మనకంటె అతనేం ఘనకార్యం సాధించాడు చెప్పు? మనమెందుకూ పనికి రానివాళ్ళమా? నేనూ పనికిమాలినవాణ్ణేనా? యువార్! భగవంతుడికి నామీద కాసంతైనా దయలేదూ? నాకు శక్తిసామర్థ్యాలివ్వలా? భవిష్యత్తులో పావెల్ షూబిన్ పేరు దేశదేశాలా మోగుతుందేమో, యెవరు చెప్పగలరు? బల్లమీది ఆ అరపెన్నీ నాణెంకేసిచూడు. బహుశా వో వంద సంవత్సరాల తర్వాత కృతజ్ఞతాపూర్వకంగా భావిసంతతి పావెల్ షూబిన్ గౌరవార్థం నిర్మించే విగ్రహం చేయడానికి యీ నాణెం వుపయోగపడుతుందేమో యెవరు చెప్పగలరు?"

"మోచేతిమీద ఆనుకుని ఉద్రేకంతో వణుకుతున్న శిల్పికేసి యువార్ ఇవనోవిచ్ తేరిపారజూచి 'యింకా యెంతో కాలానికిగా' అన్నాడు, వేళ్ళు ఆడిస్తూ. 'మనం యితర్ల విషయం ప్రస్తావించుకుంటున్నాం. కాని నువ్వు నీ స్వవిషయం మాట్లాట్టం ప్రారంభించావ్."

"ఓ రష్యన్ మహా వేదాంతీ! నువ్వన్న ప్రతిముక్కా అక్షరలక్షలు చేస్తుంది. నాక్కాదు విగ్రహం స్థాపించేది, నీకూ. ఆ విగ్రహం నేనే తయారుచేస్తా. యిలా పడుకున్నట్టు, యిదే భంగిమలో—నీలో శక్తి యెక్కువ వుందా, సోమరితనం యెక్కువ వుందా అని తెలుసుకోలేనట్టుగా విగ్రహం తయారుచేస్తా. నాలోని అహాన్ని, గర్వాన్ని యెంత బాగా దెబ్బకొట్టావ్! నీ మాట సరైంది. సరైంది. స్వవిషయమై డబ్బాకొట్టుకోటం మంచిదికాదు. యెంతవెదకినా మన మధ్యసిసలైన మనుషులంటూ లేరు. వున్నవాళ్లంతా వట్టి చేపల్లాంటివాళ్ళు, యెలకల్లాంటివాళ్లు, *హామ్లెట్ లాంటివాళ్ళు. అజ్ఞానం మీద ఆధారపడి బతుకుతున్నవాళ్ళు. కాలమంతా వృధాపుచ్చుతూ యితర్లమీద భారంగాపడుండే స్వంత డబ్బావాయిద్యగాళ్ళు. యింకోరకం వాళ్ళున్నారు. మహా వివరంగా చదివి అనుభవించే ప్రతి భావోద్రేకానికీ లోనవుతూ "యిలా అనుభవించా, యిలా అనుకుంటున్నా" అని చెప్పుకునేవాళ్ళు. యిలాంటి చేష్ట యేం లాభకరమైంది? యేం అర్ధవంతమైంది. మనమధ్య నేగనక నిజంగా సిసలైన మనుషులే వుంటే ఆ అమ్మాయి, యింత జ్ఞానంగల ఆ అమ్మాయి మనల్ని విడిచివెళ్లేదే కాదనుకో, నీళ్ళలోకి చేపలా వురికేదే కాదనుకో! యేంటిది యువార్! మనకి మంచి రోజులు యెప్పుడువస్తాయి. సిసలైన మనుషుల్ని యెప్పుడు తయారు చేయగల్గుతాం చెప్పు?"

"కాస్త ఆగు వాళ్లే పుట్టుకొస్తారు." అన్నాడు యువార్ ఇవనోవిచ్.

"వస్తారు. సుక్షేత్రాధిపతి పలుకుతున్నాడు! యమధర్మరాజు అంటున్నాడు 'వస్తాడు' అని! చూడు నువు చెప్పిందంతా రాసివుంచుతా. కొవ్వొత్తి ఆర్పేస్తున్నావేం?"

"నిద్రపోవాలి. శెలవు."



* హామ్లెట్ : షేక్స్పియర్ నాటకం హామ్లెట్ లో కథానాయకుడు హామ్లెట్. ఒక నిర్ధారణకు రాలేక పనిలో తాత్సారం చెయటం అతని లక్షణం. అటువంటివాడిని 'హామ్లెట్' అనడం పరిపాటి అయిపోయింది.

# ౩౧

షూబిన్ అన్నంతపనీ జరిగింది. తలవనితలంపుగా ఎలీనా ఇలా పెళ్ళిచేసుకోవడంవల్ల అన్నావాసిలెవ్నాకి ప్రాణంమీదికివచ్చి మంచంపట్టింది. ఎలీనాను చూట్టానికి రానీయవద్దని నికొలాయ్ పట్టుపట్టాడు. తన గృహ యజమానిత్వం, కుటుంబంపై పెత్తనం ప్రదర్శించడానికి అవకాశం చిక్కినందుకు సంతోషించాడు. అనవరతమూ సేవకులమీదమండిపడుతూ మాటి మాటికీ ‘నేనెవర్నో తెలుసుకొనేటట్లు చేస్తా. కాస్త ఆగండి. నాతడాఖా చూపిస్తా” అనసాగాడు. నికొలాయ్ ఇంటిదగ్గిర ఉన్నపుడు అన్నావాసిలెవ్నా ఎలీనాను తన్ను చూట్టానికి రానివ్వకుండా జోయాతోనే కాలక్షేపంచేస్తూ సంతృప్తిపడేది. ఆ జర్మన్ బాలిక (జోయా) శ్రద్ధాభక్తులతో అన్నాకు పరిచర్యలుచేస్తూ ‘అతన్ని పెళ్ళాడకుండా ఇన్సరోవ్‌ని పెళ్ళాడమేమిటి ?’ అనుకునేది. కాని నికొలాయ్ బయటికి వెళ్ళిపోగానే – అవగస్తీనా క్రిస్టియనోవ్నా తిరిగిరావడంతో ఈ వెళ్ళడం తరుచు జరుగుతోంది– ఎలీనా తల్లి పడకగదిలోకి వెళ్ళేది. అన్నావాసిలెవ్నా కన్నీరుకారుస్తూ మాట్లాడకుండా కూతురికేసి తదేకదృష్టితో చూసేది. పల్లెత్తుమాటైనా అనకుండా మౌనంగా అధిక్షేపించడం ఎలీనాకు మహాబాధకలిగించింది. ఆ సమయంలో ఎలీనా పశ్చాత్తాపం చెందలేదు. కాని పశ్చాత్తాపానికి సన్నిహితమైన జాలి విపరీతంగా ఆమె నావరించేది.

“అమ్మా !” తల్లిచేతులు ముద్దిడుకుంటూ ఎలీనా అంది: “నేనేం చెయ్యను ? నేనేం తప్పుచేశాను ? అతన్ని ప్రేమించాను. ఇంకోవిధంగా చెయ్యలేకపోయాను. విధిని నిందించాలి. అంతే. నాన్నకి యిష్టంలేని పురుషుడినీ, మీ దగ్గిరనుంచి నన్ను తీసుకుపోయే పురుషుడినీ నన్నూ విధి ఒకచోటికి చేర్చింది. విధి !”

"అబ్బా! నా కథంతా జ్ఞాపకం చెయ్యకు" అని అడ్డంవచ్చి అన్నా వాసిలెవ్నా అంది. "మీరు ఎక్కడికి వెళ్ళదలిచిందీ తల్చుకున్నపుడల్లా నా హృదయం ముక్కలు ముక్కలు అయిపోతుందా అనిపిస్తోంది."

"అమ్మా! యింతకంటె అధ్వాన్నపరిస్థితి రాలేదని సంతృప్తిపడు. నేను చచ్చిపోయివుంటే..."

"యిప్పుడుమట్టుకు యేమిటి? మళ్ళీనిను చూస్తానని అనుకుంటున్నా ననుకున్నావా? అక్కడ యే డేరాలోనో నువు చచ్చిపోతావు!"— బల్గేరియా ఓ విధమైన సైబీరియా మైదానాలని మనసులో అన్నా చిత్రించు కుంది. "లేకపోతే నిన్నువిడిచి వుండలేక నేనే..."

"ఆ మాట అనకు అమ్మా! దేవుడు రక్షిస్తే తిరిగీ మనం కలుసు కుంటాం. యిక్కడవున్నట్టే బల్గేరియాలోకూడా పట్టణాలున్నాయి."

"పట్టణాలా? యిప్పుడు అక్కడ యుద్ధం జరుగుతోంది. ఆ దేశంలో యెక్కడికివెళ్ళినా ఫిరంగులు పేలిపోతూవుంటాయి...తొందర్లోనే వెళ్ళి పోవాలనుకుంటున్నారా?"

"ఆ...నాన్నకనక ... ఫిర్యాదుచేద్దామని చూస్తున్నాడుగా ... విడాకు లిప్పిస్తానని బెదిరిస్తున్నాడు."

అన్నావాసిలేవ్నా ఆకాశంకేసి కళ్ళెత్తిచూసింది. "ఊహుం— లెనోచ్కా! ఫిర్యాదు చెయ్యళ్ళే. యీ పెళ్ళికి నేనైతే వొప్పుకునేదాన్ని కాను. తప్పనిసరైతే చచ్చిపోయేదాన్ని. కాని అయిందేదిటో అయిపోయింది, యిక చేసేదేం లేదు. నా కూతుర్ని అవమానంపాలు కానిస్తానా?"

ఈ విధంగా చాలారోజులు గడిచిపోయినాయి. ఒకరోజు సాయంత్రం అన్నావాసిలెవ్నా మనసు దిటవుచేసుకుని భర్తతో ఏకాం తంగా పడకగదిలో మాట్లాడింది. ఇంట్లోవారంతా నిశ్శబ్దంగా ఎంతో ఆసక్తితో వినసాగారు. మొట్టమొదట ఒక్కముక్కయినా వినపడలా. తర్వాత నికొలాయ్ గొణగడం విన్పించింది. ఏదో చర్చ ప్రారంభమైంది. ఏడ్పు, మూలుగుసైతం వినిపించింది. జోయాదగ్గరా, దాసీలదగ్గరా నిల్చున్న షూబిన్ గొడవ చల్లార్చడానికి వెళ్ళేందుకు సంసిద్ధ దవుతుండగా పడకగదిలో గల్లంతు క్రమంగా తగ్గి మామూలు సంభాషణగా మారి, సమసి పోయింది. అపుడపుడు ఓ నిట్టూర్పు, వినిపించి చివరికి అణిగిపోయింది,

తాళపుగుత్తుల చప్పుడు వినపడింది. తర్వాత బీరువాతీసిన చప్పుడు ... తలుపుతీసుకుని నికొలాయ్ బయటికి వచ్చాడు. కనిపించినవారందరికేసీ తీక్షణంగాచూసి క్లబ్బుకి వెళ్లిపోయాడు అన్నావాసిలెవ్నా కూతుర్ని పిలిపించింది. పిచ్చిగా ఏడుస్తూ అతిప్రేమతో కౌగిలించుకొని అంది: "అంతా తీర్మానమైపోయింది. యిక మీ నాన్నేం గొడవపెట్టడు. మమ్మల్ని వదిలిపెట్టి వెళ్లిపోవడానికి యిక నీ కేం అడ్డంకుల్లేవు."

"డిమిట్రీ వచ్చి నీకు కృతజ్ఞత తెలపవచ్చా?" అని అన్నావాసిలెవ్నా కొంచెం శాంతిపడగానే ఎలీనా అడిగింది.

"మనల్ని విడదీసిన అతన్ని చూసి తట్టుకునేస్థితిలోలేను ... మీరు వెళ్ళేముందు చూద్దాం."

"మీరు వెళ్ళేముందు" అని అన్నది ఎలీనా విచారంతో.

నికొలాయ్ గొడవచెయ్యకుండా ఉంటానికి అంగీకరించాడు. అతను అంగీకరించడానికి యెంతత్యాగం తాను చెయ్యవలసివచ్చిందో అన్నావాసిలెవ్నా కూతురికి చెప్పలేదు. నికొలాయ్కున్న అప్పులన్నీ తీర్చడానికి ఒప్పుకుని, ఆ క్షణంలో వెయ్యిరూబుల్లు ఇచ్చినట్లు అన్నా కూతురితో చెప్పలేదు. ఇన్సరోవ్ని మడ్డిమృగమని వర్ణిస్తూ అతన్ని చూడనని నికొలాయ్ ఖండితంగా చెప్పేశాడు. కాని క్లబ్బులో పేకాడుతూ తనతో ఆడే ఓ పించను పుచ్చుకున్న ఇంజనీరు జనరల్తో 'మా అమ్మాయిసంగతి విన్నారా?' అన్నాడు ఉదాసీనవైఖరి తాలుస్తూ 'చదువు తలకెక్కి ఆ మట్న వెళ్లి యెవడో విద్యార్థిని పెళ్లిచేసుకుంది.' ఆ జనరల్ కళ్ళజోడులోంచి అతనికేసి చూసి 'హు' అని గొణిగి "యేం ముక్క వేశావు?" అని అడిగాడు.

# 3౨

ప్రయాణమై వెళ్లవలసిన రోజు సమీపించింది. నవంబరు నెల ఆఖరై పోయింది. ఇక ముందు ప్రయాణం చేయడం సాధ్యం కాని పని. ఇన్సరోవ్ ప్రయాణ సన్నాహాలు పూర్తిచేసుకుని సాధ్యమైనంత త్వరలో మాస్కోనుంచి బైట పడాలని ఆదుర్దాగా ఉన్నాడు. డాక్టరుకూడా త్వరగా పొమ్మని నొక్కి చెబుతూ అన్నాడు: "ఉష్ణ వాతావరణం నీకు కావాలి. యిక్కడ నీ రోగం నిమ్మళించదు." ఎలీనాకూడా ఎప్పుడు వెళ్లిపోదామా అనే తొందర్లోనే ఉంది. ఇన్సరోవ్ శరీరం పాలిపోవడం, బరువుతగ్గడం ఎలీనాకి భయోత్పాతం కలిగించాయి... మారిపోయిన ఇన్సరోవ్ ఆకృతిచూసి తరుచు గడగడా వణికిపోయేది. ఇంటిదగ్గిర ఆమె పరిస్థితి అధ్వానంగా తయారైంది. ఎలీనా ఇక చచ్చిపోయినదానిలానే భావించుకొని ఆమె తల్లి ఏడ్వడం మొదలుపెట్టింది. ఇక తండ్రి అసహ్యభావంతో ఎలినాను చూడసాగాడు. కాని కూతుర్ని విడిచిపెట్టి ఉండడమంటే అతనికీ బాధాకరంగానే ఉంది. అయితేనేం తన భావాలను, హృదయ దౌర్బల్యాన్ని మరుగుపర్చడం తన విద్యుక్తధర్మమని, కోపగించిన తండ్రి విద్యుక్తధర్మమని తలచాడు.

ఎలాగైతేనేం ఇన్సరోవ్‌ని చూడడానికి అన్నావాసిలెవ్నా అంగీకరించింది. దొడ్డిదోవన రహస్యంగా ఇన్సరోవ్‌ని తీసుకవచ్చారు. ఇన్సరోవ్ గదిలోకివచ్చిన తర్వాత చాలాసేపటివరకు అన్నా అతనితో మాట్లాడలేకపోయింది. అన్నావాసిలెవ్నా పడుకున్న పడకకుర్చీ పక్కగా, ఇన్సరోవ్ ఆమె పలకరిస్తుందేమోనని నిశ్శబ్దంగా కూర్చున్నాడు. తల్లి చెయ్యి పట్టుకుని ఎలీనాకూడా వారి పక్కనే కూర్చుంది. కొంతసేపయాక

అన్నావాసిలెవ్నా తల పైకెత్తి "భగవంతుడే తీర్పుయిస్తాడు. డిమిట్రీ నికొనరోవిచ్ !" అని ఆగిపోయింది. అధిక్షేపణ ఆమె పెదవులమీదనే సమసిపోయింది.

"కాని నీకు జబ్బుగావున్నట్టుంది? ఎలీనా! నీ భర్తకి జబ్బుగా వుంది?" అంది.

"నాకు వంటో యేం బావుండంలేదు అన్నావాసిలెవ్నా! యింకా కోలుకోలేదు. మా దేశపుగాలికి నా ఆరోగ్యం కుదటపడుతుందని ఆశిస్తున్నా" అని జవాబిచ్చాడు ఇన్సరోవ్.

"అవును...బల్గేరియా!" అని గొణిగి అన్నావాసిలెవ్నా అనుకుంది: "ఆరిదేముడా! బల్గేరియను. చావుకు సిద్ధంగావున్నాడు. నూతిలోంచి ఆరుస్తున్నట్టుంది మాట. కళ్లు గుంటలుపడ్డాయి. తోలుముక్కలా పచ్చగా వున్నాడు. యెవరిచొక్కాలో అమర్చినట్టున్న ఎముకలగూడు...యితనికి ఎలీనా భార్య! యితన్ని ప్రేమిస్తోందా? ఓ—యిదేదో దుస్స్వప్నంలా వుంది." కాని తమాయించుకుని "డిమిట్రీ! మీరు వెళ్లడం ... వెళ్లడం తప్పదా?" అని అడిగింది.

"అవును తప్పదు."

అన్నావాసిలెవ్నా అతనికేసి చూసి "డిమిట్రీ! నే నిపుడు పడుతున్నంతబాధను జన్మలో నువు అనుభవించి వుండవు...దీన్ని జాగ్రత్తగా కాపాడుతూ ప్రేమిస్తు వుంటానని వాగ్దానం చెయ్యి. నేను బతికివుండగా మీకేం కొరతా వుండదు..."

కన్నీరు ఆమె మాటల్ని ముంచేసింది. చేతులుచాచి ఇన్సరోవ్‌ని, ఎలీనాను ఒకేసారి కావలించుకుంది.

♦ ♦ ♦ ♦ ♦

"ఎలాగైతేనేం ప్రయాణమయే రోజు వచ్చింది. ఎలీనా ఇంటిదగ్గరే తలిదండ్రులదగ్గిర శెలవు తీసుకుని ఇన్సరోవ్‌గదికి వచ్చి అక్కడనించి పన్నెండుగంటలకు బయలుదేరి వెళ్లాలని నిర్ణయించుకున్నారు. పావుగంట ముందుగానే బెర్సెనీవ్ వచ్చాడు. అక్కడ ఇన్సరోవ్ దేశస్తులు వీడ్కోలు ఇవ్వడానికి వచ్చి ఉంటారని ఆశించాడు కాని వారంతా అతనికంటెముందే వచ్చి వెళ్ళిపోయాడు. పాఠకులకు సుపరిచుతులైన ఆ యిద్దరు బల్గేరియన్లు-

వీరు ఇన్సరోవ్ పెళ్లికి సాక్షులుగా ఉన్నారు కూడా - వచ్చి వెళ్లిపోయారు. ఇంటియజమాని_ఆదర్శ్ బెర్సనీవ్‌కి తలవంచినమస్కరించి స్వాగతం చెప్పాడు.

అతను తప్పతాగున్నాడు. విచారంతోనూ కావచ్చు, ఇన్సరోవ్ సామానంతా తనకు దక్కిందనే సంతోషంతోను కావచ్చు. గదంతా శుభ్రంగా ఉంది. పెట్టె తాళ్ళతో బిగించి ఉంది బెర్సనీవ్‌కి విచారం వేసింది. అనేక స్మృతి పరంపరలు అతని హృదయంలో ప్రవహించాయి.

పన్నెండుగంటలు దాటింది. బండివాడు బండీతెచ్చి గుమ్మంలో పెట్టాడు. కాని ఎవరూరాలేదు. కొంతసేపటికి మేడమెట్లమీద తొందరగా నడుస్తున్న అడుగులచప్పిడి అయింది. ఇన్సరోవ్, షూబిన్‌లు అనుసరించి రాగా ఎలీనా గదిలోకి వచ్చింది. ఎలీనాకళ్లు ఎర్రబారున్నాయి. తల్లిదండ్రులను వదలిరావడం ఆమెకి చాలా బాధకలిగించింది. మూర్ఛపోయిన తల్లిని వదిలివచ్చింది.... బెర్సనీవ్ ఆమెను చూసి అప్పటికి మూడువారాలైంది. ఈ మధ్య బెర్సనీవ్ స్టహోవ్ ఇంటికి వెళ్లడంలేదు. అందుకని అతనుఇక్కడకి వస్తాడని ఎలీనా అనుకోలేదు.

"నువ్వా" అంది బెర్సనీవ్‌ని కావిలించుకుంటానికి పరుగెత్తుకు వెడుతూ. ఇన్సరోవ్ కూడా అతన్ని కావలించుకున్నాడు.

తర్వాత నిశ్శబ్దం. ముగ్గురు ఒకరితో ఒకరు ఏం మాట్లాడుకోగలరు? వారి హృదయాలు యే భావాలతో నిండున్నాయి? భారంగా ఉన్న నిశ్శబ్దతను భేదించడానికి ఏదైనా శబ్దం వెలువడితే బాగుండు ననుకున్నాడు షూబిన్.

"బలే! త్రిమూర్తులం ఆఖరిసారి కలుసుకున్నాం. విధికి తలవంచి గీతాన్ని సహృదయంతో జ్ఞప్తిలో వుంచుకోవాలి. భగవంతుని దయవల్ల నూతన జీవితం ప్రారంభిద్దాం."

"పదండిముందుకు" అనిషూబిన్ పాడాడు. కాని హఠాత్తుగాఎబ్బెట్టా సిగ్గాపడ్డాడు. చచ్చిపోయినవాడిముందు పాడడం అపరాధం అనిపించింది. ఆ సమయంలో ఆ గదిలో, గత జీవితం, తను మాటాడుతున్న గత జీవితం, అక్కడ చేరినవారందరి జీవితం మరణిస్తోంది. నూతన జీవితాన్ని ప్రసవించడానికి గత జీవితం మరణించవచ్చు. కాని ఎలాగైనా మరణిస్తోంది.

"ఎలీనా! యివ్వవలసిన వారందరికీ యిచ్చేశాం. సర్దటమంతా అయిపోయింది. యిక ఆ పెట్టె కిందికి దింపడమే తరువాయి. కామందూ!"

ఇంటి యజమాని పెళ్ళాం, కూతురుతో వచ్చాడు. అటు ఇటు కొంచెం ఊగుతూ ఇన్సరోవ్ చెప్పిందంతా విని పెట్టె బుజానికెత్తుకుని కిందికి దిగి వెళ్లిపోయాడు.

"ఇక రష్యన్ ఆచారం ప్రకారం మనమంతా కూచోవాలి" అన్నాడు ఇన్సరోవ్.

అందరూ కూర్చున్నారు. ఎలీనా పక్కన పాత సోఫా మీద బెర్సెనీవ్ కూర్చున్నాడు. ఇంటి యజమాని పెళ్లాం కూతురూ గుమ్మంలో నక్కి నుంచున్నారు. ఎవరూ మాట్లాడలేదు, ఎబ్బెట్టుగా అంతా చిరునవ్వు నవ్వారు. కాని ఎందుకు నవ్వుతున్నారో ఎవరికీ తెలియదు. ఆ సమయానికి తగినట్లు వీడ్కోలు మాటలు నాలుగు మాట్లాడాలని అందరికీ ఉద్దేశం కలిగేది కాని అటువంటి సమయంలో ఏదో పిచ్చా పాటాయేకాని అంతకుమించి ఆవేశం కలిగించే మాటలు అప్పుడు మాట్లాడడం కాపట్యం అనిపించింది. ఇన్సరోవ్ లేచి 'శెలవు' అన్నాడు ఆ గదిని సంబోధిస్తూ.

అంతా ఒకరినొకరు ముద్దిడుకున్నారు. కాని ఆ ముద్దిడుకోవడంలో ధ్వనేకాని సంతోషంలేదు. క్షేమంగా ప్రయాణం సాగాలనే శుభాకాంక్షలు ఉత్తరాలు రాసుకోవాలని వాగ్దానాలు, వీడ్కోలు పలుకులు చెలరేగాయి.

ఎలీనా బండిలో కూర్చుంది. కన్నీరు కాల్వలు గట్టాయి. ఇన్సరోవ్ ఆప్యాయంగా ఆమె కాళ్లమీద రగ్గు కప్పుతున్నాడు. షూబిన్, బెర్సనీవ్, ఇంటి యజమానీ, అతని పెళ్ళాం, పిల్ల, ఇంకో కార్మికుడూ మెట్లదగ్గిర నిల్చుని ఉన్నారు. హఠాత్తుగా ఓ చిన్న గుర్రబ్బండీ వచ్చి ఆగింది. కోటు కాలరుమీది మంచు విదుల్చుకుంటూ నికొలాయ్ బండిలోనుంచి ఉరికాడు.

"సరిగ్గా సమయానికే వచ్చాను." అంటాడో బండిదగ్గిరికి పరుగెత్తుకువెళ్లి "ఇదిగో ఎలీనా! ఇదిగో మా ఆఖరి ఆశీర్వచనం" అంటూ జేబులోంచి ఓ సంచి తీసాడు. ఆ సంచిలో దేవతావిగ్రహం ఉంది. ఆ సంచి మెడలోవేస్తుంటే ఎలీనా నిట్టూర్చి తండ్రిచెయ్యి ముద్దిడుకుంది .... ఈ

లోపున బండివాడు చాంపెయిన్ బుడ్డీ, మూడు గ్లాసులూ బండిలోంచి తెచ్చి యిచ్చాడు.

"యిక" అన్నాడు నికొలాయ్. కన్నీరు అతని కోటు కాలరుమీద పడింది. "యిక మిమ్మల్ని...." చాంపెయిన్ గ్లాసుల్లో పోశాడు. చెయ్యి వణికింది. గ్లాసులోనుండి నురుగు కిందపడింది. తానో గ్లాసుతీసుకుని, ఒకటి ఎలీనాకు ఒకటిఇన్నరోవ్‌కిఇచ్చాడు. "భగవంతుడుమీకు..."అని ప్రారంభించాడు కాని పూర్తిచెయ్యలేకపోయాడు. చాంపెయిన్ తాగాడు. ఎలీనా, ఇన్నరోవ్‌లుకూడా తాగారు. తర్వాత షూబిన్, బెర్సెనీవ్‌లకేసి తిరిగి నికొలాయ్ "మీరుకూడా తాగాలి." అన్నాడు. కాని ఇంతలో బండి కదిలింది. నికొలాయ్ బండివెంట పరిగెత్తి "తప్పకుండా ఉత్తరం రాయి" అన్నాడు గద్గదిక స్వరంతో. ఎలీనా బండిలోంచి మొహం బైటపెట్టి "నాన్నా! శెలవు! ఆంద్రీపెట్రోవిచ్ శెలవు! పావెల్ యాకలోవిచ్ శెలవు! రష్యా శెలవు!" అని బండిలోపలికి వెళ్లింది. బండివాడు చరనా కోల ఝళిపించి ఈలవేశాడు. గడ్డకట్టినమంచును నలగదొక్కుకుంటూ బండి గేటుదాటి కుడిచేతివేపుకు తిరిగి అదృశ్యమైంది.

## 33

ఏప్రియల్ నెల. సూర్యుడు వెలిగిపోతున్నాడు. వెనీస్ పట్టణాన్ని ఇసుక తిన్నెనించి వేరు చేసే విశాలమైన సరోవరం మీద ఒక చిన్న పడవ తెడ్డువేతతో మృదుమధుర స్వనం చేసుకుంటూ మెల్లిగా సాగిపోతోంది. లోపల మెత్తటి తోలు సోఫాలమీద ఇన్సరోవ్ ఎలీనాలు కూర్చున్నారు.

మాస్కో విడిచి వచ్చిం తర్వాత ఎలీనా ఆకారంలో పెద్ద మార్పేం రాలేదు. కాని ముఖ కవళికమాత్రం మారిపోయింది. ఆమె మొహంలో కాఠిన్యం, ఆలోచనా, కళ్ళల్లో ధైర్య స్థయిర్యాలూ ప్రస్ఫుట మవుతున్నాయి. శరీరమంతా వికసించింది. జుట్టు బాగా ఒత్తుగా పెరిగింది. నోటి కిరువైపులా కనిపించీ కనిపించని రేఖలు, మందహాసం అణిగిపోయిం తర్వాత, రహస్యంగా నిరంతరమూ ఆమె పడుతున్న ఆదుర్దాను సూచిస్తున్నాయి. ఇన్సరోవ్ ముఖకవళిక మాత్రం యథాతథంగానేఉంది. ఆకృతి మాత్రం పూర్తిగా మారిపోయింది. చిక్కిపోయాడు. పాలిపోయాడు. అసలు వయసుకంటె ఎక్కువ వయసున్నవాడిలా కన్పించాడు. నడుం వంగిపోయింది. ఎడతెరిపి లేకుండా ఖంగున దగ్గుతున్నాడు. దించుకుపోయిన కన్నులు విచిత్రంగా ప్రకాశిస్తున్నాయి. రష్యానించి వస్తూ మార్గములో రెండు నెలల పాటు వియన్నాలో పడక వేయవలసి వచ్చింది. మార్చి ఆఖరికి వారు వియన్నా చేరుకున్నారు. ఇతర మార్గాలన్నీబందు అయిపోవడంవల్ల జాగా మీదుగా సెర్బియా వెళ్ళి అక్కడనించి బల్లేరియా వెళ్లాలని ఇన్సరోవ్ ఆలోచిస్తున్నాడు. డాన్యూబ్ నదీతీరంమీద యుద్ధం ప్రజరిల్లుతోంది. ఫ్రాన్సు, ఇంగ్లండులు, రష్యామీద యుద్ధం ప్రకటిం

చాయి. స్లావ్ దేశాలన్నీ ఉడికిపోయి తిరుగుబాటుచేయడానికి సన్నద్ధమవుతున్నాయి.

పడవ ఇసుకతిన్నెల ఇవతలి ఒడ్డు చేరింది. ఎలీనా, ఇన్సరోవ్ లు ఎండిపోయిన దుబ్బులమధ్యగావున్న ఇరుగుకుదారివెంట నడిచి అవతలవైపు-సముద్రమువైపు-చేరుకున్నారు.

సముద్రంతీరంవెంట ఇద్దరూ షికారుచేశారు. కారుఊదారంగు ఆడ్రియాటిక్ సముద్రం వారిపక్కగా ప్రవహిస్తూంది. కెరటాలు నురుగులు గక్కుతూ, బుసకొడుతూ నత్తగుల్లల్నీ నాచునీ ఒడ్డున పడవేస్తున్నాయి.

"అబ్బ! యెంత భయంకర దృశ్యం! యిక్కడ చలికి నువు తట్టుకోలేవు. అయినా నువ్వు యిక్కడకి యెందుకువచ్చావో నే నూహించుకోగలు" అన్నది ఎలీనా. "చలి!" అని ఇన్సరోవ్ చిరునవ్వు నవ్వి అన్నాడు: "యీ చలిని పారదోలితే నేను మంచి సిపాయిని కాగల్గుతా. నేనిక్కడికి యెందుకువచ్చానో చెప్తా విను. ఈ సముద్రాన్ని చూస్తుంటే నా మాతృదేశానికి సమీపంలో వున్నట్టు నాకు అనిపిస్తుంది. అదిగో!" తూర్పుదిశకేసి చేతితో చూపుతూ "అదిగో! ఆ గాలి వీస్తున్నదిశనే మా మాతృదేశం వుంది." అన్నాడు.

"నువ్వు వస్తుందని కాచుకున్న వోడ యీ గాలి వాటుకి వస్తుందా? అదిగో! తెల్లటి తెరచాప. అదేనా ఆ పడవ?" అని అడిగింది ఎలీనా.

ఆమె చెయ్యి చాపి చూపినదిక్కే ఇన్సరోవ్ చూచాడు.

"వారం రోజుల్లోగా అన్ని ఏర్పాట్లూ చేస్తానని రెన్ డిచ్ మాట యిచ్చాడు . . . అతనిమాట నమ్మొచ్చనే అనుకుంటూ . . . ఎలీనా!" హఠాత్తుగా అమితోత్సాహంతో అన్నాడు. "*డాలమేటియన్ పల్లెవాళ్లు బహు బీదవాళ్లు. అయినా వాళ్లు తమ వలలకు కట్టే ఇనుపగుళ్లు యేం చేశారో విన్నావా? తుపాకీ గుళ్లు తయారు చేయడానికి యిచ్చేశారు. వాళ్ళ దగ్గిర దమ్మిడీలేదు. యేదో చేపలుపట్టుకొని జీవనం వెళ్ళబోస్తున్నారు. అయినా తమ సర్వస్వం అర్పించేసి యిప్పుడు ఆకలితో మాడుతున్నారు. వాళ్లూ ఆదర్శ మానవులంటే!"

---

* డాలమేటియన్ : ఆడ్రియాటిక్ సముద్రతీరంమీద యుగోస్లేవియాలో ఒకజిల్లా డాలమేటియా. అచ్చటివారు డాలమేటియన్ లు.

"అదిగో చూడు!" అని వెనకగా పొగరమోతు కంఠస్వరం అరిచింది. గుర్రపు గిట్ల చప్పుడు విన్పించింది. ఓ ఆస్ట్రియన్ అధికారి బూడిద రంగు పొట్టి చొక్కా, ఆకుపచ్చని టోపీ పెట్టుకొని వారిపక్కగా గబగబా గుర్రంమీద స్వారీ చేస్తూ వెళ్లాడు. ఇన్సరోవ్ ఎలీనాలు ఎలాగో దారి నుంచి తప్పుకున్నారు. ఇన్సరోవ్ అతనికేసి చురచురా చూశాడు.

"అతనిదేం తప్పులేదు. యిక్కడ తప్పితే యింకెక్కడ గుర్రాలెక్కి తిరగ్గలుగుతాడు." అంది ఎలీనా.

"అవును. అతని దేం తప్పులేదు. అతని అరుపు, ఆ మీసం, ఆ టోపీ ఆ వాలకం చూసేసరికి నా రక్తం ఉడికిపోయింది. యిక తిరిగి వెడదాం పద" అన్నాడు ఇన్సరోవ్.

"సరే, వెడదాం డిమిత్రీ! చలిగాకూడా వుంది. మాస్కోలో జబ్బుపడ్డాక తగిన జాగ్రతపడకపోయేసరికి వియన్నాలో అనుభవించాల్సి వచ్చింది. యికైనా తగు జాగ్రత పడాలి." ఇన్సరోవ్ మాట్లాడలేదు. వెనకటి విషపునవ్వే అతని పెదమిలమీద తాండవించింది.

"మనం యేం చేయాలో ఆలోచించే వుంచా. పెద్ద కాలవమీదగా వెడదాం. యిక్కడికి వచ్చినాక వెనీస్ సరిగా చూడనేలేదు. సాయంకాలం నాటకానికి వెడదాం. నా దగ్గిర రెండు టిక్కెట్లున్నాయి. కొత్త సంగీత నాటకం ఆడతారట, డిమిత్రీ! యివాళ వొకరొక్కరం అర్పించుకుందాం. యుద్ధం, రాజకీయాలు, మిగతా ప్రపంచమంతా మర్చిపోయి మనం సజీవంగా వూపిరిపీలుస్తూ, శాశ్వతంగా వొకరికొకరం చెందివున్నామని అనుకుంటూ కాలంగడుపుదాం. యేం? అలాగే చేదామా?"

"నీ కలా గడపాలనివుంది. ఎలీనా! నాకూ అలా వుండక వేరు విధంగా యెలా వుంటుంది."

"ఆ సంగతి నాకు తెలుసు" అంది ఎలీనా మందహాసంచేస్తూ "సరే, యిక పడదాం."

ఇద్దరూ పడపదగ్గిరికి తిరిగి వెళ్లి పెద్ద కాలవమీదగా నింపాదిగా తీసుకెళ్ళమని పడవవాడితో చెప్పారు.

ఏప్రియల్ నెలలో వెనీస్ నగరం చూసినవారికే ఆ మాయా నగర వర్ణనాతీత ఆకర్షణ బోధపడుతుంది. జెనోవా మహానగరానికి వేసంగి సూర్యుడెలాగో, పురాతన రోమ్ నగరానికి శీతాకాలపు స్వర్ణచ్ఛాయ ఎలాగో, వెనీస్ నగరానికి వసంతకాలపు ప్రశాంతత అలాగు. వసంత కాలం మనల్ని కదిపి కాంక్షలు రేకెత్తించినట్టే వెనీస్ నగర సౌందర్యం కూడా కాంక్షలను రేకెత్తిస్తుంది. అమాయికపు హృదయాలలో నిరాడంబరమైన అమానవ గోచరమైన సంతోషమును రేకెత్తించి ఆశాపూరితుల్ని చేస్తుంది.

ఆ నగరమంతా దివ్యకాంతితో వెలిగిపోతోంది. అయినా మత్తిల్లిన ప్రశాంతరాసిక్యత వ్యాపించింది. ఎటుచూచినా నిశ్శబ్దత! కాని ఆ నగరంలో ప్రతివస్తువూ ఆగంతుకులకు స్వాగత మిస్తున్నట్లనిపిస్తుంది. ఆ నగరం చివరకు పేరుతోసహా, స్త్రీమూర్తిని తలపింపజేస్తుంది. అందుకనే వెనీసు నగరానికి "సౌందర్యరాశి" అని పేరు వచ్చింది. గొప్ప గొప్ప రాజభవనాలు, చర్చిలు ఏ దేవత స్వప్న సృష్టో అన్నట్టుగా గాలిలో అద్భుతంగా తేలియాడుతుంటాయి. ఆ నగరాన్ని ఆవరించిన కాంతీ, నిశ్శబ్దంగా చిరు అలలతో ప్రవహించే కాలవలు, ఆ కాలవలలో మందగమనంతో విహరించే నావలు, బజారు వర్తకుల కేకలు హడావిడి గగ్గోలు గందరగోళం లేకపోవడం ఆ నగరానికి శోభదెస్తూ ఆకర్షణీయంగా ఉన్నాయి. "వెనీస్ అవసానదశలో ఉంది, పరిత్యజింపబడుతోంది." అంటారు ఆనగరపౌరులు. సౌందర్యం వికసించి పరాకాష్ఠకు చేరుకునే సమయంలో వాడిపోతున్న నగరంలో ఉన్న ఆకర్షణ పూర్వం ఆ నగరానికిలేదు. ఆ నగరం తిలకించిన వారికే దాని గొప్పదనం అర్థమవుతుంది. * కానలెట్టోగానీ, ♦ గార్డీగానీ, ఆనగరవాతావరణంలో తరుపంక్తులలో ఉండే సున్నితత్వాన్ని, సున్నితమైన రేఖలతో క్షణక్షణం మారే వర్ణాలలో ఉండే మహత్తర మధురిమను చిత్రించలేకపోయారు. ఆ సున్నితత్వం, ఆ మధురిమ పట్టుపడినట్టే ఉండి, ఇట్టే చెయిజారిపోయేవి. జీవితంలో అనేక ఆఘాతాలుతిన్న ఆగంతులకు గాయాలు వెనీస్ మానపలేదు. యవ్వనంలో ఫలప్రదంకాని స్వప్నాలు

*కానాలెట్టో : (1697-1768) సుప్రసిద్ధ వెనీస్ చిత్రకారుడు.

♦గార్డీ : (1712-1793) వెనీస్ చిత్రకారుడు. కానలెట్టో శిష్యుడు.

విషంగా పరిణమించినట్టే వెనీసూ వారికి విషతుల్యంగా ఉంటుంది. కాని బలం, ఆత్మవిశ్వాసం ఉన్నవారికి వెనీస్ మధురంగా ఉంటుంది. వారు తమ ఆనందాన్ని ఆ నగరంలో వెదజల్లితే ఆ నగరం తన అనవరత కాంతితో ఆ ఆనందాన్ని ద్విగుణీకృతం చేస్తుంది.

ఇన్సరోవ్, ఎలీనాలు కూర్చున్న నావ ప్రధాన న్యాయాధిపతి భవనం దాటి పెద్ద కాలవలో ప్రవేశించింది. ఆ కాలవ కిరువైపులా చలవరాతి భవనాలు ఉన్నాయి. వాటి సౌందర్యం తిలకించి అనుభవించేటంత వ్యవధి కంటికి ఇవ్వకుండా ఆ భవనాలు తేలియాడుతున్నట్టున్నాయి. ఎలీనా పరమానంద భరితురాలైంది. ఆమె జీవితాకాశంలో ఒకేఒక మబ్బుతునక ఉంది. ఆ రోజున ఇన్సరోవ ఆరోగ్యం ఎంతో బాగుండడంచేత ఆ మబ్బుతునకా మాయమైపోయింది. రియాల్టో వంతెనదాకా వెళ్ళి తిరుగుముఖం పట్టారు. ఇన్సరోవ్ చలికి బాధపడతాడని చెప్పి ఎలీనా చర్చిలు చూడడానికి భయపడింది. లలితకళా పరిషత్తు ఎలీనాకి జ్ఞాపకం వచ్చి అక్కడికి తీసుకువెళ్ళమని నావికుడిని అడిగింది. ఆ పరిషత్తు చిన్నపాటి మ్యూజియం లాంటిది. త్వరత్వరగా గాలరీలన్నీ చూశారు. లలిత కళలంటే అభిమానమూ, అభినివేశమూ లేకపోవడంవల్ల ప్రతి చిత్రంవద్ద నిలిచి పరిశీలించాలని వారికి అనిపించలేదు. హఠాత్తుగా వారిలో అమితోత్సాహం కల్గింది. ప్రతి వస్తువూ వారికెంతో ఆనందం గొలిపింది. తరచు చంటిపిల్లలను ఆవహించే ఉల్లాసం లాంటిదే వారి నావహించింది. నీళ్ళలోకి ఊరకే కప్పలాగా ఆకాశాన్నుంచి చిత్రహింసకు గురవుతున్న ఒక బానిసను రక్షించేందుకు, ఉరుకుతున్నట్టు * టిన్‌టోరెట్టో చిత్రించిన ♦ సెయింటుమార్కు చిత్రం చూసి ఎలీనా విపరీతంగా నవ్వింది. కళ్ళవెట నీళ్లు కారాయి. ఆ నవ్వటంలో ఎలీనా ఆ పురావస్తు ప్రదర్శనశాల తిలకించడానికి వచ్చిన ముగ్గురు ఆంగ్లేయుల్ని అదరగొట్టింది. పొడుగాటి ఆకుపచ్చ అంగరఖా తొడిగి అంతా చురుకుగా

* టిన్‌టోరెట్టో: (1518-1594) ప్రపంచ ఖ్యాతిగాంచిన వెనీస్ చిత్రకారుడు. బైబిలులోని చాలకథలను చిత్రించినవాడు.

♦ సెయింట్ మార్కు: బైబిలు క్రొత్తనిబంధన రెండవభాగం రచించిన ఋషితుల్యుడు.

ఉన్నట్లు కనిపిస్తూ * మెడోనాకేసి చేతులు చాచినట్లు ♦ "టిటియాన్" తన 1 "ఎసంషన్" అనే చిత్రంలో చిత్రించిన వ్యక్తిని చూసి ఇన్సరోవ్ మహా సంతోషపడ్డాడు. ఆ చిత్రంలో, మెడోనా బలంగా, అందంగా చిత్రింపబడి వుంది. ఆమె భగవంతుని కౌగిలింతలోకి చేరుకుంటున్నట్లు చిత్రించిన వైఖరి వారికెంతో ఆశ్చర్యం కలిగించింది. 2 సిమాడి కా నెగ్లియానో అనే పూర్వ చిత్రకారుని గంభీర చిత్రాన్ని కూడా వారు ఎంతో మెచ్చుకున్నారు. కళాపరిషత్తు నించి వెళ్ళిపోయేటప్పుడు ఆ ముగ్గురు ఆంగ్లేయులకేసి చూశారు. వారి ఎత్తుపళ్లూ, వేళ్ళాడే మీసాలూ చూసేసరికి నవ్వొచ్చింది. నవ్వారు. పొట్టి చొక్కా, పంట్లాం తొడుక్కున్న పడవవాణ్ణి చూసేసరికి మళ్ళీ వారికి నవ్వొచ్చింది. జుట్టు తలపైన ముడివేసుకున్న ఒక వీధిగాయకురాలు కంటపడేటప్పటికి పొట్ట చెక్కలయ్యేటంత నవ్వొచ్చింది. తర్వాత ఒకరి నేత్రాలలోకి ఒకరు చూసుకుని నవ్వుకున్నారు. పడవలో కూర్చున్నాక ఎంతో ఆప్యాయంగా ఒకరి చేతులు ఒకరు నొక్కుకున్నారు. హోటలుకు వెళ్ళి గబగబా తమ గదిలో ప్రవేశించి భోజనం తెమ్మన్నారు. భోజనసమయంలోకూడా ఆ ఉల్లాసం వారిని విడిచిపెట్టలేదు. ఒకరి ఆరోగ్యం కోరుతూ ఒకరు మద్యం సేవించారు. మాస్కోలోని తమ మిత్రుల ఆరోగ్యం కోరుతూకూడా మద్యం సేవించారు. మంచి రుచికరమైన చేపలకూర చేసినందుకు వంటవాణ్ణి అభినందించారు. బతికున్న చేపలు తెమ్మన్నారు. ఆ వంటవాడు నేలమీద కాళ్ళువంచి బుజాలు ఎగరవేసి వెళ్ళిపోతూ తల పంకించి నిట్టూర్చి సణుక్కున్నాడు. భోజనానంతరం ఎలీనా, ఇన్సరోవ్‌లు నాటకప్రదర్శనం చూడడానికి బయలుదేరారు.

3 "వెర్డి రచించిన సంగీతనాటకం "ట్రవియాటా" ప్రదర్శించబడు

* మెడోనా : ఏసుక్రీస్తుతల్లి మేరీ

♦ టిటియాన్ : (1477 1576) ప్రపంచ ఉత్తమ చిత్రకారులలో ఒకడు. ఏసుక్రీస్తు గాథలు అనేకం చిత్రించి అమితఖ్యాతి పొందాడు.

1 ఎసంషన్: ఏసుక్రీస్తుతల్లి మేరీకి స్వర్గలోకంలో స్వాగతంయిచ్చుట.

2 సిమాడా కా నెగ్లియానో: గొప్ప ఇటాలియన్ చిత్రకారుడు.

3 వెర్డి: (1813-1901) ఇటాలియన్ సంగీత నాటకకర్త.

తోంది. అది సాధారణ నాటకమే గాని యూరపులోని అన్ని నగరాలలో విజయవంతంగా అదివరకే ప్రదర్శించబడ్డది. రష్యన్లకి కూడా ఆ నాటకం బాగా తెలుసు. వెనీసు నాటకోత్సవాలు పరిసమాప్తి అయాయి. అందులో పాడినవారికేం పెద్ద కీర్తి రాలేదు. బిగ్గరగా తమ తమ 'పాట్లు' అరవడం మొదలెట్టారు. కథానాయిక వైయొలెట్టా వేషం వేసిన నర్తకి ప్రతిభావంతురాలైనా ఎవరికీ నచ్చలేదు. ఆ నర్తకి మంచి యవ్వనంలో ఉంది. నల్లటి కనుపాపలు. పెద్ద అందగత్తె కాదు. స్వరం నిలకడగా లేదు. మాధుర్యం తగ్గిపోయింది. అతి సామాన్యదుస్తులు ధరించింది. తలమీద ముడి, వెలిసిపోయిన ఊదారంగు బిగుతువలెవాటు, మోచేతులుదాకా తోలుచేతితొడుగు. రైతుబిడ్డకి పారిస్‌లోని వేశ్యలు ఎలా దుస్తులు ధరిస్తారో ఏం తెలుసుంది? రంగసలంమీద ఎలా మెలగాలో ఆమెకి బాగా తెలీదు. ఆమె అభినయంలో ఎంతో నిజాయితీ, సహజత్వం ఉంది. ఒక్క ఇటాలియన్లకుమాత్రమే పట్టుబడ్డ భావోద్రేకంతో ఆమె పాడింది. రంగస్థలానికి పక్కగా ఉన్న బాక్సులో ఎలీనా, ఇన్సరోవ్‌లు ఇద్దరే కూర్చుని ఉన్నారు. లలితకళా పరిషత్తులో ఉండగా వారి నావహించిన ఉల్లాసం వారి నింకా విడనాడలేదు. ఒక వేశ్యవలలో చిక్కుకున్న ఒక యువకుని తండ్రిపాత్ర ధరించిన నటుడు ఆకుపచ్చ కోటు తొడుక్కుని తెల్లటి చింపిరి టోపీ పెట్టుకుని స్టేజీమీదికి వచ్చి వంకరగా నోరుతెరిచి కంగారుపడి పాట ప్రారంభించే సరికి ఎలీనా, ఇన్సరోవ్‌లు ఇద్దరూ పకపకా నవ్వారు. కానీ వయొలెట్టా వారి కెంతో నచ్చింది.

"పాపం! ఒక్కళ్లూ మెచ్చుకోరేం? ఏదో సమాజకుల్ని మెప్పించాలని తంటాలు పడుతూ మహా గర్వంతో నటించే విఖ్యాత అభినేత్రుల కంటే యీమె వెయ్యిరెట్లు నయం. తాను అభినయించే రసం నిజంగా ఆమె అనుభవిస్తున్నట్టే ఉంది. ప్రేక్షకు లున్నారనే పరిజ్ఞానమే ఆమెకి లేదు." అంది ఎలీనా.

ఇన్సరోవ్ బాక్సులోంచి ముందుకి వంగి వయొలెట్టా వేషధారిణికేసి తేరిపారజూచి "అవునవును. నిజంగా అనుభవిస్తోనే అభినయిస్తోంది. మృత్యువు కమ్ముకు వస్తున్నట్టుంది." అన్నాడు. ఈ మాటలు విని ఎలీనా ఊరుకుంది.

తెర ఎత్తారు. మూడో అంకం ప్రదర్శనం ప్రారంభమయింది. ఆ శయ్య, మందు సీసాలు, లాంతరు చూసి ఎలీనా వణికిపోయింది. అవన్నీ

అంతకుముందు జరిగిన సంఘటనలు ఆమెకి జ్ఞాపకం తెచ్చాయి. ప్రస్తుత విషయం ఏమిటి? భవితవ్య మేమిటి? ఈ ప్రశ్నలు ఆమె మనసులో తళుక్కుమన్నాయి....స్టేజీమీద ఆ నటి అభినయించిన దగ్గుకు ప్రతిధ్వనిగా పక్కనకూర్చున్న ఇన్సరోవ్ నిజంగా దగ్గాడు. ఎలీనా అతనికేసి ఓరచూపు చూసింది. ప్రశాంత, గంభీరభావం ఆమె ముఖంలో నెలకొన్నది. ఇన్సరోవ్ ఆమె ఊహలు కనిపెట్టి చిరునవ్వు నవ్వి మెల్లగా తానూ నటులతో కలిసి పాడ ప్రారంభించాడు.

కొద్దిసేపటికే అతనూ నిశ్శబ్దంగా కూర్చున్నాడు. ఆ యువగాయకురాలి ప్రదర్శనం క్షణక్షణానికీ బలం, స్వేచ్ఛా సనుకూర్చుకొంటోంది. అనవసరమైన హంగామా అంతా విసర్జించి, కళాకారులకు ఉత్తమ ఆనందాన్ని చేకూర్చే — ఆత్మదర్శనం — ఆమె పొందుతున్నట్లనిపించింది. హఠాత్తుగా అనిర్వచనీయమైన ఒకానొక సరిహద్దును దాటి ఆమె సౌందర్యం దర్శించినట్లనిపించింది. ప్రేక్షకులంతా ఆశ్చర్యచకితులయారు. ఆ బొంగురుగొంతు సామాన్యబాలిక ప్రేక్షక హృదయాలను గుప్పిటలో పట్టుకుని స్వాధీనం చేసుకోసాగింది. ఆమె స్వరం బొంగురుతనాన్ని కోల్పోయి మధురిమనూ శక్తినీ సంపాదించుకుంది. అల్ఫ్రెడో (ఆ నాటకంలో నాయకపాత్ర) రంగంమీదకి రాగానే వయొలెట్టా ప్రదర్శించిన సంతోషానికి ప్రేక్షకలోకం ఉర్రూతలూగి కరతాళధ్వనులు చేశారు. ఆ కరతాళధ్వనులముందర ఉత్తరదేశాలలోనివి ఎందుకూ పనికిరావు. ఒక్క క్షణం కాలంతర్వాత ప్రేక్షకులు తిరిగీ నిశ్శబ్దత వహించారు. ఆ సంగీత నాటకంలో ఉత్తమోత్తమైన డ్యూయెట్ ప్రారంభమైంది. ఆ పాటలో స్వైరకాముడు జీవితం వృథాగా తెలివితక్కువగా గడిపిన యువకుని పశ్చాత్తాపం, నిరాశతోకూడిన ప్రేమయొక్క అంతిమ పోరాటం వెలువరించాడు. రసవాహినిలో కొట్టుకుపోతూ ఆనందబాష్పాలతో, కళాకారునికి కలిగే ఆనందంతో, ఆవేదనతో భావోద్రేకంతో ఆమె అభినయించింది. ఆమె ముఖమే మారిపోయింది. మృత్యువును ఎదుర్కొనబోతూ చేసినభగవత్ప్రార్థనలో ఆమెనోటినించి "ఇంత చిన్నతనంలో నను తీసుకుపోబోకు. ఇంకా కొంతకాలం బతకనియ్యి" అన్నమాటలు వెలువడగానే హాలంతా కరతాళధ్వనులతో హర్షధ్వానాలతో మారుమోగింది.

ఎలీనా కొయ్యబారిపోయింది. ఇన్సరోవ్ చేతిని వెదికి గట్టిగా పట్టుకుంది. అతనూ ప్రత్యుత్తరంగా ఆమె చేతిని గట్టిగా అదిమాడు కాని ఒకరి కేసి ఒకరు చూసుకోలేదు. సాయంకాలం పడవలో ఇన్సరోవ్ ఆమె చేతిని పట్టుకున్నాడు. ఆ పట్టుకోడానికి ప్రోత్సహించిన లక్ష్యం పూర్తిగా ఇప్పటి లక్ష్యానికీ, బుజ్జగింపుకూ భిన్నమైంది.

పెద్ద కాలవమీదుగా తమ హోటలుకు వారు తిరిగి వెళ్ళారు. వెన్నెలరాత్రి ప్రశాంతంగా ఉంది. పడవలో వెళుతుండగా వారు చూచిన భవనాలివే. కాని ఏదో విభిన్నత్వం ఇప్పుడు వాటిలో గోచరించింది. చంద్రకాంతిపడిన భవనాలు లేతబంగరు ఛాయతో వెలుగుతున్నాయి. ఆ కాంతిలో అలంకార వివరాలు, కిటికీలు, బాల్కనీలు మాయమవుతున్నట్లనిపించింది. కొద్దికొద్దిగా నీడలుపడ్డ భవనాలుమాత్రం స్పష్టంగా గోచరిస్తున్నాయి. ఎర్రటి దీపాలతో ప్రయాణంచేస్తున్న పడవలు ఎక్కువ వేగంతో నిశ్శబ్దంగా నడుస్తున్నట్లనిపించింది. ఉక్కుతో చేసిన పడవ ముందుభాగం తళతళా మెరిసిపోతోంది. వెండిచేపల్లా ఎగిరిపడుతున్న అలలమీద తెడ్లు పడుతూ లేస్తున్నాయి. చుట్టుపక్కలనించి పడవ వాళ్ళ పాటలు మినహా మరే శబ్దమూ వినబడడంలేదు. ఎలీనా ఇన్సరోవ్‌లు బస చేసిన హోటలు షియవోనీదిమీద ఉంది. ఆ హోటలుకు చేరకముందు వారు పడవదిగి సాన్‌మార్కో బజారుచుట్టూ అనేకసార్లు తిరిగారు. అక్కడ చిన్నచిన్న హోటళ్ళముందు బాతాఖానీకొడుతూ జనం గుంపులు గుంపులుగా కూడి ఉన్నారు. అపరిచిత నగరంలో అపరిచిత ప్రజలమధ్య ప్రేమించిన మనిషితో ఒంటరిగా షికారుకొట్టడంలో ఎంతో ఆనందముంటుంది. అప్పుడు ప్రతివాడూ అందరికీ శాంతి ఉండాలనీ, తాను అనుభవిస్తున్న సుహృద్భావం, ఆనందం అందరికీ కలగాలనీ కోరుకుంటాడు. కాని ఎలీనా ఈ ఆనందాన్ని పూర్తిగా అనుభవించలేకపోయింది. ఆ అనుభవాలు ఆమె హృదయంపై వేసిన ముద్రలు ఆమె మనోనిబ్బరమును సడలింపజేశాయి. ఇక ఇన్సరోవ్ ప్రధాన న్యాయమూర్తి భవనంపక్కగా వెడుతూ ఆర్చీల గుండా బారుపెట్టబడిన ఆస్ట్రియా ఫిరంగులను ఎలీనాకు చూపించి హాటును కళ్ళమీదికి లాక్కున్నాడు. ఇంతేకాదు ఇన్సరోవ్ అలసిపోయాడు. అందుకని సెయింట్ మార్కు చర్చికేసీ, దాని బురుజులుకేసి ఆఖరుసారి చూసి మెల్లగా ఇంటిదారి పట్టారు.

షియవోనినదినించి గుయిడెక్కా దాకా వ్యాపించిన విశాలమైన ఇసుకపర్రకు ఎదురుగా వారి హోటలు ఉంది. దానికి ఎదురుగుండా సాన్ జియార్జియో గోపురం ఉంది. కుడివైపున ఎంతో ఎత్తున డోగోనా సువర్ణకలశం ప్రకాశిస్తోంది. ఆ నగరంలోని చర్చిలలోకల్లా అతి సౌందర్యవంతమైన రెడెంటోర్ అలంకరించుకున్న నూత్న వధువులా ఉంది. ఎడమ వైపున పడవల తెరచాప కొయ్యలు మొదలైనవి ఆ రాత్రివేళ నల్లగా కనిపిస్తున్నాయి. సగం విచ్చుకున్న తెరచాప పక్షిరెక్కలా ఉంది. ఇన్సరోవ్ కిటికీదగ్గర కూర్చున్నాడు. కాని ప్రకృతి దృశ్యాలను చూసి అట్టేసేపు ఆనందించకుండా ఎలీనా అడ్డుపడింది. హఠాత్తుగా అతనికి జ్వరం తగిలింది. బలహీనత అతన్ని లొంగదీసుకుంది. ఎలీనా అతన్ని తీసుకెళ్లి పండుకోబెట్టి నిద్రపట్టగానే మెల్లగా కిటికీదగ్గిరికి తిరిగివెళ్ళింది. ఆ రాత్రి ఎంతో ప్రశాంతంగా ఎంతో మృదులంగాఉన్నట్లామెకి అనిపించింది. పావురాయిలాగా మందమారుతం వీస్తోం. సకల బాధలు, సకల దుఃఖాలు, ఆ నిర్మలాకాశంలోంచి వెలువడే కాంతిలో అణిగి మణిగి నిద్రిస్తాయి, "ఓయి దేవుడా" అనుకుంది ఎలీనా "మే మెందుకు చనిపోవాలి? వియోగబాధ, రోగాలు, కన్నీళ్లు యెందుకు అనుభవించాలి? అలా అనుభవించాలని రాసి పెడితే యీ సౌందర్యం, ఈ మధుర ఆశాభావం, చివర కెలాగైనా అమర ఆశ్రయం లభిస్తుందనే దృఢవిశ్వాసం యెందుకు? మందహాసంచేసే ఆ ఆకాశానికి అర్థమేమిటి? ఆనందంతో లేలయాడే ఈ భూమికి అర్థమేమిటి? యిదంతా మన మనోభ్రమేనా? నిజానికి బయట అంతా శాశ్వత నిశ్చలత్వమేనా? మనం ఒంటరిగానే వున్నామా? అవతల మనకు గోచరంకాని అగాధాలున్నాయా? అయితే ప్రార్థనలు చేయాలనే యీతృష్ణ యెందుకు? ప్రార్థనలు మన కెందుకు ఆనందాన్ని కలిగిస్తున్నాయి? (ఈ మాటలు ఆమె హృదయంలో మోగాయి) కరుణించమని, సహాయపడమని ప్రార్థించకూడదా? భగవాన్! నీ అద్భుతలీలలు తిలకించే అదృష్టం మాకు లేదా?" తలమీద చేతులు పెట్టుకుని నొక్కుకుంది, "ఇక అంతమేనా, అంతమేనా? నిమిషాలుకాదు, గంటలుకాదు, రోజులుకాదు వరసగా వారాలకి వారాలు ఆనందం అనుభవించాను. యీ ఆనందం అనుభవించడానికి నా కేం హక్కుంది?" తన ఆనందాన్ని తల్చుకుని ఎలీనా భయపడసాగింది.

"యిలా ఆనందం అనుభవించడానికి మాకు సాక్ష్యం లేదేమో? యీ ఆనందానికి అంతకంతా చెల్లించుకోవాలేమో? అదంతా స్వర్గలోకం ... మనం సామాన్య మానవులం, పాపులం. విషాదభావమా! మరలిపొమ్ము. నే నొక్కదాన్నే గాదు." అనుకుంది. "యిదీ శిక్షే నేమో? మేం చేసిన తప్పిదానికి అపరాధం చెల్లించుకోవాలేమో? నా అంతరాత్మ ప్రశాంతగా, అతిప్రశాంతంగా వుంది. యిది నా నిర్దోషిత్వాన్ని సూచిస్తుందా? ఓ భగవంతుడా! మే మంత దోషులమా? యీ రాత్రిని, యీ ఆకాశాన్ని సృష్టించిన నువ్వు ఒకనొకరం ప్రేమించుకున్నందుకు మమ్మల్ని శిక్షిస్తావా? అలా శిక్షించదలచితే అతను దోషి అయితే నేనూ దోషినే." హఠాదావేశంతో అంది: "భగవాన్! అలా అయితే యీ గదిలో కాకుండా అతని మాతృభూమిమీద మా యిద్దరికీ గౌరవప్రదమైన మహోన్నతమైన మరణం ప్రసాదించు. పాపం! అమ్మ! యెంత విచారపడుతుందో!" ఈ ప్రశ్నకు ఆమె అదిరిపోయింది. జవాబు లభ్యంకాలేదు ఒకని సౌఖ్యం ఇంకొకనిబాధమీద నిర్మితమైందా?, ఒకడు పొందే సదుపాయాలు, సహాయాలు - విగ్రహానికి కింద రాతిపలక అవసరమైనట్టే - ఇతరుల చిక్కులు ఇబ్బందులమీద ఆధారపడి ఉన్నాయనికి ఆమెకి తెలీదు.

"రెండిచ్!" అని ఇన్సరోవ్ నిద్రలో కలవరించాడు.

బొటనవేళ్లమీద నడిచి ఎలీనా భర్తదగ్గిరకి వెళ్లి అతనిమీద వంగి ముఖంమీది చెమట తుడిచింది. తలగడమీద తల అటూ యిటూ ఒక్క క్షణం ఆడించి ఇన్సరోవ్ తిరిగీ కదలకుండా పడుకున్నాడు.

ఎలీనా కిటికీదగ్గిరకి, పూర్వపు ఆలోచనలకు తిరిగి మళ్లింది. భయమేమీ లేదని మనసును సరిపెట్టుకోసాగింది. మనోనిబ్బరం కోల్పోయినందుకు సిగ్గుపడింది. "నిజానికి ప్రమాదం యేవుంది? ఆయనికి ఆరోగ్యం బాగానేవుంది! ఆనాటకానికి యివాళ వెళ్లకపోతే యీ పిచ్చి ఆలోచనలు నా బుర్రలోకి వచ్చేవికావు." ఇంతలో ఓ తెల్లటి నీటికాకి నీళ్లమీద ఎగరటం ఆమె చూసింది. బహుశా చేపలుపట్టేవాడెవడో దాన్ని బెదరగొట్టు టాడు. చప్పిడిచేయకుండా. ఎక్కడో అక్కడ వాలటానికి అది తిరుగుతోంది. "ఆ నీటికాకి కనక యిలా యెగురుతూవస్తే శుభశకునం" అనుకుంది. కాని ఆ నీటికాకి చెక్కర్లుకొట్టి రెక్కలుముడుచుకుని కావురు

మని యేడిస్తూ, పడవల అవతల దెబ్బతిన్న పక్షిలా నీటిలో పడిపోయింది. ఎలీనా వణికిపోయి తర్వాత అలా వణికిపోయినందుకు సిగ్గుపడింది. దుస్తులు మార్చుకోకుండానే దీర్ఘంగా నిశ్వస్తున్న ఇన్సరోవ్ పక్కన పడుకుంది.



## 3౪

ఇన్సరోవ్ చాలా పొద్దెక్కి లేచాడు. తల కొద్దిగా నొప్పిగా ఉంది. బలహీనత విపరీతంగా ఉందని చెప్పాడు. అయినా లేచి కూర్చుని "రెన్‌డిచ్ యింకా రాలా?" అని ప్రశ్నించాడు. "యింకా రాలా" అని ఎలీనా జవాబిచ్చి "ఆసర్వ్యాటోర్ ట్రీస్టినో" అనే పత్రిక తాజా సంచిక అందిచ్చింది. అందులో యుద్ధవిషయాలూ, స్లావ్ దేశాల విషయాలూ, పట్టణాల విషయలూ ఎక్కువ ప్రస్తావించబడ్డాయి. ఇన్సరోవ్ పత్రిక చదవ నారంభించాడు. ఎలీనా కాఫీ తయారుచేస్తోంది. ఇంతలో తలుపుకొట్టిన చప్పుడైంది.

"రెన్‌డిచ్ వచ్చుంటాడు." అని ఇద్దరూ అనుకున్నారు. కాని ఓ రష్యన్ కంఠం "రావచ్చునా?" అని ప్రశ్నించింది. ఇద్దరూ ఒకరికేసి ఒకరు ఆశ్చర్యంగా చూసుకున్నారు. తిరిగి జవాబిచ్చేలోపల ఒక యువకుడు ప్రవేశించాడు. ఆ యువకుడు నీటుగా దుస్తులు ధరించాడు. ముఖం చిన్నది. కొట్టచ్చినట్టుంది. సూక్ష్మగ్రాహి. అపుడే బోలెడంతడబ్బు సంపాదించుకున్నవాడిలా, ఎదో గొప్పవార్త విన్నవాడిలా ఆత్మసంతృప్తితో వెలిగిపోతున్నట్లున్నాడు.

ఇన్సరోవ్ కుర్చీలోనించి లేచాడు. "గుర్తుపట్టలా?" అన్నాడా అపరిచితవ్యక్తి ఇన్సరోవ్ దగ్గిరికి హుషారుగా వెడుతూ. నమ్రతతో ఎలీనాకు నమస్కరించాడు. "నాపేరు లుపయరోవ్. మాస్కోలో ... వారియింట్లో కలుసుకున్నాం జ్ఞాపకంలేదూ?" అన్నాడు.

"అవునౌను జ్ఞాపకమొచ్చింది." అన్నాడు ఇన్సరోవ్.

"అవునౌను, నీ భార్యకు నన్ను పరిచయంచెయ్" అని ఎలీనాకేసి తిరిగి "నాకు డిమిట్రీవాసిలెయెవిచ్ అ-అదే నికనోర్‌వాసిలెయెవిచ్ అంటే

నాకెంతో గౌరవభావం. మిమ్మల్ని కలుసుకునే అవకాశం కలిగినందుకు యెంతో సంతోషిస్తున్నా" అని ఇన్సరోవ్ కేసితిరిగి "వీరిక్కడున్నారని నిన్ననే తెలిసింది. నేనూ యీ హోటల్లోనే మకాంచేశాను. ఈ వెనీస్! అబ్బ! యేంపట్నం యేంపట్నం! రసమయకవిత్వంలా ఉంటుంది! కాని వొక్కటే ఘోరం! యెక్కడచూసినా వెధవ ఆస్ట్రియన్లు! డాన్యూబ్ నదీతీరంలో గొప్ప యుద్ధంజరిగిందట విన్నావా? 300 మంది టర్కిష్ అధికారుల్ని చంపేశారు. సిలిస్ట్రాని పట్టుకున్నారు. సెర్బియా స్వాతంత్ర్యం ప్రకటించుకుంది. దేశభక్తుడివి నీకెంత ఆనందం కలిగిందో! నామట్టుకు నారక్తం ఉడుకెత్తిపోతోంది. అయినప్పటికీ ఒక్క సలహా - బహు జాగ్రత్తగా వుండు. నీమీదా వాళ్ళకన్నుపడ్డది. ఇక్కడ గూఢచారులు విపరీతంగా వున్నారు. నిన్న కొంచెం అనుమానించదగినవ్యక్తి వొకతను వచ్చి 'నువ్వు రష్యన్ వా?' అని నన్నడిగాడు. నేను డెన్నార్కు దేశస్థుణ్ణని చెప్పా. యేమిటి, నికనోర్ వాసిలీవిచ్! నీకు వంట్లో బాగువున్నట్టులేదే? వంటివిషయం జాగ్రత్తతీసుకో. అమ్మా! మీభర్త ఆరోగ్యంవిషయం కొంచెం జాగ్రత్తగా చూస్తూవుండూ. నిన్నల్లా చర్చిలచుట్టూ, భవనాలచుట్టూ తిరుగుతూ గడిపా. ఆవేశంతో నను నేనే మర్చిపోయా. ప్రధానన్యాయమూర్తి భవనం చూసారుకదూ? ఆ భవనంలో బహు ముఖ్యమైన వస్తు సముదాయం వుంది. ముఖ్యంగా చిత్రపటాలు బహు అమూల్యమైనవి. *మారినోఫాలీరీ చిత్రపటంకోసం అట్టేవుంచిన ఖాళీస్థలం, దాని కింద రాసిన పంక్తులూ-చూడదగ్గవి. ఎంతో పేరుపడ్డ కారాగారాలూ చూశాను. నా రక్తం సలసలా కాగిపోయింది. నాకు సాంఘికసమస్యలంటే యెంతో ఆసక్తి. రాజకుటుంబాలమీద పోరాటాల్లో నేనూ వున్నా. రాజరికాన్ని బలపర్చేవారికి ఆ కారాగాలు చూపాలి. "నిట్టూర్పువారధిపై వెనీస్‌లో నిల్చున్నా" అని ♦బైరన్ రాయటం బలే సబబుగా వుంది, అవును. అతనూ రాజవంశానికి చెందినవాడే. నే నెప్పుడూ అభ్యుదయం కాంక్షించేవాణ్ణి. యువకులంతా

---

* మారినోఫాలీరీ: వెనీస్ ప్రధాన న్యాయమూర్తి. ఇతను చేసిన అనేక నేరాలకు శిరచ్ఛేదన చేశారు.

♦ బైరన్: (1788-1824) ఆంగ్లమహాకవి. గ్రీసుస్వాతంత్ర్య సమరంలో చేరి ప్రాణాలర్పించిన యోధుడు.

అభ్యుదయకాముడే కాదూ? ఈ ఆంగ్లో - ఫ్రెంచివాళ్ళ విషయం యేమంటావ్? యీ [1]బోనపార్టీ, యీ [2]పామర్‌స్టన్ యేం సాధిస్తారో చూద్దాంగా. పామర్‌స్టన్‌ని ప్రధానమంత్రిని చేశారట విన్నావా? ఊహూ, యేమన్నా అను రష్యా జోలికిపోతే వుంటుంది యేంమజా అన్నా! ఆ బోనపార్టీ వున్నాడే వట్టి బద్మాష్! [3]విక్టర్‌హ్యూగో రాసిన 'లేబాటిమెంట్స్' అనే పుస్తకం యివ్వనా? అద్భుతంగా వుంటుంది. యెంతటి పదగుంభన! యెంతటి జీవశక్తి! విజెమెస్కీ రాజకుమారుడుకూడా చక్కటి కవిత్వాలు రాశాడు.

అబ్బ! నాకు కవిత్వమంటే యెంత యిష్టమనుకున్నా! యిటీవలే వెలువడ్డ [4]ప్రౌధాన్ గ్రంథం నాదగ్గిరవుంది. అదొకటేమిటి! అతని గ్రంథాలన్నీ వున్నాయి. నీకేం అనిపిస్తుందోగాని నాకుమాత్రం యీ యుద్ధమంటే మహాసంతోషంగావుంది. అయితే నేనుతిరిగి రష్యాకిరమ్మంటారేమోనని ఇక్కడనించి ఫ్లారెన్సు, రోమ్ నగరాలు వెడతానికి సన్నాహం చేసుకుంటున్నా. ఫ్రాన్సువెళ్ళడం అసంభవం. అందుకని స్పెయిను వెడదామనుకుంటున్నా. అక్కడ ఆడవాళ్ళు అద్భుతంగా వుంటారంటారు. కాని అక్కడ దారిద్ర్యం, వ్యాధులు తాండవిస్తున్నాయి. కాలిఫోర్నియా కూడా వెడతా. రష్యావాడికి అసాధ్యమంటూ యేవుంది? మధ్యధరాసముద్ర దేశాల్లో వర్తకంగురించి వివరంగా పరిశీలిస్తానని ఓ పత్రికాసంపాదకుడికి వాగ్దానంచేశా. ఆ విషయం చప్పగావుండేదనీ, ప్రత్యేకపరిశోధన చేయవల్సిందీ అని నువ్వనచ్చు. కాని ప్రత్యేక పరిశోధనే మనకి కావలసింది. మనకి వేదాంతం కావలసినంత వుంది. మనకిప్పుడు కావలసిందల్లా ఆచరణ - ఆచరణ...కాని నీకు వొంట్లో యేంబాగున్నట్టులేదే? విసుగెత్తిస్తున్నానా? యింక కొద్దిసేపే వుండి వెళ్ళిపోతాలే..."

---

1 బోనపార్టీ: మూడవ నెపోలియన్ చక్రవర్తి ముద్దుపేరు.

2 పామర్‌స్టన్: (1784-1865) బ్రిటిష్ విదేశాంగ మంత్రిగా కొంతకాలమూ, ప్రధాన మంత్రిగా కొంతకాలము పనిచేసిన రాజకీయవేత్త.

3 విక్టర్‌హ్యూగో: (1802-1885) ప్రపంచ ఖ్యాతిగాంచిన ఫ్రెంచి నవలా రచయిత, కవి, నాటకకర్త.

4 ప్రౌధాన్: (1809-1865) ఫ్రెంచిసోషలిష్టు సాహిత్య రచయిత.

ఈవిధంగా ఉపయెరోవ్ చాలాసేపు వాగి వెళ్లిపోయేటప్పుడు మళ్ళీ ఇంకోమాటు వస్తానని చెప్పి మరీ వెళ్ళిపోయాడు.

హఠాత్తుగా ప్రత్యక్షమైన ఈ ఆగంతుకునిమూలంగా విసిగిపోయి ఇన్సరోవ్ సోఫామీద పడుకుని ఎలీనాకేసి చూస్తూ "యిదీ మీ తరంవాళ్ల వైఖరి. కొంతమంది డాబులుకొట్టొచ్చు. కాని యీ పెద్దమనిషిలాగానే అంతా నిజానికి యెందుకూపనికిరానివాళ్ళు" అన్నాడు.

ఎలీనా భర్తకి జవాబు చెప్పలేదు. ఆ సమయంలో ఆమె తన తరం వాళ్ల విషయంకంటే ఇన్సరోవ్ అనారోగ్యంగురించి యెక్కువగా బాధపడుతోంది. భర్త పక్కనకూర్చుని కుట్టుపని ప్రారంభించింది. ఇన్సరోవ్ కళ్లు మూసుకుని కదలకుండా పడుకున్నాడు. మొహం పీక్కుపోయి పాలిపోయి ఉంది. భయంకరంగా ఉన్న అతని ముఖం, జాపిన చేతులూచూసేసరికి ఆమెహృదయం భయంతో కుంచుకుపోయింది.

"డిమిట్రీ!" అన్నది.

అతను కదలి "యేమిటి? రెన్‌డిచ్ వచ్చాడా?" అని అడిగాడు.

"యింకా రాలేదు. కాని డిమిట్రీ! నీకు జ్వరంగా వుంది. వంట్లో యేం బాగున్నట్లు లేదు. డాక్టర్ని పిలిస్తే బాగుంటుందేమో?"

"బడబడా వాగి అతను నిను భయపెట్టాడు. డాక్టరేం అక్కర్లా. కాసేపు విశ్రాంతిగా పడుకుంటే జ్వరం అదే తగ్గిపోతుంది. భోజనాలయాక మళ్లీయెక్కడకన్నా వెడదాం."

రెండుగంటలు గడిచాయి. ఇంతసేపూ ఇన్సరోవ్ కళ్ళుమూసుకుని సోఫామీద పడుకునేవున్నాడుకాని నిద్రపట్టలేదు. ఎలీనా అతనిపక్కనే కూర్చుంది. చేతిలోని కుట్టుపనివస్తువులు ఆమె వళ్ళో పడిపోయాయి. కదలకుండా బొమ్మలా కూర్చుంది.

"నిద్రపట్టలా?" అని అడిగింది.

"వొక్కక్షణం ఆగు" అని ఇన్సరోవ్ ఆమెచెయ్యి తీసుకుని తల కింద పెట్టుకున్నాడు. "బలె! బావుంది. రెనెడిచ్ రాగానే నన్నులేపు. పడవ సిద్ధంగావుందంటే మరుక్షణం తక్షణం బయలుదేరి వెళ్ళిపోదాం. అంతా సర్దుకోవాలికూడాను."

"సర్దుకోవడం అట్టేసేపు పట్టదు."

"వాడు - పెర్చిగా, యుద్ధం అని యేమిటివాగాడు ?" అన్నాడు కాసేపు ఆగి "అంతా స్వంతకల్పన అనుకుంటూ. మనం వెళ్ళిపోవాలి. వెళ్ళిపోవాలి. యేమాత్రం ఆలస్యం పనికిరాదు. మనం సిద్ధంగావుండాలి."

ఇన్నోకోవ్‌కి నిద్రపట్టింది. గదంతా నిశ్శబ్దంగాఉంది. ఎలీనా పడకకుర్చీ మీద వాలి కిటికీగుండా చాలాసేపుచూసింది. వాతావరణం మారింది. గాలి వీస్తోంది. ఆకాశంలో తెల్లటిమబ్బులు స్వారీచేస్తున్నాయి. దూరాన తెర చాపకొయ్యలు అల్లల్లాడుతున్నాయి. ఎర్రకెలువల పెక్కాలు లేస్తూ, పడుతూ లేస్తూ పడుతున్నాయి. తాతలనాటి గడియారం ఒకటి టక్కుటిక్కుమని కొట్టుకుంటుంటే ఏడుస్తున్నట్టుంది. ఎలీనా కళ్ళుమూసింది. కిందటిరాత్రి ఆమెకి నిద్రేలేదు. ఆమెకీ మగతనిద్రపట్టింది.

ఆమెకి విచిత్రమైన కల వచ్చింది. సాటిక్సినో సరస్సు ఒక పడవలో దాటుతోందట. ఆమె ఎరగనివాంెకెవరో ఆ పడవలో కూడా ఉన్నా రట. వారు మాట్లాడకుండా కూర్చున్నారు. పడవను ఎవరూ నడపడంలేదు. దానంతటదే పోతోంది. ఎలీనాకి భయంవెయ్యలేదు గాని విసుగెత్తింది. వాళ్ళెవళ్ళో, వాళ్ళతోకూడా తనెందుకుందో ఎలీనా తెలుసుకోవాలను కుని చుట్టూచూసింది. ఆమె చూస్తుండగా సరస్సు పెరిగి గల్లుమాయ మయాయి. అది సరస్సుకాదు. హోరుమనే సముద్రం. ఆ సముద్రపు అలలమీద తీవిగా పడవ నడుస్తోంది. సముద్రంలోపలనించి యేదో గర్జిస్తూ పైకిలేచింది. ఆపడవలోని అపరిచితులంతా దిగ్గునలేచి చప్పట్లుకొడుతూ చేతులు ఊపుతున్నారు...ఎలీనా వారిని గుర్తుపట్టింది. వారిలో ఆమె తండ్రి కన్పించాడు...తర్వాత తుపానులా పైకుబికింది. ప్రపంచమంతా గిర్రున తిరుగుతోన్నట్టామెకి అనిపించింది. అంతే - ఇక అంతా గందరగోళం.

ఎలీనా అటూ ఇటూ చూసింది. చుట్టూ అంతా తెలుపురంగుతో తేలిపోతోంది. ఇప్పుడు అంతా మంచుతెలుపు! అంతులేని మంచుతెలుపు! ఆమె పడవలో లేదు. మాస్కోనించి బయలుదేరేప్పుడు ఎక్కిన బండి లాంటి బండిలో ప్రయాణంచేస్తోంది. ఆమె పక్కన పాతకోటు తొడుక్కుని ఓ చిన్నిపిల్ల కూర్చుని ఉంది. ఆ పిల్లకేసి ఎలీనా తేరిపారచూసింది. ఆ పిల్ల చాలా సంవత్సరాలకితం ఆమెఎరుగున్న ముష్టిపిల్ల, కాట్యా. ఎలీనాకి భయం

వేసింది. "ఆ పిల్ల నిజంగా చచ్చిపోలేదా ?" అనుకుంది ఎలీనా. "కాట్యా! మన మెక్కాడికి వెడుతున్నాం ?"

కాట్యా జవాబు చెప్పకుండా కోటు ఇంకా గట్టిగా దగ్గిరగా లాక్కుంది. ఆ పిల్ల కొయ్యబారిపోయి ఉంది. ఎలీనాకూడా అలానే ఉంది. రోడ్డుకేసి చూసింది. దూరాన మంచులో తెల్లగా గోపురాలు, వెండిలాగా మెరిసే శిఖరాలతో ఓ నగరం పొడగట్టింది. "కాట్యా! కాట్యా! యిది మాస్కోయేనా ?" అని అడిగింది ఎలీనా! "కాదు. అది మాస్కో కాదు. అది సోలేవెట్స్కీమఠం" అనుకుంది. అక్కడ అంతులేని ఇరుకుకొట్లల్లో - తేనె పట్టు అరలలా సందులేని అరలలో డిమిట్రీ బంధింపబడి ఉన్నాడు. "అతన్ని విడిపించాలి." అనుకుంది. హఠాత్తుగా నోరు తెరుచుకున్న పిశాచంలా ఓ అఘాతం ఆమె ముందు తెరుచుకుంది. బండి బోల్తా కొడుతోంది. కాట్యా నవ్వ నారంభించింది. ఆ అఘాతంనించి "ఎలీనా! ఎలీనా !" అని ఎవరో పిలిచినట్లనిపించింది.

"ఎలీనా ?" ఆ ధ్వని సుస్పష్టంగా సమీపంలో వినిపించింది. చట్టున తల పైకెత్తి, ఎలీనా తిరిగి చూసింది. ఆమెకి గోచరించిన దృశ్యం చూసి మూర్ఛపోయింది. ఇన్సరోవ్ మంచులా - తనకు కలలో కనిపించిన మంచులా - తెల్లగా పాలిపోయి సోఫాలో కూర్చుని ఆమెకేసి కళ్లు నిండా విప్పి తెల్లబోయి చూస్తున్నాడు. కళ్లు భయం కొల్పుతున్నాయి. జుట్టు నుదురుమీద చికాకుగా పడిఉంది. పెదవులు విచిత్రంగా తెరచుకున్నాయి. హఠాత్తుగా మారిపోయిన అతని ఆకృతిలో భయం, ప్రేమ తొణికిసలాడుతున్నాయి.

"ఎలీనా ! నేను యీ లోకంనించి వెళ్లిపోతున్నాను."

బావురుమని ఏడుస్తూ అతని వక్షంమీదపడి ఎలీనా గట్టిగా అదుముకుంది.

"అంతా అయిపోయింది. యిక లాభంలేదు. శెలవు ప్రియతమా! శెలవు, జన్మభూమి శెలవు!" అని తిరిగీ సోఫామీదకు వాలిపోయాడు.

ఎలీనా పరుగెత్తుకుంటూ బయటికివెళ్ళి సహాయం అర్థించింది. ఓ సేవకుడు డాక్టరుకోసం పరుగెత్తాడు. ఎలీనా తిరిగివచ్చి ఇన్సరోవ్‌ను కావలించుకుంది.

సరిగ్గా ఆ సమయానికి ఓ పురుషవ్యక్తి గుమ్మంలో ప్రత్యక్షమయాడు. విశాలమైన వక్షస్థలం, ఎండకి కదిలిన ముఖం, ముతకకోటు, అంచు ముందుకువంగిన హాటూ పెట్టుకున్నాడు. గుమ్మంల్లో ఆగి కంటపడ్డ దృశ్యానికి కంగారుపడిపోయాడు.

"రెన్‌డిచ్! వచ్చావా? చూడు భగవాన్! ఆయన మూర్ఛపోయాడు. యేదిటో! భగవాన్! భగవాన్! నిన్న తిరుగుతూనే ఉన్నాడు. నిమిషంకితందాకా నాతో మాట్లాడుతూనే ఉన్నాడు..."

రెన్‌డిచ్ మాట్లాడకుండా గుమ్మంలో ఒత్తిగిలి నిలబడ్డాడు. టోపా. సులోచనాలూ పెట్టుకుని ఓ పొట్టిమనిషి చరచరా గదిలోకి వెళ్లాడు. ఆ సమయానికి హోటల్లో ఉంటున్న డాక్టరతను. ఇన్నరోవ్‌దగ్గరికి వెళ్లి పరీక్షచేసి, ఒకటిరెండు నిమిషాలతర్వాత అన్నాడు:

"ఈయనగారు మరణించాడు. ఊపిరితిత్తుల వ్యాధీ రక్తనాళాలవాపూ చావుకు కారణమయాయి."

# 3౯

ఆమర్నాడు అదేగదిలో కిటికీదగ్గిర రెన్‌డిచ్ నిలబడిఉన్నాడు. అతనికి ఎదురుగా ఎలీనా శాలువాకప్పుకుని కూర్చుని ఉంది. పక్కగదిలో ఇన్సరోవ్ భౌతికదేహం ఉంది. ఎలీనా ముఖంలో పూర్తిగా భయం కనిపిస్తోంది. ఆమె కనుబొమలమధ్య రెండు తీక్ష్ణరేఖలు ఆవిర్భవించి కదలికలేని ఆమె నేత్రాలలో అలసటాభావం గోచరింపజేస్తున్నాయి. కిటికీలో అన్నావాసిలెవ్నా రాసినజాబు పడిఉంది. అందులో ఒక నెలరోజులపాటైనా వచ్చి మాస్కోలో ఉండమని కోరుతూ అన్నా రాసింది. అన్నావాసిలెవ్నా తన ఒంటరితనాన్ని గురించీ నికొలాయ్ ఆర్టియోమెవిచ్‌ని గురించీ తెలిపింది. ఇన్సరోవ్‌కి అభినందనాలు తెలుపుతూ అతని ఆరోగ్యవిషయం తెల్పమనీ ఎలీనాను ఒకసారి పంపమనీ కోరింది.

రెన్‌డిచ్ అతి విశ్వాసపాత్రుడు. నావికుడు. బల్గేరియాలో సంచారం చేస్తున్నప్పుడు ఇన్సరోవ్‌కి ఇతని పరిచయం కలిగింది. వెనీస్‌లో ఉండగా ఇన్సరోవ్ ఇతనికోసం వెదికి పట్టుకున్నాడు. రెన్‌డిచ్ వట్టి మొరటుమనిషి. మంచి ధైర్యశాలి. పట్టుదల మనిషి, స్లావ్ ఉద్యమానికి జీవితంఅర్పించిన ధీరుడు. టర్కీవాళ్లన్నా, ఆస్ట్రియన్లన్నా అతనికి పరమాసహ్యం.

"వెనీస్‌లో నువ్వింకా యెంతకాలం వుండాలి?" అని ఎలీనా ఇటాలియన్ భాషలో అతన్ని అడిగింది. ఆమెముఖంలో లాగానే స్వరంలోనూ జీవంలేదు.

"ఓరోజు. నావలో సరుకు వేసుకోవాలి. అనుమానం యేమాత్రం కల్గకుండా చూసుకోవాలి. తర్వాత సరాసరి జావావెళ్తా. మాదేశస్తులకి

యిది మహాచెడువార్త-అతనికోసం చాలాకాలంనించీ నిరీక్షిస్తున్నారు. అతని మీద యెంతో ఆశపెట్టుకున్నారు కూడా."

"యెంతో ఆశపెట్టుకున్నారుకూడా" అంది ఎలీనా అనుకోకుండానే. "సమాధి యెపుడు చేస్తావ్?" కాసేపు ఆగి ఆమె అంది:? "రేపు" "రేపా? అయితే నే నాగుతాను. అతని సమాధిలో ఓ గుప్పెడుమట్టి వేయాలని వుంది. పైగా నీకు సాయంచేయ్యాలి. కాని అతన్ని స్లావ్‌గడ్డమీద సమాధి చేయడం ఉత్తమం" ఎలీనా, రెన్‌డిచ్‌కేసి చూసి "కాప్టెన్! మా యిద్దర్నీ తీసికెళ్ళి ఆవతలవొడ్డున దింపు. సాధ్యమవుతుందా?" అన్నది. రెన్‌డిచ్ కొంచెంసేపు ఆలోచించి "సాధ్యమవుతుందికాని చాలా కష్టపడాలి. అధికార్లమూలంగా చాలా చిక్కులువచ్చి పడతాయి...యెలాగో అలాగ వెళ్లి అక్కడ సమాధిచేసామనుకో మళ్ళీ నిన్ను తిరిగి తీసుకురావడం యెలా?"

"నన్నేం మళ్ళీ యిక్కడికి తీసుకురానక్కరలేదు."

"యేమిటీ? అయితే మరెక్కడుంటా?"

"అక్కడే, యెదో పనీపాటా చూసుకుంటా. మా యిద్దర్నీ అక్కడికి ముందు తీసుకెడుదూ."

రెన్‌డిచ్ మెడవెనక గోక్కొని "సరే. నీ యిష్టప్రకారమే కానీ. కాని చాలా అవస్థపడాలి. వెళ్ళి ప్రయత్నిస్తా. యిక్కడేవుండు - రెండు గంటల్లో తిరిగివస్తా."

రెన్‌డిచ్ వెళ్ళిపోగానే ఎలీనా పక్క గదిలోకి వెళ్ళి గోడ కానుకుని రాతిబొమ్మలా చాలాసేపు నిలబడింది. తర్వాత మోకాళ్ళమీద పడి ప్రార్థన చేద్దామనుకుంది. కాని ప్రార్థన చేయలేకపోయింది. మనసులో యెవరిమీదా ఆమెకికోపంలేదు. తమ మీద దయయెందుకు చూపలేదనిగాని, యెందుకు రక్షించలేదనిగ్గాని, తాము తప్పిందచేసివుంటే ఆ తప్పిదానికి మించిన శిక్ష యెందుకు విధించావనిగాని భగవంతుని అడగ దలచుకోలేదు. మనమంతా పాపులమే. ఎంత గొప్ప మేధావి అయినా, ఎంత గొప్ప మానవ సేవకుడైనా మానవులకు తాను చేసిన సహాయం అస్కారం చేసుకుని బతికే హక్కు వుందనుకోలేదు. ... ఎలీనా ప్రార్థన చేయలేకపోయి ది. కొయ్యబారిపోయింది.

ఆ రాత్రి ఇన్సరోవ్ దంపతులు బసచేసిన హోటలు నుంచి ఓ పడవ బయలుదేరింది. అందులో ఎలీనా, రెన్‌డిచ్‌లు కూర్చున్నారు. కూడా

నల్లటి గుడ్డ కప్పిన పొడుగాంటి పెట్టె ఉంది. గంటసేపటికి పోర్పరుముఖ ద్వారంలో లంగరు వేసుకు ఉన్న నావను చేరారు. ఎలీనా, రెన్‌డిచ్ నావ ఎక్కారు. సేవకులు పెట్టెను నావలో పెట్టారు. అర్ధరాత్రి తుఫాను వీచింది. కాని తెల్లవారేసరికి నావ 'లిడో' దాటింది. ఆ పగలు తుఫాను భీభత్సరూపం దాల్చింది. లయడ్ నావికా కార్యాలయంలోని అనుభవంగల నావికులు తలొంచి ఏదో చెడువార్త వింటామనుకున్నారు. వెనీస్, ట్రీస్టీ తీరాల మధ్య అడ్రియాటిక్ సముద్రం అతి ప్రమాద భరితమైంది.

ఎలీనా వెనీస్ వదిలి వెళ్ళిన మూడు వారాల తర్వాత మాస్కోలోని అన్నావాసిలెవ్నాకు కింది ఉత్తరం వచ్చింది.

ప్రియతమమైన తలిదండ్రులారా!

శాశ్వతంగా మీ దగ్గర శలవు తీసుకుంటున్నాను. నన్నింక మీరు చూడరు. నిన్న డిమిట్రీ చనిపోయాడు. ఇక నాపని ఆఖరైంది. ఇవాళ అతనిక ళేబరాన్ని 'జారా' తీసుకుపోతున్నా. అక్కడ దాన్ని సమాధిచేస్తా. తర్వాత నా గతి యేమవుతుందో నాకే తెలియదు. డిమిట్రీ జన్మస్థానమే నా జన్మస్థానం. మరేదీకాదు. అక్కడ తిరుగుబాటుకూ, యుద్ధానికీ సన్నిద్ధులవుతున్నారు. నేను వైద్య దళంలో చేరి గాయపడ్డవారికీ, రోగులకూ పరిచర్య చేస్తాను. నాగతి యేమవుంతుందో తెలీదు. కాని డిమిట్రీ మరణించాడు. కాబట్టి అతని స్మృతికీ, జీవితమంతా అతను వినియోగించిన ఉద్యమానికీ నా జీవితం అంకితం చేస్తాను. నేను బల్గేరియా, సెర్బియా భాషలు నేర్చుకున్నా. కాని యిదంతా తట్టుకుని నేను మనగలడం కష్టం. ఆదైనా మంచిదే. నేను ఓ అఖాతం వొడ్డున నిల్చున్నా. దాంటో పడి పోవడం ఖాయం. విధి మా అందర్నీ ఒకచోట చేర్చింది. బహుశా నేనే అతని మృత్యువుకి కారకురాల్నేమో! నేను సౌఖ్యంకోసం అన్వేషించాను. మృత్యువును ఎదుర్కొంటున్నాను. ఇలా జరగవలసి వుందేమో?... నేను తప్పిదంచేశానేమో? కాని మృత్యువు గాయాలన్నిటిని మాన్పి సామరస్యం కలిగిస్తుందంటారుకదూ! నీకు దుఃఖం తెచ్చిపెట్టినందుకు క్షమించు. నేను కావాలని మీకు విచారం కల్గించడంలేదు. ఇక రష్యాకు తిరిగివచ్చే విషయం ఊహుఁ- రష్యాలో యేవుంది?

నా ఆఖరి ముద్దు స్వీకరించు. నన్నుమాత్రం నిరసించవద్దు."

నాటినుంచీ అయిదు సంవత్సరాలు గడిచాయి. ఎలీనా సంగతి ఎవరికీ తెలియలేదు. ఉత్తరాలు రాశారు. వాకబుచేశారు. కాని ప్రయోజనం కలగలా. సంధి జరిగిన తర్వాత నికొలాయ్, వెనీస్, జారా వెళ్ళి ఎలీనా కోసం వెతికాడు. కాని పాఠకులకు తెలిసిన విషయాలే వెనీస్‌లో అతనికీ తెలిసాయి. జారాలో రెన్‌డిచ్‌ని గురించిగాని అతను అద్దెకు తీసుకున్న నావను గురించిగాని ఎవరూ ఇదమిద్ధమని చెప్పలేక పోయారు. కొన్ని సంవత్సరాల క్రితం పెద్దతుఫాను తర్వాత ఎవరిదో శవం పెట్టిన పెట్టె ఒకటి వడ్డుకు కొట్టుకు వచ్చిందని గట్టిపుకార్లు మాత్రం ప్రబలాయి. కొంత మంది చెప్పడం, ఆ పెట్టె దానంతటది కొట్టుకురాలేదని, ఎవరో విదేశస్తురాలు ఆపెట్టెతెచ్చి సమాధి చేసిందనీ. మరికొంతమంది ఆరోజుల్లో సమీకరించిన సైన్యంతో ఆమెని హెర్జిగోవినాలో చూచామనీ చెప్పారు. ఆమెధరించిన దుస్తులు పైనించి కిందవరకు నల్లటివని వర్ణించారు.

ఏమైనప్పటికీ ఎలీనా జాడ ఏమాత్రం తెలీలేదు. ఎక్కడైనా రహస్యంగా దాక్కొని ఉందో, ప్రపంచ నాటకంలో ఆమె తన పాత్రను ముగించిందో, ఆమె ఆత్మ శాశ్వతంగా విశ్రాంతి తీసుకుందో, మృత్యువు ఆమె నావరించిందో ఎవరూ చెప్పలేకపోయారు.

ఒకొక్కప్పుడు మానవుడు హఠాత్తుగా వణికిపోతూ మేల్కొని "నా కప్పుడే ముప్పైయి యేండ్లా, నలభయా, యేభయ్యా? జీవితం యింత త్వరగా యెలా వెళ్ళిపోయింది? మృత్యువింత దగ్గరగాయెలావచ్చింది?" అనుకుంటాడు. జాలరిలాగామృత్యువు తనవలలోపడ్డవారిని ఇంకా కొంతకాలం మననిస్తుంది. చుట్టూ వల కమ్మి ఉన్నా చేప ఇంకానీట్లో ఈత్తూనే ఉంటుంది. జాలరి తగుసమయంలో వలని లాగేస్తాడు.

* * * *

మన కథలోని తక్కినపాత్రలు ఎలావున్నారు?

అన్నావాసిలెవ్నా ఇంకా బతికేఉంది. ఆమె తలమీద ఈ పిడుగు పడ్డతర్వాత చాలా ముసలిదానిలాగా కన్పించ సాగింది. గొణుగుడు తగ్గింది కాని విచారం ఇనుమడించింది. నికొలాయ్ ఆర్టియోమెవిచ్‌కికూడా ముసలితనం వచ్చినట్లు కనిపిస్తుంది. తల నెరసిపోయింది. అవగస్టినా క్రిస్టియనోవ్నాతో తెగతెంపులు చేసుకున్నాడు. ఇపుడు విదేశీ అన్న ప్రతితీదీ

నిరసించ సాగాడు. అతనియింట్లో వంటమనిషి ముప్పయి ఏండ్ల రష్యను సుందరి పట్టు దుస్తులు వేసుకుంటూ, బంగారపు ఉంగరాలు, బంగారు చెవి పోగులూ పెట్టుకొంటోంది. కర్నటోవస్కీ కూడా మానవుడే కదూ, అంద మైన స్త్రీలను మెచ్చుకోగలడు కూడా. జోయాని పెళ్ళిచేసుకున్నాడు. జోయా వినయ విధేయతలతో మెలంగుతూ జర్మన్ భాషలో ఆలోచించ డమే మానేసింది. బెర్సెనీవ్ హీడెన్ బెర్గ్‌లో ఉన్నాడు. ప్రభుత్వ వేతనం మీద విదేశాలకు వెళ్ళి బెర్లిన్, పారిస్ సందర్శించాడు. కాలం వృథా పుచ్చడంలేదు. మంచి అధ్యాపకుడుగా తయారవుతాడు. రెండు వ్యాసాలు, ప్రాచీన జర్మన్ న్యాయసూత్రాలమీదా, గ్రామీననాగరికతమీదా ప్రచు రించాడు. కాని ఆ రెండువ్యాసాలూ నారికేళపాకంలో నడవడం, విదేశీ పదాలు బహుళంగా ఉండటం మాత్రం విచారకరం.

షూబిన్ రోమ్‌నగరంలో ఉన్నాడు. అతను తన కాలమంతా శిల్ప కళకే వినియోగిస్తూ యువశిల్పులలో ఉత్తముడుగా పేరుపొందాడు. విమర్శకులు, అతను ప్రాచీన శిల్పాలు బాగా అధ్యయనం చేయలేదనీ, అతని శిల్పాలలో 'శైలి' లేదనీ, అతని కళ ఫ్రెంచి సంప్రదాయానికి చెందిన దనీ అంటారు. ఇంగ్లీషు, అమెరికన్ కళాపోషకులు శిల్పాలు తయారు చెయ్యమని అతన్ని కోరారు.

ఇటీవల అతని శిల్పఖండం ఒకటి దేశంలో గందరగోళం బయలుదేర తీసింది. సుప్రసిద్ధ రష్యన్ జమీందారు బోబోష్కిన్ ఈ శిల్పఖండానికి వెయ్యి * స్కూడోలు ఇవ్వడానికి సంసిద్ధుడై చివరికి ఒక నికారసు ఫ్రెంచి శిల్పిరచించిన "వసంతదేవత ఒడిలో ప్రేమ విఫలమై మరణించిన రైతుపిల్ల" అనే శిల్పాన్ని మూడువేల స్కూడోలకు కొన్నాడు. మారందల్లా ఒక్క యువార్ ఇవనోవిచ్. షూబిన్ ఇతనితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపు తూంటాడు. ఇటీవలే జాబురాశాడు. "పాపం! ఎలీనా పెళ్ళిచేసుకుందని విన్ననాటి రాత్రి నీపక్కమీద కూర్చొని నీతో మాట్లాడుతుండగా నువు నాతో యేమన్నావో జ్ఞాపకం వుందా? 'సిసలైన మనుషులు మనమధ్య యెపుడు వుద్భవిస్తారో' అని నేనడిగా. నువు జవాబిచ్చావు: 'ఉద్భ

---

స్కూడో: రోమన్ నాణెం. విలువ సుమారు మూడు రూపాయలు

విస్తారు. అని' ఓ యమధర్మరాజా ! నేడు, యేకాంతప్రదేశం నించి మళ్ళా అడుగుతున్నా. యేదిటి యువార్ ఇవనోవిచ్! వుద్భవిస్తున్నారా ?"

యువార్ ఇవనోవిచ్ ఉత్తరం చదువుతూ వెళ్ళు ఆడించి ఎక్కడో దూరంలోకి అవలోకించాడు.








# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA118B115 |
| పుస్తకం పేరు | వేగుచుక్క |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 219 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | ii |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | MOUNIKA |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |